శ్రీరస్తు

# శ్రీ శివగీత

( శ్లోకం - తాత్పర్యము )

తాత్పర్యకర్త :


పెద్దమఠం రాచవీర దేవర








పబ్లిషర్స్

**టాగూరు పబ్లిషింగ్ హౌస్**

కాచీగూడా చౌరస్తా, హైదరాబాదు - 500 027.

సోల్ డిస్ట్రిబ్యూటర్స్

**బాలసరస్వతీ బుక్ డిపో**

ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్ కర్నూలు - 518 001

టి. వెంకటేశ్వర్లు శెట్టి చేంబర్స్

నెం.4 సుంకురామ శెట్టి వీధి, మద్రాసు - 600 001





**1999**

[వెల : 45/–

# తొలిపలుకు
## (పీఠిక)

సృష్టి-స్థితి-లయములకు గారణీభూతుడైన యాపరమశివుడు శ్రీరామునికి బ్రత్యక్షమై పాశుపతాస్త్రము నొసగును. ఈ విషయం శివగీతలో వివరించబడినది. శ్రీరాముఁడుదన భార్యను గోల్పోయి సోదరుఁడైన లక్ష్మణునితోడు గాగఘనారణ్యములను అన్వేషిస్తు దిరుగుతు విలపించుచున్న సమయమున అతని యొక్క విరహబాధను జ్ఞానదృష్టితో గనుగొనిన శ్రీ అగస్త్య మహాఋషి యాతనిని సమీపించి సంసార నిస్సారమును బోధించి యోదార్చి శ్రీరాముని ప్రార్థన మేరకు విరజాదీక్ష నొసంగి శివుని గూర్చి నీవు తపంబొనర్చి నీవు శివుని యనుగ్రహము వలన పాశుపతాస్త్రమును బడసిననే లోక కంటకుఁడుగా మారిన (పేరొందిన) మహాబలశాలియగు రావణాసురుని జయించగలవు. అది లేనిచో నాతనిని నీవు జయించుట గడుం గడు దుర్లభము. కావున నీవు ఆ మృత్యుంజయుని అనుగ్రహమునకు బాత్రుడవు గమ్మని యుద్బోధించెను. ఆ మునివర్యుని యానతి మేరకు శ్రీరాముఁడు రామేశ్వర పుణ్యక్షేత్రమున గోదావరీ తీరము

నందు శివలింగమును బ్రతిష్ఠింపజేసి అనన్యభక్తితో శ్రీరాముఁడు శివునారాధించెను. ఇట్లు గొంతకాలము గడచిపోగా శ్రీరాముని దృఢమైన భక్తికి మెచ్చి శివుఁడు బ్రత్యక్షమై పాశుపతాస్త్రమును ప్రసాదించి జీవ-శరీరముల నిర్మాణమును గురించి సుదీర్ఘముగానుపదేశించియున్నాఁడు. ఈ విషయమునే శివగీతలో విస్తారముగా వివరించబడినది.

ఇట్టి పరమపవిత్రము మోక్షదాయకమగు నీ శివగీతను వేదవ్యాసులవారు సంస్కృతభాషలో రచించిన అష్టాదశ పురాణములలో పద్మపురాణ మొకటి. దానియందంతర్గతమైయున్నదే శివగీత ఇది రామాయణ కాలమునకు సంబంధించియున్నది. ఇది త్రేతాయుగములో జరిగిన గాథ. ఇకపోతే గీతావి(భగవద్గీత)ర్భావము ద్వాపారయుగము చివర కలికాలారంభములో కౌరవ పాండవులకు కురుక్షేత్రమున జరిగిన యుద్ధమున అర్జునునకు సారథియైన శ్రీకృష్ణుడు పాండవమధ్యముఁడైన అర్జునునకు భగవద్గీతనుపదేశించియున్నాడు. ఇక్కడ శివగీత మరియు భగవద్గీతలో చర్చింపఁబడిన విషయములు చాలామట్టుకు విషయ సాదృశ్య-సామీప్య సారూప్యతను మరియు కొన్ని శ్లోకములు యథాతథము(రీతి)గా నుట్టుంకించబడినవి.

పోగా ఒకే విషయప్రతిపాదననిచట వివరించబడి "సర్వాంత ర్యామియు నేనే అయి ఉన్నాను, సమస్త ప్రపంచము నానుండే యుత్పన్నమై చివరికి నాయందే లీనమగుచున్నదనియు, బ్రహ్మ-విష్ణు-ఇంద్రాది దేవతలను నేనే సృష్టించి వారివారికాయాపదవుల నొసఁగినవాడను నేనేయనియు, పంచభూతముల స్రష్టను నేనేయ నియు, జనులే యే ఆకారములోనే యే దేవతలను బూజించినను, ధ్యానించినను వారలకాయా రూపమున ప్రతిఫలము నొసఁగువా డను నేనేయనియు, అవుతే అట్టివారికి ఫలము తక్కువ లభించున నియు, పరశివమూర్తి శ్రీరామునకుపదేశించియున్నాడు. అందరు జనన మరణములకు లోబడినవారే, చివరికి నేనొక్కడినే శాశ్వతముగా నుండువాడను నేనే, యుగయుగములందును లోకమున నవతరించి దుష్టులను దునుమాడి శిష్టులను రక్షించువాడను నేనే యనెను. ఆత్మ సుఖ-దుఃఖములకతీతముగానుండి సాక్షిభూతమైయుండునదే గాని వాటికిలోబడియుండదు. ఘటాకాశమువలె ఘటము పగిలి ముక్క లైనను అందలి యాకాశము అంతయును అథవానాశమనునది యుండ వని ప్రబోధించెను. జ్ఞాన-కర్మసమునిచ్చయముల రెండింటిని మాన వులు అథవాయోగిపుంగవలు ఆచరించ పరమాత్ముని దర్శించు

టకు ధ్యానమొక్కటే సాధకమనెను. వేదపఠనము యజ్ఞయాగముల జేయుట వలన ప్రయోజనమేమియుండదని యుద్బోధించెను. పరమాత్మను ధ్యానించుట, మరియునుపాశించుటలో సమస్తమానవుల కవకాశమున్నదనియు, ఇట ఉచ్ఛ-నీచ-వర్గములుగాని, అగ్రజాతి నుండి మొదలుకొని అంత్యజాతి వరకు పరమాత్ముని యనన్యభక్తితో సేవించి ముక్తిని బడయుటలో అందరికి సమానప్రతిపత్తిగలదని యాదేశించెను. అహంకార మమకారములు కామ-క్రోధ-లోభ-మోహముల కధీనమైన వారికి మోక్షములభించుట "నభః పుష్పము" వంటిదనెను.

శ్లో॥ విహాయకామాన్సర్వాన్ - పుమాంశ్చరతినిస్పృహః ।
నిర్మమోనిరహంకారః - సశాంతిమధిగచ్ఛతి ॥
(2,అ,సాంఖ్యయోగః, శ్లో॥ 71) భగవద్గీత.

శ్లో॥ నిర్మమో నిరహంకార - స్సమస్సంగవివర్జితః ।
సదా శాంత్యాదియుక్త స్సన్ - ఆత్మన్యాత్మాన మీక్షతే ॥
(13,అ,శ్లో,23) శివగీత

యత్సదా ధ్యానయోగేన - తన్నిదిధ్యాసనం స్మృతమ్ ॥
(13,అ,శ్లో 23) శివగీత.

తా॥ ఎల్లప్పుడు శాంతి శమదమాది సమస్త సద్గుణములతోగూడి మమకార, అహంకారములు, లేక సుఖ-దుఃఖములయందు సమతాభావము గలిగి ప్రాపంచిక సంబంధమును (బ్రహ్మచర్యముతో నుండి) వదలి, నిరంతరము ధ్యానయోగము ద్వారా శ్రవణ - మననములచేత నిశ్చిత-నిశ్చల-నిర్మలమైన మనస్సుచేత పరమాత్మను తనలో జూచుకొనుటే నిది ధ్యాసమనబడును.

శ్లో॥ సమస్తే భ్యోరజోంశేభ్యః - పంచప్రాణాదివాయవః ।
జాయంతే సప్తదశక - మేవంలింగ శరీరకం ॥

(14, అ, శ్లో॥ 21) శివగీత.

ఏ తల్లింగ శరిరంతు - తప్తాయః పిండవద్భృతః ।
పరస్పరాధ్యాసయోగా-త్సాక్షి చైతన్య సంయుతమ్ ॥

(14, అ,శ్లో॥ 22) శివగీత.

తా॥ పంచభూతముల యొక్క రజోంశముల సమిష్టిచేత, ప్రాణాపానవాయువులును, మనస్సు-బుద్ధి మొదలగునవి గలిసి యీ పది యేడునుగలసిన లింగశరీరమునంబడును, వేడిజేయబడిన యినుపగుండు అగ్నితోగూడుకొనియున్నట్లు ఇట్టి లింగశరీరము పరస్పరాధ్యాససంబంధముచేత యెల్లప్పుడు సాక్షియగు చైతన్యముతో గూడియుండును.

శ్లో॥ నాహం సర్వేంద్రియగ్రాహ్యః - సర్వేషాంగ్రాహకోహ్యహమ్।
జ్ఞాతా2హం సర్వలోకస్య - మమజ్ఞాతానవిద్యతె ॥
(10,అ,శ్లో॥7) శివగీత.

దూరస్సర్వవికారాణాం - పరిణామాదికస్యచ ।
యతోవాచోనివర్తంతె - అప్రాప్యమనసాసహ॥
(10,అ,శ్లో॥ 8) శివగీత.

ఆనందంబ్రహ్మమాంజ్ఞాత్వా నబిభేతికుతశ్చన ।
యస్తుసర్వాణిభూతాని - మయ్యేవేతి ప్రపశ్యతి ॥
(10,అ,శ్లో॥ 9) శివగీత.

తా॥ నేనే యింద్రియములచేతను దెలియరానివాడను, సర్వమును గ్రహించువాడను, నన్నుదెలిసికొన్నవాఁడులేడు, సర్వవికారములు మరియు జనను మరణములు మొదలగు పరిణామములు నాకులేవు. ఏ పరమాత్మను వర్ణించుటకు మనస్సుతోసహా సమస్త ఇంద్రియములు శక్తిలేనివగుచున్నవో అట్టి యానంద స్వరూపుఁడనైన పరబ్రహ్మనైన నన్ను దెలిసికొన్నవాఁడు. ఇఁక దేనినుండియు భయమందడు.

శ్లో॥ మాంచ సర్వేషు సభూతేషు - తతోనవిజుగుప్సతే ।
యస్న సర్వాణిభూతాని - హ్యాత్మైవాభూ ద్విజానతః ॥
(10,అ,10 శ్లో॥)

తా॥ నన్ను సమస్తభూతములయందు ఎవడు దర్శింపఁగలడో అట్టి వాడెదెనికసహించుకొనడు, జ్ఞాని సర్వభూతములను దశవలెనె జూచును.

శ్లో॥ ఏవమేవ మహాబాహో - నాత్రకార్యా విచారణా ।
దైవీహ్యేషాగుణమయీ - మమమాయాదురత్యయా ॥
(14,అ,శ్లో॥ 36)

తా॥ ఓ! రామా! ఈ విషయమున నీవు జింతించవలదు, సత్వ-రజ-తమో-గుణాత్మకమైన నాయా. మాయనుదాటుటకు గష్ట సాధ్యమైనది.

శ్లో॥ మామేవయే ప్రపద్యంతె - మాయామేతాంతరంతితే ।
అభక్తాయే మహాబాహో - మమశ్రద్ధా వివర్జితాః ॥
(14,అ,శ్లో॥ 37) శివగీత

ఫలంకామయమానస్తె - చైహికాముష్మికాదికం ।
క్షయిష్ణ్వాల్పంసాతిశయం - తతః కర్మఫలంమతమ్ ॥
(14,అ,38) శివగీత

తా॥ నన్నెవరు సంపూర్ణభక్తితో శరణు బొందుచున్నారో వారు ఈ నా మాయ నుండి తరింతురు. ఓ! రామా! నాయందు శ్రద్ధాభక్తులు లేక నన్ను బూజింపక, ఇహ పరలోక కామ్యఫలము నాశించుచు సంచరించువారు.

శ్లో॥ తదవిజ్ఞాయకర్మాణి - యే కుర్వంతి నరాధమాః ।
మాతుః పతంతితేగర్భే - మృత్యోర్వ క్త్రే పునఃపునః ॥
(14,అ,శ్లో। 39) శివగీత

శ్లో॥ నానాయోనిషు జాతస్య - దేహినోయస్యకస్యచిత్ ।
కోటిజన్మార్జితైః పుణ్యై - ర్మయిభక్తిః ప్రజాయతే ॥
(14,అ,శ్లో॥ 40) శివగీత

తా॥ అట్టి విషయము నెఱుంగమియే నరాధములు కర్మలనాచరింతురో వారు మాటిమాటికి మాతృగర్భమునబడి బుట్టుచు మృత్యుముఖమునబడి పలుబాధల ననుభవింతురు, నానా యోనులందు జన్మించు జీవులలోనే యొక్కరికో ఒకరికియనేక జన్మల పుణ్యార్జితము వలన నాయందుభక్తి గలుగును.

శ్లో॥ సయేవలభతే జ్ఞానం - మద్భక్తా శ్రద్ధయాన్వితాః ।
నాన్యః కర్మాణి కుర్వాణో - జన్మకోటిశతైరపి ॥
(14 అ,శ్లో॥ 41) శివగీత

"తతః సర్వంపరిత్యజ్య - మద్భక్తిం సముదాహర"

(42 శ్లో॥)

తా॥ నాయందు శ్రద్ధాభక్తులు గలిగి నన్ను బూజించువాడే జ్ఞానము నుబొందుచున్నాడు, శతకోటి కామ్యకర్మలఁజేసినను ఇట్టి జ్ఞానము నుబొందలేడు, కావున నా సమస్తమునూ బరిత్యజించి నాయందు భక్తినార్జించుము.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య - మామేకం శరణం వ్రజ ।

(42/1)

అహంత్వా సర్వపాపేభ్యో - మోచయిష్యామిమాశుచః ।

శ్లో॥ యత్కరోషియదశ్నాసి - యజ్జుహోషిదదాసియత్ ॥

(43 శ్లో॥)

యత్తపస్యసిరామత్వం - తత్కురుష్వమదర్పణం ।

తతః పరతరానాస్తి - భక్తిర్మయిరఘూత్తమ ॥

(14 అ,శ్లో॥ 44) శివగీత

తా॥ సమస్త ధర్మములను వదలి నన్నొక్కడినే శరణు బొందుము. నేను నిన్ను సమస్త పాపముల నుండి విముక్తుని గావించెదను, దుఃఖించకుము. ఓ! రామా! వేయ్యేల? నీవు చేయునది, నీవు భుజించునది,

హోమము జేయునది, దానమొనర్చునది, నీవు గావించు తపస్సును (తపంబును) ఆ సర్వమును నాకర్పించుము, ఇట్లు నాయందు భక్తి గలిగియుండునదే సర్వోత్కృష్టమైనది, ఇంతకంటెను సర్వోత్కృష్ట మైనది మరొకటిలేదు సుమా!

## లింగ శరీర నిర్మాణము

శ్లో॥ పంచకర్మేంద్రియాణ్యేవ - పంచజ్ఞానేంద్రియాణిచ ।
మనోబుద్ధిరహంకారశ్చిత్తంచేతి చతుష్టయమ్ ॥

(10,అ,శ్లో॥ 15) శివగీత

వాయవః పంచమిళితాః - యాంతిలింగశరీరతామ్ ।
తత్రావిద్య సమాయుక్తం - చైతన్యం ప్రతిబింబితమ్ ॥

(10 అ, శ్లో॥ 16) శివగీత

తా॥ ఐదు కర్మేంద్రియములు. ఐదు జ్ఞానేంద్రియములు. మనో, బుద్ధి, చిత్త,.అహంకారములు. ఈ నాలుగు ప్రాణాపానాది పంచ వాయువులు, ఈ మొత్తము గలిసిన పందొమ్మిది(19)టిని లింగశ రీరమందురు. అట్టి లింగశరీరమునందు అవిద్యతోగూడిన చైతన్యము ప్రతిబింబితమై యొప్పుచున్నది.

శ్లో॥ దృశ్యతేత్వగ్రయాబుధ్యా - సూక్ష్మయాసూక్ష్మదర్శిభిః ।
అనాద్య విద్యయాయుక్త - స్తథాహ్యేకోహమవ్యయః ॥
అవ్యాకృత రూపో-జగత్కర్తామహేశ్వరః ॥

(10 అ,శ్లో॥ 12)

తా॥ పరమాత్ముడు సూక్ష్మదర్శుల శ్రేష్ఠమైన సూక్ష్మబుద్ధిచేత జూడబడును. అనాది విద్యతోగూడినను నేనొక్కడినే అయి ఉన్నాను, నేనే అవ్యయుడను.

శ్లో॥ జ్ఞానమాత్రెయథా దృశ్య - మిదం స్వప్నే జగత్రయం ।
తద్వన్మయి జగత్సర్వం - దృశ్యతేస్తి వితయతే ॥
నావిద్యా సమాయుక్తో - జీవత్యేనవసామ్యహమ్ ॥

(10,అ,శ్లో॥ 13) శివగీత

తా॥ నేను వికారములు లేని పరబ్రహ్మను, జగత్కర్తను, మహేశ్వరుడను, స్వప్నములో జ్ఞానలేశముతోనేరీతిగా ముల్లోకములు అగుపడి పునఃలయమగుచున్నవో అదేరీతిగా నాలోను సమస్త ప్రపంచము బుట్టి పెరిగి లయమగుచున్నది.

అట్టి లింగశరీరమున ప్రతిబింబించిన చిదాభాసమునే వ్యావహారమున జీవుఁడు, క్షేత్రజ్ఞుఁడు, పురుషుడని గూడ వ్యవహరింతురు.

ఆతఁడే పదునాలుగు (చతుర్ద శభువనములలో) లోకములయందు, అనాది కర్మజన్యపుణ్యాపాపములను అనుభవించే భోక్తయగుచున్నా డు. ఇహ పరలోకగమనము, జాగ్రదాద్యవస్థను అనుభవించువా డును, ఆతఁడెయగును మలినమైన దర్పణములో ముఖము మలి నముగానగుపడునట్లు (శ్లో|| 17 నుండి 18 శ్లో||కు) అంతఃకరణదో షములచేత ఆత్మగూడ దోషయుక్తముగానే అగుపడును. ఆత్మ మరియు అంతఃకరణ తాదాత్మ్యముచేత అంతఃకరణ గుణములా త్మయందును, ఆత్మగుణము లతఃకరణమునందును పరస్పరాధ్యా సమై పరమాత్మ గూడ దుఃఖమనుభవించుచున్నట్లు కనిపించును, నీరు లేని యెడారి ప్రాంతమున మధ్యాహ్న సూర్యకిరణములతో ఎండమావులు అజ్ఞానులకు నీరుగానే అగుపడును. పరమాత్ముడు గూడ సుఖదుఃఖాదుఃఖాదులచేత నిర్లిప్తుడైనను, అజ్ఞానులైన వారికి అవిద్యయను అంతఃకరణ దోషము వలన పరమాత్ముడుగూడ కృర్తృత్వ భోక్తృత్వాది ధర్మములు గలిగిన వాడిలా తోచుచున్నాడు, అన్నయ మైన స్థూలశరీరమున నఖశిఖపర్యంతము వ్యాపించి జీవుఁడు హృద యమునందుండును, ఇతఁడు నాభికూర్ధ్వముగాను, కంఠమునకు క్రింది భాగమున వ్యాపించి "పురతత్" అను పేరుగల మాంసపిండ

మొకటి ప్రకాశించుచుండును, అట్టి మాంసపిండము యొక్క మధ్య భాగమున నాళముతో (కాడతో) కూడిన పద్మకోశము వలె హృదయ ముండును. (22-23-24 శ్లో॥ అ, 122).

శ్లో॥ అథోముఖంచతత్రాస్తి - సూక్ష్మంసుషిరముత్తమం ।
దహరాకాశమిత్యుక్తం - తత్రజీవోవతిష్ఠతి ॥
(10,అ,శ్లో॥ 25)

"వాలాగ్రశత భాగస్య - శతధాకల్పితస్యచ ।"

తా॥ అథోముఖముగానుండు ఆ పద్మకోశమున సూక్ష్మము మరియు శ్రేష్ఠమైన సుషిరమనుఛిద్రముండును, దీనినే "దహరా కోశమందురు. అందులో జీవుడుండును, వెంట్రుక యొక్క కొసభాగమును నూరు ముక్కలుగా జేసి అందులోని ఒక భాగమును మరో నూరు భాగములుగా జేయగా ఎంత సూక్ష్మముగానుండునో అట్టి నూరవ భాగమంత పరిమాణముగా సూక్ష్మముగా వుండును. ఆతఁడె దెలియఁదగినవాఁడు. ఆతఁడేయనంతుఁడుగా చూపబడుచున్నాడు.

శ్లో॥ నిర్మోహో నిరహంకారో - నిర్లేపసంగవర్జితః ।
(13,అ,శ్లో॥ 28) శివగీత

సర్వభూతేషుచాత్మానం - సర్వభూతేషుచాత్మని ।

యః పశ్యన్ సంచరత్యేష - జీవన్ముక్తోభిదీయతై ॥

(13 శ్లో॥ 29) శివగీత

తా॥ మోహమును, అహంకారమును, వీడి ప్రవృత్తిని ఆపుకొనిన సంసార సంబంధాలను వీడి సమస్తభూతములయందు తనను, తనలో సమస్తభూతములను జూచి సంచరించు జీవన్ముక్తుడని చెప్పబడు చున్నాడు.

శ్లో॥ యదాసర్వేప్రముచ్యంతె - కామాయేస్యవశంగతాః ।
అథమర్త్యోమృతోభవ-త్యేతావదను శాసనమ్ ॥

(13,అ,శ్లో॥ 31) శివగీత

మోక్షస్యనహివాసోస్తి - నగ్రామాంతర ఏవవా ।
అజ్ఞాన హృదయగ్రంధి - నా మోక్ష ఇతిస్మృతః ॥

(13,అ,శ్లో॥ 32) శివగీత

తా॥ మానవుఁడు తనయందలి సమస్త కోరికలను వీడినప్పుడే మోక్షమును బొందును, ఇట్టి మోక్షమునకు బ్రత్యేకమైన నివాసముగాని, మరో నివాసయోగ్యమైన వేరే గ్రామముగానిలేదు సుమా! తన హృదయమందలి యజ్ఞానము నశించుటే మోక్షమనఁబడును.

శ్లో॥ వృక్షాగ్రచ్యుతపాదోయస్యతథైవపతత్యధః ।
తత్వజ్ఞానవతోముక్తిర్జాయతేనిశ్చితాపితు ॥
(13,అ,శ్లో॥ 33)

తా॥ కాలుజారగానే ఎట్లు చెట్టుపైనుండిపడినవాఁడు నిశ్చయముగా క్రిందబడునట్లుగా జ్ఞానసముపార్జనముఁగావించుకొనినవాడికి ముక్తి నిశ్చయముగా లభించును.

శ్లో॥ గచ్ఛన్‌తిష్ఠన్‌శ్చరన్వాపి - శయానోవాఽన్యకర్మణి ।
పాతకేన సమాయుక్తోవా - ధ్యానాదేవవిముచ్యతే ॥
(16,అ,16 శ్లో॥)

తా॥ నడచుచు, నిలచుచు, కదులుచు, పడుకొని ఇతరకార్యములను జేయుచున్నప్పుడు సదా శివధ్యానము జేయువాడు పాపముతోఁగూడినవాడైనను ఈ సంసారబంధమునుండి ముక్తిని బడయుచున్నాడు.

"కర్మణ్యేవాధికారస్తే - మాఫలేషు కదాచన" అను భగవద్గీత శ్లోకములోని తాత్పర్యముపై విషయమునే బోధించుచున్నది, కనుక నిష్కామ కర్మనాచరింపుడని శివుఁడు రామునకుపదేశించియున్నాడు.

# శివగీతలో విశ్వరూప సందర్శనయోగము

(7వ అధ్యాయము)

శ్రీరాముడు శివుని గురించి ప్రశ్నించుచున్నాడు.

శ్లో॥ పరిచ్ఛిన్న పరీమాణె - దేహే భగవతస్తవ ।
ఉత్పత్తి సర్వభూతానాం - స్థితిర్వాపి లయః కథమ్ ॥

(శ్లో॥ 2 అ,7) శివగీత

శ్లో॥ స్వస్వాధికార సంబద్ధాః - కథంనామ సురాఃస్థితాః ।
తేసర్వేత్వం కథందేహే - భువనాని చతుర్దశ ॥

(7,అ,శ్లో॥ 3)

తా॥ సర్వభూతంబులును పరిమిత పరిమాణంబగు నీ శరీరంబున నెట్లు గలుగుచున్నవి, ఏ విధముగా వర్తిల్లుచున్నవి, మరలనెట్లు గలుగు చున్నవి, ఏ విధముగా వర్తిల్లుచున్నవి, మరలనెట్లు లయమును బొందు చున్నవి. వారివారి యధికారములో నుండి సృష్ట్యాదుల నొనర్చు బ్రహ్మాది దేవతలు పదునాలుగు లోకంబులును నీవెట్లైతివి తెల్పు మని రాముఁడు బ్రశ్నింపగా శ్రీభగవాన్ పరమశివుఁడు ఇట్లు సమా ధానమొసఁగెను.

శ్లో|| వటబీజేసుసూక్ష్మేపి - మహావటతరుర్యథా ।
సర్వదాస్తే2న్యథావృక్షః - కుత ఆయాతితద్వద ||

(7 అ, శ్లో 5)

శ్లో|| తద్వన్మమతనౌరామ - భూతానామాగతిర్లయః ।
మహాసైంధవపిండో2పి - జలేక్షిప్తోవిలియతే ||

(7,అ,శ్లో|| 6)

శ్లో|| నదృశ్యతే పునఃపాకాత్ - తతఆయాతి పూర్వవత్ ।
ప్రాతఃప్రాతర్యథాలోకో - జాయతై సూర్యమండలాత్ ||

((7,అ,శ్లో|| 7)

ప్రాతః ప్రాతర్యథాలోకో - జాయతేస్తి విలీయతే ।
మయ్యేవసకలంరామ - తద్వజ్జానీహిసువ్రత ||

(7,అ,శ్లో|| 8)

తా|| శ్రీరామా! లోకమున మిక్కిలి చిన్నదైన మఱ్ఱివిత్తనంబున గొప్ప మఱ్ఱిచెట్టు వర్థిల్లుచు బయలుదేరు రీతిగా సమస్త భూతములు నా శరీరము నుండి వెలువడుచున్నవి. మరల నణంగుచున్నవి. ఉప్పు ముద్దను నీటిలో బడవైచిన అయ్యది కరిగిపోయి మరల నెట్లు పునః పాకముచేత మొదటిరూపమును బొందుచున్నదో, సూర్యకిరణము

వలన ప్రతిప్రాతఃకాలమును వెల్తురును గలిగి లోకమును బ్రకాశింపజేయు మాదిరిగా సమస్తలోకములు నా నుండి బుట్టింపఁబడి నాలోనే లీనమగుచున్నవి.

శ్లో॥ మయిసర్వంయథారామ - జగదేతచ్చరాచరం ।
వర్తతే తద్దర్శయామి - నద్రష్టుం క్షమతే భవాన్ ॥
((7,అ,శ్లో॥ 10)

దివ్యం చక్షుం ప్రదాశ్యామి - తుభ్యం దశరథాత్మజి ।
తేనపశ్యభయంత్య క్త్వా - మత్తేజోమండలం ధృవం ॥
(7 అ, శ్లో॥)

నచర్మచక్షుషాద్రష్టుం - శక్యతేమామకం మహః ।
నరేణవా సురేణాపి - తన్మమాను గ్రహం వినా ॥
(శ్లో॥ 12)

తా॥ రామా! ఈ స్థావర జంగమాత్మకమగు నీ జగమంతయు నా కుక్షిలోనున్నది. దానిని జూచుటకు నీకు సామర్థ్యము చాలదు. ఈ చర్మచక్షువులతో మానవుఁడైనను దేవుఁడైనను నాయనుగ్రహము లేనిదే నా తేజోమండలమును జూడఁజాలడు. కనుక ఓ రామా! నీకు దివ్యదృష్టి నొసఁగుచున్నాను. భయపడక నీవు నా తేజస్సును చక్కగా నవలోకింపు మనెను.

సూతుడిట్లు నుడివెను :

శ్లో॥ ఇత్యుక్త్వావ ప్రదదౌతస్మై - దివ్యంచక్షుంమహేశ్వరః ।
అథాదర్శయదేతస్మై - వక్త్రిః పాతాళ సన్నిభమ్ ॥

(శ్లో॥ 13)

విద్యుత్కోటి ప్రతీకాశమతి భీమం భయావహం ।
తద్దృష్ట్యైవభయాద్రామో - జానుభ్యామవనీంగతః ॥

(శ్లో॥ 14)

ప్రణమ్య దండవద్భూమౌ - తుష్టావచపునఃపునః ।
అథోత్థాయమహావీరో - యావదేవ ప్రపశ్యతి ॥ (శ్లో॥ 15)
వక్త్రిం పురభిదస్తావదంతర్బ్రహ్మాండకోటయః ।
చటకా ఇవలక్ష్యంతె - జ్వాలమాలాసమాకులాః ॥

(శ్లో॥ 16)

మేరుమందరవింధ్యాద్యాః గిరయః సప్తసాగరాః ।
దృశ్యంతే చంద్ర సూర్యాద్యాః - పంచభూతానితే సురాః ॥

(శ్లో॥ 17)

అరణ్యాని మహానాగాః - భువనానిచతుర్దశ ।
ప్రతిబ్రహ్మాండమేవంతు - దృష్ట్వాదశరథాత్మజః ॥

(శ్లో॥ 18)

సురాసురాణాం సంగ్రామా-స్తత్రపూర్వపరానపి ।
విష్ణోర్దశావతారాంశ్చ - తత్కర్తవ్యాన్యపిద్విజాః ॥

(శ్లో॥ 19)

పరాభవాంశ్చదేవానాం - పురదాహంమహేశతుః ।
ఉత్పద్యమానానుత్పన్నాం - తత్పర్వానపి వినశ్యతః ॥

(శ్లో॥ 20)

దృష్ట్వారామోభయావిష్టః - ప్రణనామముహుర్ముహుః ।
ఉత్పన్న తత్త్వజ్ఞానోఽపి - బభూవరఘునందనః ॥

(శ్లో॥ 21)



# శ్రీ భగవద్గీత - ద్వితీయాధ్యాయము

## (సాంఖ్య యోగము)

శ్లో॥ వాసాంసిజీర్ణానియథా విహాయ
నవాని గృహ్ణాతి నరోపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా ।
న్యన్యాని సంయాతి నవానిదేహి ॥ (22) పొందును.

శ్లో॥ నైనంఛిందంతి శస్త్రాణి - నైనందహతి పావకః ।
నచైనం క్లేదయంత్యాపో - నశోషయతి మారుతః ॥

శ్లో॥ నేహాభిక్రమనాశోస్తి - ప్రత్యవాయోన విద్యత్ । (23)
స్వల్పమప్యస్య ధర్మస్య - త్రాయతెమహతో భయాత్॥

(40)

ఈ కర్మయోగము నశించదు, దోషయుతమైనదిగాదు, ఇట్టి ధర్మము కొంచమైనను గొప్పదైన సంసార భయము నుండి రక్షించును.

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తె - మాఫలేషుకదాచన ।
మాకర్మఫలహేతుర్భూ - ర్మాతెసంగోస్త్వకర్మణి ॥

(సాం,యో,శ్లో॥ 47)

నీవు కర్మఫలమునకు గారణముగారాదు, కర్మలు జేయకుండ ఉండరాదు.

"వతరాగభయక్రోధః - స్థితధీర్మునిరుచ్యతె ॥

(సాం, యో,శ్లో॥ 56) భ.గీ.

సుఖ-దుఃఖములకు, రాగద్వేషములకులోనుగానివాడు స్థిత ప్రజ్ఞుడనబడును).

శ్లో॥ యద్యదాచరతశ్రేష్ఠః - స్తత్తదేవేతరోజనః ।
సయత్ప్రిమాణం కురుతే - లోకస్తదను వర్తతే ॥

(కర్మ,యో,శ్లో॥ 26)

శ్లో॥ యదాయదాహిధర్మస్య - హానిర్భవతిభారత ।
అభ్యుత్థానమధర్మస్య - తదాత్మానం సృజామ్యహం ॥

(4,రా,జ్ఞాన,యో,శ్లో॥ 7)

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం - వినాశాయచదుష్కృతాం ।
ధర్మసంస్థాపనార్థాయ - సంభవామి యుగేయుగే ॥

(4 అ.జ్ఞా)

శ్లో॥ సమంకాయం శిరోగ్రీవం
ధారయన్న చలం స్థిరః ।

సం(ప్రేక్ష్య నాసికాగ్రంచ ।
స్వందిశశ్చానవలోకయన్ ॥
(6,అ,ఆత్మసంయమన యోగః,శ్లో॥ 13)

శేషము : (ఇది వీరి శైవ శివ యోగమునకు వర్తించునదిగానున్నది)

తా॥ ధ్యానయోగితన యొక్క దేహమును, తలను, మెడను, కదలకుండ చక్కగా ఉంచి స్థిరముగా నుండి దిక్కులను తిలకించకుండ ఉండి, ముక్కు చివర చూపును నిలుపవలెను, శాంతచిత్తుడై భయ రహితుడై, బ్రహ్మచర్య వ్రతము గలవాడై - మనోనిగ్రహముండిన వాఁడె నాకు పరమభక్తుడగును.

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం - సర్వభూతానిచాత్మని ।
ఈక్షతెయోగయుక్తాత్మ - సర్వత్రసమదర్శనః ॥
(6 అ, ఆత్మ సంయమనయోగః, శ్లో॥ 29)

శ్లో॥ యోమాంపశ్యతి సర్వత్ర - సర్వంచమయిపశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి - నచమెనప్రణశ్యతి ॥
(6 అ, ఆత్మ సంయోగము, శ్లో॥ 30)

శ్లో॥ మత్తః పరతరం నాన్య - త్కించిదస్తి ధనంజయ ।
మయిసర్వమిదం ప్రోతం - సూత్రే మణిగణా ఇవ ॥
(7,అ, విజ్ఞానయోగము, శ్లో॥ 7)

తా॥ ఓయీ! అర్జునా! నాకంటే శ్రేష్ఠతరమైనది మరొకటిలేదు, దార ములో చేర్చిన రత్నములవలె నాయందు ఈ సమస్త ప్రపంచము జేర్చబడినది.

శ్లో॥ బీజంమాం సర్వభూతానాం - విద్ధిపార్థ, సనాతనం ।
బుద్ధిర్బుద్ధి మతామస్మి - తేజస్తేజస్వి నామహం ॥
(అ. 7, ఆత్మ - జ్ఞానయోగము, శ్లో॥ 10)

తా॥ ఓయీ! అర్జునా! సనాతుడనగు నన్ను సకల భూతములకును (బీజముగ) తెలిసికొనుము. నన్ను బుద్ధిమంతుల యొక్క తేజ స్సును ఐ ఉన్నాను.

శ్లో॥ దైవీహ్యేషాగుణమయీ - మమ మాయాదురత్యయా ।
మామేవయే ప్రపద్యంతె - మాయామెతాం తరంతితే ॥
(అ,7, విజ్ఞాన యో, శ్లో॥ 14)

తా॥ దైవీ సంబంధమైన త్రిగుణ స్వరూపమగునా ప్రకృతి (మా యను) ని దాట శక్యము గానిది. ఎవరు నన్నె శరణుబొందుచు న్నారో వారే నా యీ మాయను దాటుదురు.

శ్లో॥ బహూనాం జన్మనామంతె - జ్ఞానవాన్మాంప్రపద్యతే ॥
(7,అ, విజ్ఞా. 19)

"అనేక జన్మార్జితైః పుణ్యైః - మయిభక్తిః ప్రజాయతే"
(శివగీత)

శ్లో॥ యోయో యాంయాం తనుంభక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి
(అ,7,శ్లో॥ 21)

తా॥ ఎవరెవరేయే దేవతారూపముల శ్రద్ధతో బూజించుచున్నారో అట్టివారికి నేను నిశ్చలభక్తిని, శ్రద్ధను గలిగించుచున్నాను.

శ్లో॥ అంతకాలేచమామేవ - స్మరన్ముక్త్వా కళేబరం ।
యః ప్రయాతి సమద్భావం - యాతినాస్త్యత్ర సంశయః॥
(అ, శ్లో॥ 8, అక్షర బ్రహ్మ)

ఎవడెంత కాలమున నన్నే ధ్యానించుచు దేహమును వదలుచున్నాడో వాడు నా భావమునే బొందుచున్నాడు.

శ్లో॥ ఆబ్రహ్మభువనాలోకాః - పునరావర్తినోఽర్జున ।
మాముపేత్యతు కౌంతేయ - పునర్జన్మ న విద్యతే ॥
(అ, 8, అక్షర బ్రహ్మ యోగః శ్లో॥ 17)

తా॥ ఓ కౌంతేయా! బ్రహ్మ వరకు గల సమస్త లోకములును మరల పుట్టుకను గల్గించుచున్నవి. నన్ను బొందినచో మరుజన్మలేదు.

శ్లో॥ అనన్యాశ్చింతయంతోమాం - యేజనాః పర్యుపాసతే ।
తేషాంనిత్యాభియుక్తానాం - యోగక్షేమంవహామ్యహం ॥
(అ, 9, రాజవిద్యారాజగుహ్యయోగః, శ్లో॥ 22)

"క్షీణే పుణ్యే మర్త్యలోకే విశంతి"

పుణ్యము క్షీణింపగా నే (తీరగానే) మానవ లోకమునకు మరలి వచ్చెదరు (9 అ.శ్లో॥ 21)

శ్లో॥ యేప్య న్య దేవతాభక్తాః - యజంతె శ్రద్ధ యాన్వితాః ।
తే ऽపిమామేవకౌంతేయ - యజంత్యవిధి పూర్వకం ।.

(9 అ.శ్లో॥ 23)

పత్రం పుష్పం ఫలంతోయం - యోమేభక్త్యా ప్రయచ్ఛతి॥

(అ, 9,శ్లో॥ 26)

శ్లో॥ యత్కరోషియదశ్నాసి - యజ్జుహోషిదదాసియత్ ।
యత్తపస్యసికౌంతేయ - తత్కురుష్వమదర్పణమ్ ॥

శ్లో॥ అపిచేత్సు దురాచారో భజం తేమామనన్యభాక్ ॥

(అ,9, శ్లో॥ 30)

"రుద్రాణాం శంకరశ్చాస్మి" (అ,9,రాజ,యోగః శ్లో॥17)

తా॥ ఈ జగత్తునకు తల్లిని-తండ్రిని-సృష్టికర్తను, తాతను, తెలియదగిన పునీతమైన ఓంకారమును, ఋగ్-యజస్సామ వేదములును నేనే.

శ్లో॥ గతిర్భర్తా ప్రభుస్సాక్షీ - నివాసశ్శరణం సుహృత్ ।
ప్రభవః ప్రళయస్థానం - నిధానం బీజమవ్యయమ్ ॥

(అ,9,శ్లో॥ 18)

తా॥ ఈ జగత్తునకు గతిని - భర్తను - ప్రభువును, మిత్రుడును, సృష్టికర్తను, వినాశకరుడను రక్షించువాడను, నిక్షేపమును, నశించని బీజమును నేనే.

శ్లో॥ మాంహిపార్థ వ్యపాశ్రిత్య - యోఽపిస్యుః పాపయోనయః।
స్త్రియోవైశ్యాస్తథా శూద్రోస్తేపియాంతి పరాంగతిం ॥
(అ, 9, శ్లో॥ 32)

శ్లో॥ నతుమాంశక్యసే - ద్రష్టుమనేనైవస్వ చక్షుషా ।
దివ్యందదామితే చక్షః పశ్యహైయోగమైశ్వరమ్ ॥
(అ,11, శ్లో॥ 8)

తా॥ నీవు నీ కన్నులతో నన్ను జూడలేవు, దివ్యదృష్టి నొసంగుచున్నాను, నాయొక్క యైశ్వర్యముతో గూడిన యోగమును జూడుము.



# భగవద్గీతాంశములు

శ్లో॥ ఏవముక్త్వాతతోరాజన్ - మహాయోగీశ్వరో హరిః ।
దర్శయామాస పార్థాయ - పరమం రూపమైశ్వరమ్ ॥
(అ,11, విశ్వరూప సందర్శనము, శ్లో॥ 8)

అర్జున ఉవాచ :

శ్లో॥ పశ్యామిదేవాంతవదేవ దేహె
సర్వాంస్తథా భూతవిశేష సంఘాన్ ।
బ్రహ్మాణమీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వానురగాంశ్చదివ్యాన్ ॥
(అ,11, విజ్ఞాన, సంయోగః, శ్లో॥ 16)

తా॥ ఓ దేవా! నీ శరీరమున సమస్త దేవతలును, చరాచర భూత జాలమును, ఈశుని, కమలాసనాధీశుడైన బ్రహ్మను, సమస్త ఋషులను, దివ్యములైన పాములను జూచితిని, మరియు నో విశ్వేశ్వరా! ఓయీ! విశ్వరూపా! అనేక హస్తములు, ఉదరములు, ముఖాలు, కన్నులు గల అనంతమైన నీ రూపమును జూచితిని, మరియు నీ రూపమునకు ఆద్యంతములు లేవు, నేను నీ యొక్క విశ్వరూపమును జూడజాలకున్నాను.

శ్లో॥ సమదుఃఖ - సుఖస్వస్థ - స్సమలోష్టాశ్మ కాంచనః ।
తుల్యః ప్రియా ప్రియా - ధీరస్తుల్య నిందాత్మ సంస్తుతః ॥

(అ॥ 14. శ్లో॥ 24)

శ్లో॥ మానావ మానయో - స్తుల్యం - తుల్యోమితాక్షరీ పక్షయోః।
సర్వారంభ పరిత్యాగీ - గుణాతీతస్స ఉచ్యతే ॥

(అ,14, శ్లో॥ 25)

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య - మామెకం శరణం వ్రజ ।
అహంత్వా సర్వపాపేభ్యో - మోక్షయిష్యామిమాశుచః ॥

(అ, 18 శ్లో॥ 66)



# విశ్వరూప సందర్శన యోగము

## భ.గీ. 11 అధ్యాయము

అర్జున ఉవాచ :

శ్లో॥ మనసేయది తచ్ఛక్యం - మయాద్రష్టు మిత ప్రభో!
యోగీశ్వర! తతో మేత్వం - దర్శయాత్మానమవ్యయమ్॥
(అ, 11, శ్లో॥ 4)

తా॥ ఓ ప్రభూ! యోగీశ్వరా! నా చేతచూచుటకు సాధ్యమని తలంతువేని నీవు నాకు నిత్యమైన ఆత్మ స్వరూపాన్ని జూపించుమనెను.

శ్రీభగవానువాచ :

శ్లో॥ పశ్యమే పార్థరూపాణి - శతశోఽథ సహస్రశః ।
నానావిధానిదివ్యాని - నానావర్ణాకృతీనిచ ॥
(అ, 11 శ్లో॥ 5)

తా॥ ఓ పార్థా! నా యొక్క అనేక రకములైన రంగులు - రూపాలు కలిగినవియు, దివ్యములైనవియు, వందల కొలదియును, వేలకొలదియునగు రూపములను జూడమనెను.

శ్లో॥ పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుతస్తథా ।
బహూన్యదృష్ట పూర్వాణి - పశ్యాశ్చర్యాణి భారత ॥
(అ.. 11 శ్లో॥ 6)

శ్లో॥ నతుమాం శక్యసేద్రష్టు, మనేనైవ స్వచక్షుషా ।
దివ్యందదామితే చక్షుః పశ్యమెయోగమైశ్వరమ్ ॥
(అ, 11, శ్లో॥ 8)

*సంజయ ఉవాచ :*

శ్లో॥ ఏవముక్త్వాతతోరాజన్ - మహాయోగీశ్వరోహరిః ।
దర్మయామాసపార్థాయ - పరమం రూపమైశ్వరమ్ ॥
(అ, 11, శ్లో॥ 9)

*అర్జున ఉవాచ :*

శ్లో॥ పశ్యామిదేవస్తవదేహే ।
సర్వాంస్తథాభూత విశేష సంఘాన్ ।
బ్రహ్మాణమీశం - కమలాసనస్థం ।
ఋషీంశ్చ సర్వానురగాంశ్చదివ్యాన్ ॥ (అ 11 శ్లో॥ 15)

శ్లో॥ రుద్రా దిత్యావసవోయేచ సాధ్యా
విశ్వేశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ ।

గంధర్వయక్షాసురసిద్ధ సంఘాః
వీక్షంతేత్వాః విస్మితాశ్చైవ సర్వే ॥
(అ 11, విశ్వరూపసందర్శన యోగః, శ్లో॥ 22)

శ్లో॥ అమీచత్వాం ధృతరాష్ట్రసపుత్రాః
సర్వేసహైవావనిపాల సంఘైః ।
భీష్మోద్రోణస్సూతపుత్రస్తథాఽసౌ
సహాస్మదీయైరపియోధ ముఖ్యైః ॥
వక్త్రాణితేత్వరమాణ విశంతి
దంష్ట్రాకరాలానిభయానకాని
కేచిద్విలగ్నాదశనాంతరేషు
సందృశ్యత చూర్ణితైరుత్తమాంగే ।. (అ 11, శ్లో॥ 27)

తా॥ ధృతరాష్ట్రుని యొక్క పుత్రులును, భూపాలుర సంఘములును మరియు భీష్మ-ద్రోణుడు, కర్ణుడును మన వారైన ప్రముఖులైన యోధులు, తొందరపడుచున్న వారై కోరలతో భయంకరమైన వియునగు నీ నోటిలో బ్రవేశించుచున్నారు. కొందరు పండ్ల సందులలో జిక్కుకొన్నవారై పొడిగా (ముక్కలుగా) జేయబడిన తలలతో నగుపడుచున్నారు.

శ్లో॥ యథానదీనాం బహవోంబు వేగాః
సముద్రమేవాభిముఖాద్రవంతి ।
తథాతవా ऽమీ నరలోకవీరాః
విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి ।. (అ11, శ్లో॥ 28)

తా॥ అనేక నదులు నీటి ప్రవాహము లెట్లు సముద్రమునకభిముఖముగా ప్రవహించునో అట్లే ఈ రాజు లోక వీరులు ప్రజ్వలించుచున్న నీ ముఖములో బ్రవేశించుచున్నారు.

"తేజోభిరాపూర్య జగత్సమగ్రం" నీ ప్రచండమైన కాంతుల తోను. ఈ సర్వప్రపంచమును తపింపఁజేయుచున్నావు.

శ్లో॥ నాహంవేదైర్నతపసా - నదానేన నచేజ్యయా ।
శక్యమేవం విధోద్రష్టుం - దృష్టవానసిమాం యథా ॥
(అ 11 శ్లో॥ 53, విశ్వరూప సందర్శన యోగము)

తా॥ నీవు జూచిన విశ్వరూపము - వేదములచేతగాని, యజ్ఞ-దాన -తపస్సులతోగాని జూచుటకు సాధ్యపడదు.



# శివగీత అనుబంధ శ్లోకములు

## భగవద్గీతా మహాత్మ్యము శ్లో॥ (13)

శ్లో॥ ఏకాధ్యాయంతు యోనిత్యం - పఠతెభక్తి సంయుతః ।
రుద్రలోకమనాప్నోతి - గణోభూత్వావసెచ్చిరమ్ ॥ (13)

తా॥ ప్రతి దినమెవరు భక్తితో ఒక అధ్యాయమును బఠింతురో వారు రుద్రలోకమును బడసి అచటనుండు ప్రమథ గణములతో చిరకాలము నివసింతురు.



# గీతలలో శ్రేష్ఠమైన గీత - శివగీతనే శ్రేష్ఠమైనది

ప్రపంచములో 1. శివగీత, 2. విష్ణుగీత, 3. గోపికాగీత, 4. ఉద్ధవగీత, 5. భ్రమరగీత, 6. దేవగీత, 7. హంసగీత, 8. హనుమద్గీత, 9. కపిలగీత, 10. గణేశగీత అని పలుగీతలున్నవి.

*గీతావిర్భావము* :- ద్వాపరయుగము చివర కలియుగారంభము 38 సం॥ములున్నదనగా గీతావిర్భావము జరిగినది. యోగ మనగా 'కూడిక, ఆత్మ-పరమాత్మల కలయిక, అవి 18.

*యజ్ఞమనగా* :- యజధాతువు నుండి బుట్టినది గనుక యజ్ఞ - పూజించు. ఇవి 12 రకాలు, 1. దైవ, 2. బ్రహ్మ, 3. ఇంద్రియ నియమము, 4. విషత్యాగము, 5. మనోనిగ్రహము, 6. ద్రవ్యము, 7. తపస్సు, 8. యోగము, 9. స్వాధ్యాయము, 10. జ్ఞానము, 11. ప్రాణాయామము, 12. నియతాహారము. వీటన్నింటిలోను జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది. జపయజ్ఞముగూడ శ్రేష్ఠమైనదే స్తోత్రకోయమో యజ్ఞః.

*సన్యాసమనగా* :- "సత్" మంచిగా, "న్యాసము" ఉంచుట యని యర్థము. దేనిని కోరక, ద్వంద్వాతీతముగా నుండుట, కర్మ ఫలాస్తిగా జేయుట.

*పండితుడనగా* :- శోకరహితుడు, విద్యా-వినయ సంపన్నుడు. అన్ని ప్రాణులయందును సమానదృష్టిగలవాడు.

శ్లో॥ మాతృవత్పరదాణంచ - పరద్రవ్యాణిలోష్టవత్ ।
ఆత్మవత్సర్వభూతాని - యఃపశ్యతి సపండితాః ॥

భక్తియనగా :- "పూజేష్వను రాగో భక్తిః. పరమాత్మునియందు దృఢమైన ప్రేమగలిగియుండుటే భక్తియనబడును.

ఇతి "శివమ్ భూయాత్"

ఇట్లు

బుధజనవిధేయుడు

వే॥ పండిత పెద్దమఠం రాచవీరదేవర "తీర్థ" **M.O.L.**

ఇం.నెం. 3-3-139, కాచిగూడ,

హైదరాబాదు - 500 027.







# పండితాభిప్రాయము

ఆధ్యాత్మిక తత్త్వ బోధకములగు ప్రాచీన గ్రంథములలో 'శివ గీత' ప్రథమ గణ్యమైనది. 'భగవద్గీత వలె ప్రచార బాహుళ్యము సంతరించుకొనక పోయినను తక్కిన శివగీత, ఉత్తరగీత, రుద్రగీత, బ్రహ్మగీత, గురుగీత మున్నగు పెక్కుగీతలు కలవు. తత్త్వవేత్తలు ఈ గీతలన్నింటిని పరిశీలించి ఆధ్యాత్మిక విషయములను సమన్వ యించి తత్త్వజ్ఞానము, సుసంపన్నము చేయవలసిన ఆవశ్యకత ఎంతేని కలదు. 'భగవద్గీత దేశభాషలన్నింటిలోనేగాక విదేశభాషలలోనికి అను వదింపబడి వ్యాఖ్యానములు విరచింపబడి ప్రపంచ జనావళికి అందు బాటులోనికి వచ్చినది మరియు ఇతిహాస ప్రపంచనము సముచిత స్థానమునలంకరించి యున్నదనుటలోను సందేహము లేదు.

'శివగీత' కూడ 'భగవద్గీత'వలె వ్యాసోప్రోక్తమే. మహాభారత అంతర్గమైనది భగవద్గీతకాగా, పద్మపురాణాంతర్గతమైనది శివగీత. ఇదియును వేదాంత గ్రంథములలో నగ్రగణ్యమై పరిగణన పొందు చునే యున్నది. రామాయణ కాలము నాటికే ప్రచారమందుండిన ఈ శివగీతను ప్రాచీన తత్త్వవేత్తలు పఠించుచుండిరని తెలియుచున్నది.

శివగీత త్రేతాయుగమున రామాయణ వీరుడగు శ్రీరామచంద్రు నకు రావణసంహార సాధకముగ పరమశివునిచే బోధింపబడినది. భగవద్గీత తరువాతి యుగమగు ద్వాపరమున భారతవీరుడగు పార్థు నకు దుష్టశిక్షణార్థము శ్రీకృష్ణునిచే బోధింపబడినది. రామాయణ, భారతయుద్ధముల పౌర్వాపర్యమునుబట్టి పర్యాలోకింప శివగీతయే భగవద్గీత కన్న ప్రథమముగా వెలసినదని తలంచుట కవకాశము కలుగుచున్నది. అది సమంజసమే.

శివప్రసాద సాధకమును, భక్తి, జ్ఞాన, వైరాగ్యాత్మకమగు శివ యోగమును శివగీత వేనోళ్ళ చాటుచున్నది. మోక్షార్థులకు నీరెండు గీతలును మోక్షసాధన ప్రదర్శకములేయనుట నిర్వివాదము.

శివగీతయందుదహరింపబడిన అనేక అంశములు, భావములు భగవద్గీతయందు పునరుద్ధరింపబడినవి. వివరణకర్తయగు 'శ్రీ పండిత రాచవీరదేవర'గారు తమ తొలిపలుకులలో భావసామ్యముగల శ్లోక ములనెన్నింటినో నుటంకించియున్నారు. ఇంకను నీరెండు గీతలను పరిశీలనాదృష్టితో పరికించినచో అనేక విషయ సామ్యములు భావ సామ్యములు పొడగట్టక మానవు. త్రేతాయుగమున పరమశివుడు శ్రీరామునికి బోధించిన అంశములే తరువాతి అవతారమగు శ్రీకృష్ణుడు

ద్వాపరమున అర్జునునకు బోధించినట్లు విశదమగుచున్నది. భగవద్గీతలోని వేదాంత విషయములకు మూలము శివగీత యనియు తెలియుచున్నది. అందువలన ఆధ్యాత్మిక తత్త్వ ప్రతిపాదకమగు వేదాంత గ్రంథములలో ప్రాచీనమైనది ఈ శివగీతయేయని నిర్ధారణ చేయవలసి వచ్చుచున్నది.

శివగీతయందలి గహనమైన శివయోగ విషయములు సులభశైలిలో సామాన్యులకర్థమగునట్లు వివరించిన వివరణకర్త 'శ్రీ దేవర'గారి ప్రతిభ ప్రశంసనీయము. అది వారు సాధించిన శివానుగ్రహ సంపాదితము. శివగీతామృతమును ఆంధ్రులకు పంచియిచ్చిన వివరణకర్త జన్మధన్యము. వీరశైవ సాహిత్య గ్రంథములనెన్నింటినో వెలయించి, ఆంధ్ర వీరశైవుల కృతజ్ఞతలకు పాత్రమైన వీరికి ఏతాదృశ గ్రంథ రచనోత్సాహము నితోధికముగ కలిగించి ఆయురారోగ్యములను రచనా కౌశల సంపదను సుసంపన్నము చేయవలసినదిగ శివగీతకర్తయగు పరమశివమూర్తిని మనసా ప్రార్థించుచున్నాను.

1. శ్రీకరంబగు శివగీత చిత్తశుద్ధి
పఠనమొనరించు వారికి పరమశివుడు
ఇహ పరంబుల నొసగియు నేలుకొనును
ముక్తినొసగును దయతో ముముక్షులార!

2. వ్యాసమహర్షిచే వ్రాయంగబడినట్టి

పద్మపురాణస్థ భవ్యగీత

భారతాంతర్గతంబౌ భగవద్గీత

కన్నమున్నె ఖ్యాతిగన్న గీత

తత్త్వవేత్తలు శైవతత్త్వ రహస్యముల్

నిండుగా కనుగొన్న దండిగీత

శైవసంబంధమౌ శివయోగ విషయముల్

సరళరీతిని దెల్పు శంభుగీత

రామచంద్రుని కోర్కెపై రాజమౌళి

యైన శివమూర్తి బోధించినట్టి గీత

భక్తి జ్ఞాన విరాగపు భావములను

స్పష్టముగ దెల్పునట్టి విశిష్టగీత

గీతలకు నేతయీ శివగీతే గీత.

3. శివగీత నెరింగించును

శివతత్త్వ రహస్యములను శివయోగంబున్

భవబంధ విముక్తికినై

శివగీత పఠించి జన్మసిద్ధిని గనుడీ!

4. వీరశైవమతపు వీరగోత్రులునైన
వీర-నాగాంబల వరసుతుండు
అలషడక్షరి మహాస్వాములంతే వాసి
శ్రీ విరూపాక్షుల శిష్యవరుడు
ఆంధ్రగీర్వాణ భాషామతల్లుల భక్తి
నారాధనము జేయునట్టి ఘనుడు
వీరశైవపు తత్త్వ విషయ ప్రచారమ్ము
విరివిగా సల్పిన వీరవ్రతుడు
రాచవీరదేవరాఖ్యుండు విభుదుండు
సరససౌమ్యవర్తి సాధుమూర్తి
ధర్మబుద్ధితోడ ధార్మిక గ్రంథాలు
వెలువరించు ధర్మవిదునుతింతు.

ఇట్లు
బుధజనవిధేయుడు
ఎం. శంకరయ్యస్వామి, M.A., M.O.L.
తెలుగు పండితులు,
ఇబ్రాహీంపటన్.

# మహాన్యాస పూర్వక రుద్రాభిషేక విధి

ఇది బాలసరస్వతీ బుక్ డిపోవారు ఆస్తిక ఆంధ్రమహాజనులకు హృదయపూర్వకంగా అందజేస్తున్న సరిక్రొత్త కానుక.

శ్రీ పాతూరి సీతారామాంజనేయులుగారు అందజేసిన పరిష్కరణతో - దీనిలో రుద్రదేవతాతత్త్వమూ, బోధాయనప్రోక్త మహన్యాసఖండమూలమూ - దానికి శాస్త్రీయమయిన తెలుగు వివరణమూ ప్రామాణికంగా ఈయబడి ఉన్నవి. ఇంతేకాక ఈ మహన్యాసంలో ఉండే న్యాసాలూ - వాని విభాగమూ - అందులో కానీ రుద్రాభిషేకంలోకానీ వినియోగం అయ్యే మంత్రాలూ -వాని తాత్త్వికమైన వినియోగమూ - సమగ్రంగా ఈయబడి ఉండడంచేత ఈ పుస్తకం స్వయంగా రుద్రాభిషేకం చేసుకొనే ఆస్తికులకూ పురోహితులకూ కూడా అన్ని విధాలా ఎంతో ఉపయోగకరం.

# శివగీత అనుబంధ ప్రకరణము
# సంక్షిప్త శివపూజా విధానము

గురు ప్రార్థన :

1. నమ ఉగ్రస్వరూపాయ - నమో జహ్నాది శాత్రవే।
దక్షయజ్ఞవినాశాయ - వీరభద్రాయ తే నమః॥
(రచన:-పం॥రాచవీరదేవరః)

2. శాంతం పద్మాసనస్థం శశిధరమకుటం
పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రంచ ఖడ్గం పరశు మభయదం
దక్షభాగే వహంతం।
నాగం పాశం చ ఘంటాం ప్రళయహుతవహం
సాంకుశం వామభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం
పార్వతీశం నమామి॥





3. బ్రహ్మాండవ్యాప్తదేహా భసితహిమరుచా
భాసమానా భుజంగైః
కంఠేకాలాః కపర్దాకలితశశికళా
శ్చండకోదండహస్తాః ।
త్ర్యక్షా రుద్రాక్షమాలా ప్రకటితవిభవాః
శాంభవా మూర్తిభేదాః
రుద్రాః శ్రీరుద్రసూక్తప్రకటితవిభవా
నః ప్రయచ్ఛంతు సౌఖ్యమ్॥

4. యస్య స్మరణమాత్రేణ - నృణాం ముక్తిః కరే స్థితా ।
తం వందే జగదాధారం - రేణుకార్యం జగద్గురుమ్ ॥

5. మునియాచనయా శివాజ్ఞయా
శివభక్త్యుద్ధరణార్థ మాగతం ।
వృషరాజపరావతారతా
మహితం శ్రీబసవేశ్వరం భజే ॥





(దీపారాధనగావించి - విభూతి-రుద్రాక్షల ధరించి)

మంత్రము:-

ఆగమార్థం తు దేవానాం- గమనార్థం తు రక్షసాం ।
కుర్యాద్ ఘంటారవం తత్ర - సర్వోపద్రవనాశనమ్ ॥

ప్రాణాయామము నాచరించుట.

మంత్రము:-

ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః, ఓం జనః ఓం తపః ఓం సత్యం

ఓంతత్సవితుర్వరేణ్యం - భర్గోదేవస్య ధీమహి॰ ధియో యో నః ప్రచోదయాత్.

ఓం - ఆపో-జ్యోతీ రసో మృతంబ్రహ్మ భూర్భువస్సువ రోమ్ ॥

(కరన్యాసమును-అంగన్యాసములను ఆచరించవలెను)





సంకల్ప-మంత్రము:-

హరః - ఓం - శివ శివ శంభోరాజ్ఞయా ప్రవర్తమానస్యాద్య బ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే మేరో ర్దక్షిణదిగ్భాగే భరతఖండే భారతవర్షే దండకారణ్యే శ్రీశైలస్య ఈశాన్యప్రదేశే గంగాగోదావర్యో ర్మధ్యదేశే దక్షిణకూలే శాలివాహనశకే శ్రీ వీరభద్రావతారే శివక్షేత్రే అస్మిన్ వర్తమానే స్వస్తిశ్రీ వ్యావహారికచాంద్రమానేన ప్రభవాది షష్టిసంవత్సరాణాం మధ్యే అస్మిన్( ) వత్సరే అస్మిన్ ( ) అయనే అస్మిన్ ( ) మాసే అస్మిన్ ( ) నక్షత్రే అస్మిన్ ( ) యోగే అస్మిన్ ( ) కరణే ఏవంగుణయుక్తాయాం అస్యాం ( ) శుభతిథౌ అస్మిన్ ( ) గోత్రోత్పన్నో హం మమ ఉపాత్తదురితక్షయద్వారా( ) నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమ కుటుంబస్య క్షేమస్థైర్యవిజయాభయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం మోక్షసిద్ధ్యర్థం శ్రీపార్వతీపరమేశ్వర





ప్రీత్యర్థం శ్రీగురు-లింగ-జంగమ ప్రసాదసిద్ధ్యర్థం లఘుషోడశోపచారపూజా మహం కరిష్యే ॥

కలశ పూజనం:- మంత్రము

కలశస్యముఖే రుద్రః - కంఠే విష్ణు స్సమాశ్రితః।
మూలే తత్ర స్థితో బ్రహ్మ - మధ్యే మాతృగణాః స్మృతాః.
కుక్షౌ తు సాగరా స్సర్వే - సప్తద్వీపా వసుంధరా।
ఋగ్వేదో2థ యజుర్వేదః - సామవేదో హ్యథర్వణః।
అంగైశ్చ సహితా స్సర్వే - కలశం తు సమాశ్రితాః ॥

భూశుద్ధ్యాసనమంత్రములు:-

పృథ్వి త్వయా ధృతా లోకాః - దేవి త్వం విష్ణునా ధృతా ।
త్వం చ ధారయ మాం దేవి - పవిత్రం కురు చాసనమ్ ॥

దిగ్బంధన మంత్రము:-

అపసర్పంతు యే భూతాః - యే భూతా భువి సంస్థితాః।
యే భూతా విఘ్నకర్తారః - తే నశ్యంతు శివాజ్ఞయా ॥





కలశపూజనము:-

భస్మగంధపుష్పాక్షతలతో "ఓం" కారము కలశముతో జలము చిలికించి పూజించవలెను కలశోదకముతో సంప్రోక్షణము చేసి విఘ్నేశ్వరుని ధ్యానించి శివపూజ కుపక్రమించవలెను.

ఓం శ్రీ శివాయ పరమాత్మనే నమః ఆవాహయామి,
ఆసనం సమర్పయామి,
పాదయోః పాద్యం సమర్పయామి,
హస్తయో రర్ఘ్యం సమర్పయామి,
శుద్ధాచమనీయం సమర్పయామి,
శుద్ధగంగోదకస్నానం సమర్పయామి.

అథ పంచామృతస్నానమ్:-

ఐదు వస్తువులను గల్పిన పంచామృతమగును. అందులో పాలు అధికభాగముండును. పాలు-పెరుగు-నెయ్యి-





తేనె-చక్కెర ఒక పాత్రలో గలిపినచో "పంచామృత"మనబడును. ఇట్లు ఈ మిశ్రణ క్షీరముతో శివున కభిషేకము జేయవచ్చును, లేక వేర్వేరుగా జేయవచ్చును.

పంచామృత మంత్రము:-

ఆప్యాయస్వ సమేతు తే - విశ్వతః సోమ వృష్ణియమ్।
భవా వాజస్య సంగధే॥

పంచామృతేన స్నాపయామి।

పెరుగు:-

దధి క్రాప్ణో అకారిషం-జిష్ణో రశ్వస్య వాజినః।
సురభి నో ముఖా కరత్-ప్రాణ ఆయూంషి తారిషత్॥
(దధ్నా స్నాపయామి)

నెయ్యి:-

శుక్రమసి-జ్యోతిరసి-తేజోసి-దేవో వ స్సవితోత్పునా
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ-వసో స్సూర్యస్య రశ్మిభిః ॥
(ఘృతేన స్నాపయామి)





తేనె:-

మధు వాతా ఋతాయతే-మధు క్షరంతి సింధవః ।
మాధ్వీ ర్న స్సం త్వోషధీః॥
మధు నక్త ముతోషసి - మధుమ త్పార్థివగ్ం రజః॥
మధు ద్యౌ రస్తు నః పితా॥
మధుమా న్నో వనస్పతి ర్మధుమాగ్ం అస్తు సూర్యః ।
మాధ్వీ ర్గావో భవంతు నః ॥

పంచదార:-(చక్కెర)

స్వాదుః పవస్వ దివ్యాయ జన్మనే
స్వాదురింద్రాయ బృహస్పతయే
మధుమాగ్ం అదాభ్యః॥

ఫలోదకమ్:-

యాః ఫలినీ ర్యా అఫలా - అపుష్పా యాశ్చ పుష్పిణీః
బృహస్పతిప్రసూతా స్తా నో - ముంచం త్వగ్ంహసః॥





శుద్ధోదకమ్:-

ఆపోహిష్ఠా మయోభువ - స్తా న ఊర్జే దధాతు నః।
మహేరణాయ చక్షసే
యో వ శ్శివతమో రస-స్తస్య భాజయతేహనః।
ఉశతీరివ మాతరః॥
తస్మా అరంగమామవో-యస్య క్షయాయ జిన్వథ
ఆపో జనయథా చ నః.

వస్త్ర సమర్పణ మంత్రము:-

మాయాచిత్రపటచ్ఛన్న -నిజగుహ్యోరుతేజసే ।
నిరావరణవిజ్ఞాన - వస్త్రం తే కల్పయా మ్యహమ్ ॥
(ఇతి వస్త్రం సమర్పయామి)

యజ్ఞోపవీత మంత్రము:-

యజ్ఞోపవీతం పరమం పవిత్రం
ప్రజాపతే ర్యత్ సహజం పురస్తాత్।





ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం
యజ్ఞోపవీతం బల మస్తు తేజః ॥
(ఇతి యజ్ఞోపవీతం సమర్పయామి)

అక్షత సమర్పణ మంత్రము:-

అక్షతాన్ ధవళాన్ దివ్యాన్-తిలమిశ్రాన్ మనోహరాన్,
అర్పయామి మహాభక్త్యా - ప్రసీద పరమేశ్వర॥
(ఇతి అక్షతాన్ సమర్పయామి)

పత్రపుష్ప మంత్రము:-

త్రిదళం త్రిగుణాకారం-త్రినేత్రం చ త్రియాయుధమ్ ।
త్రిజన్మపాపసంహారం-ఏకబిల్వం శివార్పణమ్ ॥

మంత్రం:-

సేవంతికావకులచంపకపాటలాబ్జైః ।
పున్నాగజాజికరవీరరసాలపుష్పైః ।





బిల్వప్రవాళసుశమీదళమాలికాభి- ।
స్త్వాం పూజయామి జగదీశ్వర మే ప్రసీద ॥
(ఇతి నానావిధ పరిమళపత్ర పుష్పాణి సమర్పయామి)

ధూప మంత్రము:-

వనస్పతిరసోపేతో-గంధాఢ్యో గంధ ఉత్తమః
ఆఘ్రేయ స్సర్వదేవానాం - ధూపోయం ప్రతిగృహ్యతామ్ ॥
(ఇతి దీపం నీరాజయామి)

కర్పూరదీప మంత్రము:-

కర్పూరనిర్మితో దీపః-స్వర్ణపాత్రే నివేశితః ।
నీరాజనం మయా దత్తం - గృహాణ పరమేశ్వర ॥
(ఇతి కర్పూరదీపం నీరాజయామి)





నైవేద్య మంత్రము:-

నైవేద్యం షడ్రసోపేతం - నానాభక్ష్యసమన్వితం।
దధిక్షీరఘృతోపేతం - స్వీకురు ప్రమథాధిప ॥
(ఇతి నైవేద్యం నివేదయామి
అంతే అర్ఘ్యం సమర్పయామి)

తాంబూల మంత్రము:-

పూగీఫలసమాయుక్తం-నాగవల్లీదళైర్యుతం।
సచూర్ణఖదిరం దేవ-తాంబూలం ప్రతిగృహ్యతామ్ ॥
(ఇతి తాంబూలం సమర్పయామి,
అంతే పానీయం సమర్పయామి)

దక్షిణామంత్రము:-

హిరణ్యగర్భగర్భస్థం - హేమ బీజం విభావసోః ।
అనంతపుణ్యఫలదం - ప్రయచ్ఛామి మహేశ్వర ॥
(ఇతి సువర్ణ దక్షిణాం సమర్పయామి,
అంతే పానీయం సమర్పయామి)





పుష్పాంజలి మంత్రము:-

యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః-తాని ధర్మాణి ప్రథమా న్యాసన్।

తే హ నాకం మహిమాన స్సచంతే

యత్ర పూర్వే సాధ్యాః స్సంతి దేవాః ॥

(ఇతిపుష్పాంజలిం సమర్పయామి)

ప్రదక్షిణమంత్రము:-

ప్రకృష్టపాపనాశాయ-ప్రకృష్టఫలసిద్ధయే।

ప్రదక్షిణం కరోమీశ-ప్రసీద పరమేశ్వర ॥

(ఇతి ప్రదక్షిణ నమస్కారం కరోమి)

నమస్కార మంత్రము:-

నమః శివాయ శాంతాయ-నమ స్సోమాయ శంభవే।

నమః శివాయ కల్యాణీ-పతయే తే నమోనమః ॥

(ఇతి నమస్కారం సమర్పయామి)





స్తోత్ర మంత్రము:-

హర శంభో మహాదేవ-విరూపాక్ష త్రిలోచన।
దయాసింధో దీనబంధో - రక్ష రక్ష మహేశ్వర ॥
మాయాసముద్రపతితం-అనంతకలుషాయుతం ।
మా ముద్ధర మహేశాన - భక్తవత్సల శంకర ॥
(ఇతి స్తోత్రం కరోమి)

ప్రార్థన మంత్రము:-

మంత్రహీనం క్రియాహీనం - ద్రవ్యహీనం సురేశ్వర ।
య త్పూజితం మయా దేవ - పరిపూర్ణం తదస్తు మే॥
అపరాధసహస్రాణి - క్రియంతేఽహర్నిశం మయా।
పాహి మా మపరాధేభ్యః - పితా పుత్రమివ ప్రియమ్॥
(ఇతి ప్రార్థనా)





ధ్యానము:-

వందే శంభు ముమాపతిం సురగురుం
వందే జగత్కారణం ।
వందే పన్నగభూషణం మృగధరం
వందే పశూనాం పతిం।
వందే సూర్య శశాంకవహ్నినయనం
వందే ముకుందప్రియం
వందే భక్తజనాశ్రయం చ వరదం
వందే శివం శంకరమ్.



శ్రీరస్తు

# శివగీత

## ప్రథమాధ్యాయము

### భక్తినిరూపణ యోగము

**సూత ఉవాచ:**

***అథాzత స్సంప్రవక్ష్యామి - శుద్ధకైవల్యముక్తిదమ్,***
***అనుగ్రహాన్మహేశస్య - భవదుఃఖస్య భేషజమ్.*** **1**

శ్రీ శౌనకాది మహర్షులఁగూర్చి సూతుండిట్లు వాక్రుచ్చెను:

ఓయీ మునిపుంగవులారా! శ్రీ పరమాత్మపరశివమూర్తి





యొక్క అనుగ్రహము వలన, పరమ పునీతమగు, సంసార మనెడు ఔషధప్రాయమైన బ్రహ్మ స్వరూపకైవల్యమను మోక్షప్రదమగు జ్ఞానమును నేను మీకు బోధించుచున్నాడను.

*న కర్మణామనుష్ఠానై - ర్న దానై స్తపసాఽపి వా,*
*కైవల్యం లభతే మర్త్యః - కిం తు జ్ఞానేన కేవలమ్. 2*

ఎటువంటి పుణ్య కర్మల ననుష్ఠించుటవలనను, ఏలాంటి తపోనుష్ఠానముల జేయుటవలనను కైవల్యపదప్రాప్తిని పొందలేడు. ఐతే కేవల మొక దివ్య జ్ఞానమువలననే కైవల్యప్రాప్తి కలుగును.

*రామాయ దండకారణ్యే - పార్వతీపతినా పురా,*
*యా ప్రోక్తా శివగీతాఖ్యా - గుహ్యా ద్గుహ్యతమాపి సా. 3*

*యస్యా శ్శ్రవణమాత్రేణ - నృణాం ముక్తి ర్ధ్రువా భవేత్,*
*పురా సనత్కుమారాయ - స్కందేనాఽభిహితా హి సా. 4*





పూర్వకాలమున దండకారణ్యములో శ్రీరామునకు శంకరునిచేత యేద్దైతే ప్రథమమున బోధించబడినదో, ఏద్దైతే పరమ గోప్యంబగునదియు, ఎద్దానిని ఆలించుట చేతనే మానవులకు నిత్య (శాశ్వత) కైవల్యములభించునో అట్టి శివగీతను సనత్కుమారునకు షణ్ముఖస్వామి బోధించెను.

***సనత్కుమారః ప్రోవాచ - వ్యాసాయ ఋషిసత్తమాః,***
***మహ్యం కృపాతిరేకేణ - ప్రదదౌ బాదరాయణః. 5***

తరువాత నాసనత్కుమారుడు వ్యాసునకు బోధించిన వాడయ్యెను. అట్టి వ్యాసమహర్షి నా యందనుగ్రహము గలవాడై నాకు బోధించియున్నాడు.

***ఉక్తం చ తేన కస్మైచి - న్న దాతవ్యమిదం త్వయా,***
***సూతపుత్రాన్యథా దేవాః - క్షుభ్యంతి చ శపంతి చ. 6***





మరల చిత్తగింపుమని యుద్బోధించి దీనిని యితరుల కెవ్వరికిని బోధింపవలదనియు, దీని నుల్లంఘించిన యెడల దేవతలావేశపరులై శపించగలరని యాదేశించెను.

*అథ పృష్టో మయా విప్రో - భగవాన్బాదరాయణః,*
*భగవన్! దేవతాస్సర్వాః - క్షుభ్యంతి చ శపంతి చ.* 7

*తాసామత్రాస్తి కా హాని - ర్యయా కుప్యన్తి దేవతాః,*
*పారాశర్యో ఽథ మామాహ - యత్పృష్టం శృణు వత్సల!* 8

ఇంతటితో నేను ఓయి ముని పుంగవా! ఇటులేల బలుకుచున్నారు. ఈ శివగీతను ఇతరులు దెలుసుకున్నంత మాత్రమున దేవతలకు కలిగే చెఱుపేమిటి (నష్టమేమి)? అలా కోపగించుటకు హేతువేమి? ఎందులకు శపింతురు? అని ప్రశ్నింపగా వేదవ్యాసుడు నాయందు గల శిష్య వాత్సల్యముతో నిట్లాదేశించెను:





*నిత్యాగ్నిహోత్రిణో విప్రా - స్సన్తి యే గృహమేధినః,*
*త ఏవ సర్వఫలదా స్సు - రాణాం కామధేనవః.* 9

*భక్ష్యం భోజ్యం చ పేయం చ - యద్యదిష్టం సువర్వణామ్,*
*అగ్నౌ హుతేన హవిషా - తత్సర్వం లభ్యతే దివి* 10

*నాన్యదస్తి సురేశానా - మిష్టసిద్ధిప్రదం దివి,*
*దోగ్ధ్రీ ధేనుర్యథా నీతా - దుఃఖదా గృహమేధినామ్.* 11

*తథైవ జ్ఞానవాన్ విప్రో - దేవానాం దుఃఖదో భవేత్,*
*త్రిదశాస్తేన విఘ్నన్తి - ప్రవిష్టా విషయం నృణామ్.* 12

ప్రపంచములో నెల్లప్పుడు ద్విజశ్రేష్ఠుఁడు గృహస్థాశ్రమంలో నుండి జ్యోతిష్టోమము మొదలగు యజ్ఞములు జేయుచు, అమరవరుల కేయే వస్తువులు ఇష్టములో నాయాభక్ష్యభోజ్య, చోష్య పానాదుల బర్హిర్ముఖశ్రేష్ఠులకు అగ్నిద్వార హవ్యదానం బొనర్చుచున్నాడో అతడే బృందారకుల



పాలిటికి గల్పవృక్షము వంటివాఁడు, ఆ దేవతలు అంతులేని యానంద భరితులై నిర్మల మనస్కులై యగ్నిద్వారా సమర్పించు వాటిని ప్రేమతో గైకొందురు. కావున మానవుండైనను అమరులకధిక ఆనందదాయకములైన యధ్వరంబులను గావించి, వారివారికి వహ్ని ద్వారా బలిని సమర్పించు చుండవలెను. అట్లు జేయకుండ యోగాదులొనర్చి, అమరులను విస్మరించి, కర్మలను త్యజించి వర్ణనాతీతమైన ఆనందానుభవతృప్తి నందినవాడైనయెడల క్రతుభుక్కులు తమ కోరికలు దీరకుండుటవలన అసంతృప్తి చేత కుపితులై శాపంబిడుదురు. మరియు, పాలనొసఁగు గోవును మరొకడు వేరు మార్గమున గొనిపోవ సాగ్రహస్థుడు యెంతటి వ్యథగలవాడై చింతించి వెదకి మరల తన మార్గమునకు మరల్చుకొనునో, అదే రీతిగా దేవతలు మిగుల విచారముగలవారై తమ మార్గమును బరిత్యజించి మోక్షగామియగు వానిని యనేక

విధముల ఆటంకములనే గల్పించి ముందుకు బోనివ్వకుండ అన్య మార్గమునకు బ్రవేశింపఁజేతురు.

*తతో న జాయతే భక్తి - శ్శివే కస్యాపి దేహినః,*
*తస్మా దవిదుషో నైవ - జాయతే శూలపాణినః.* **13**

*యథాకథంచిజ్ఞాతాపి మధ్యే విచ్ఛిద్యతే నృణామ్,*
*జాతం వాపి శివజ్ఞానం - విశ్వాసం న భజత్యలమ్.* **14**

అందుచేత నెవడికైనను, పరశివునిపై భక్తి యంకురింపదు, ఆ కతంబున, పరమ శివునిపై భక్తి గలుగకుండును. ఇది నిస్సందేహము. అట్లుగాకుండ యే ప్రకారముగానో ఎంతో ప్రయత్నముతోడనో పరశివునిపై భక్తి గలిగెనా, అది మధ్యనే కొంత సమయమునకు అనేక అడ్డంకులేర్పడి నిష్ఫలంబగును. అటులగానిచో భక్తిచేత ప్రేమ అంకురించుట క్వాచిత్కము.

*యద్యేవం దేవతా విఘ్నమాచరన్తి తనూభృతామ్,*

*పౌరుషం తత్ర కస్యాస్తి - యేన ముక్తిర్భవిష్యతి?* 15

*సత్యం సూతాత్మజ! బ్రూహి - తత్రోపాయోఽస్తివా న వా?*

అది విని, శౌనకాదులు సూతునిగురించి యిట్లు బలికిరి: ఓయీ సూతకుమారా! ఈ విధముగ నమరులు తమ యధికారము మేరకు తృప్తినొందని మానవు లాచరించు జ్ఞానపద్ధతికి బలు అడ్డంకులు గలిగించిరేని ముక్తి పదంబును బడయు టెట్లు? పౌరుషముగలవారు ( పట్టుదల గలవారు) వారొడ్డిన ఆటంకములను దొలగించే మార్గమేదైన గలదా? అట్లుండినచో నా విధము మా కెరంగింపుమని యడుగగా సూతుండిట్లు బలికెను:

*కోటిజన్మార్జితైః పుణ్యైః - శివే భక్తిః ప్రజాయతే.* 16

*ఇష్టాపూర్తాని కర్మాణి - తేనాచరతి మానవః,*

కోటి జన్మలనుండి సంగ్రహించిన పుణ్యఫలము



(సుకృతమువలన) మహేశ్వరునిపై భక్తి కుదురుతుంది. అందుచేత (ఆ కారణమున) మానవుఁడు తన ఇష్టానుసారముగ అనుష్ఠానము నాచరించుట, తటాకములను ద్రవ్వించుట, వృక్షములను బెంచుట, చలివేంద్రములను బెట్టించుట, క్షుధార్తులకు అన్న సత్రములను బెట్టించుట మొదలగు పుణ్యకార్యములను జేయబూనును.

*శివార్పణధియా కామా - న్పరిత్యజ్య యథావిధి.* **17**

*అనుగ్రహా త్తేన శంభో - ర్జాయతే సుదృఢో వరః,*
*తతో భీతాః పలాయన్తే - విఘ్నం హిత్వా సురేశ్వరాః.* **18**

దానివలన మానవుఁడు దన కోరికలను వీడి నిష్కామముగలవాడై శివార్పణ బుద్ధిచేత సత్కర్మలననుష్ఠించుట వలన అతడు శివానుగ్రహమునకు బాత్రుడై సంకల్ప సిద్ధులను బొందును. అట్టి యమూల్యంబైన





శివానుగ్రహముచేత నాతని సుఖములకు జరుగబోవు నాటంకములు నమసిపోవుటేగాకుండ అమరులు సఫలీభూతంబులగు కర్మలను బసిగట్టి పరమ శివుని యనుగ్రహము వలన దమకెటువంటి చెరుపు (నష్టము) గలుగునో యనియెంచి భయముతో నాతడు చేపట్టిన కార్యములకు ఏ విధమైన ఆటంకములను గలిగింపక పలాయనమగుదురు.

***జాయతే తేన శుశ్రూషా - చరితే చంద్రమౌళినః,***
***శృణ్వతో జాయతే జ్ఞానం - జ్ఞానాదేవ విముచ్యతే. 19***

అందువలన మానవుడెల్లప్పుడు శివార్పణ బుద్ధి గలిగి నిష్కామముతో శివార్చన శివకథాశ్రవణాదులందు జ్ఞానార్జనను గావించుకొనును. దాని ప్రభావమున సంసృతి మోక్షమును బడయును.





*బహునాత్ర కిముక్తేన - యస్య భక్తి శ్శివే దృఢా,*
*మహాపాపోపపాపౌఘ - కోటిగ్రస్తో విముచ్యతే.* 20

వేయేల? ఏ భక్తుడికైతే పరమశివునియందు దృఢమై నిర్మలమగు భక్తి గలుగునో అట్టివాడే మహా పాపములచేతను ఉపపాపములచేతను ముక్తుడగును.

*అనాదరేణ శాఠ్యేన - పరిహాసైః రసూయయా,*
*శివభక్తిరతశ్చేత్స్యా - దంత్యజోఽపి విముచ్యతే.* 21

అస్పృశ్యుడైనను, కారణమేమియులేకుండగాని, వంచకత్వముతోగాని, పరిహాసమునకుగాని, ఈర్ష్యచేతగాని శివుని యందు భక్తి యంకురించినయెడల అటువంటివాఁడు సమస్త పాపములనుండి ముక్తుడగును.

*శివభక్తిశ్చ సర్వేషాం - సర్వదా సర్వతోముఖా,*
*తస్యాం చ లిప్యమానాయాం - యస్తు మర్త్యో విముచ్యతే.* 22





***సంసార బంధనా త్తస్మా - దన్య : కో వా విమూఢధీః,***

శివభక్తియెవరియందు దృఢపడునో వారలకు (శివభక్తులకు) ఎల్లప్పుడెల్ల కోరికలను దీర్చును. దానిలో పూర్తిగా నాసక్తిగలవాఁడు ఈ సంసార పాశబంధములనుండి విడువబడుచున్నాడు.

***నియమాద్యస్తు కుర్వీత - భక్తిం వా ద్రోహమేవ వా. 23***
***తస్యాపి చేత్ప్రసన్నోऽ సౌ - ఫలం యచ్ఛతి వాంఛితమ్,***

***బుద్ధం కించిత్సమాదాయ - క్షుల్లకం జలమేవ వా, 24***
***యో దత్తే నియమేనాసౌ - తస్మై దత్తే జగత్త్రయమ్.***

ఏవాడు నియమము తప్పకుండా పరమశివునిపై భక్తితోగాని, చెడ్డతనముఁజేయకుండగాని ఆచరించునో అట్టి భక్తునకు బరమాత్ముడు బ్రత్యక్షమై సంతోషించినవాడై సర్వాభీష్టములను సఫలమొనర్చును. బిల్వదళముగాని,





జలమునుగాని, అనన్య భక్తితో సమర్పించునో ఆతనికి నా పరమశివుడు త్రైలోకాధిపత్యము నొసఁగును.

*తస్యాఽప్యశక్తో నియమా - న్నమస్కారం ప్రదక్షిణామ్.* **25**
*యః కరోతి మహేశస్య - తస్మై తుష్టో భవేచ్ఛివః.*

*ప్రదక్షిణాప్యశక్తోఽపి - యస్స్వాంతే చింతయేచ్ఛివమ్.* **26**
*గచ్ఛన్నుపవిష్టో వా - తస్యాఽభీష్టం ప్రయచ్ఛతి,*

అట్లొనర్పుట కవకాశము లేనిచో ప్రదక్షిణ నమస్కారముల మనస్ఫూర్తిగా సమర్పించినను అందుకు బ్రసన్నుడై మృత్యుంజయు డానందించును. అందుకును అవకాశము అథవా సామర్థ్యము లేనియెడల తానున్న చోటనే పరమ శివుని మనస్సులో ధ్యానించవలెను. దాన శివుడు కోరిన కోరికల దీర్చును.

*చందనం బిల్వకాష్ఠస్య - పుష్పాణి వనజాన్యపి.* **27**





*ఫలాని తాదృశాన్యేవ - యస్య ప్రీతికరాణి వై,*
*దుష్కరం తస్య సేవాయాం - కిమస్తి భువనత్రయే.* 28

బిల్వవృక్షము బెరడుతో (చెక్కతో) నరగదీసిన శ్రీగంధము, అడవిలోని పువ్వులు, ఫలములు మున్నగునవి యైనను భక్తితో సమర్పించినను మహాదేవుడు సంతసించును. వీటియందే ఆతనికి యెక్కువ మక్కువగూడ. ఇటులుండగా నా పరమాత్ముని యుపాసించుటలో నెవరికి దానే కష్టమగును.

*వన్యేషు యాదృశీ ప్రీతి - ర్వర్తతే పరమేశితుః,*
*ఉత్తమేష్వపి నాప్త్యేవ - గ్రామజేష్వపి తాదృశీ.* 29

*తం త్యక్త్వా తాదృశం - దేవం యస్సేవేతాన్యదేవతామ్,*
*న హి భాగీరథీం త్యక్త్వా - కాంక్షతే మృగతృష్ణికామ్.* 30

శివునకు అడవియందే వికసించే పుష్పములందును,





పండిన ఫలములందును, దళాదులందును ఎంత మక్కువో అంతటి ప్రీతి గ్రామమందుండి శ్రేష్ఠములే అయినప్పటికిన్ని వానియం దాసక్తి యుండదు. ఆ విధముగా సులభముగా ప్రసన్నుడయ్యే భోలాశంకరుని వీడి ఇతరత్ర నుండు దేవుళ్ళను బూజించినచో ప్రక్కనేయున్న గంగానదిని వీడి ఎండమావులను జూచి యాచించి మోసపోయినవాడే యగును. అలంకార ప్రియో విష్ణుః, అభిషేకప్రియః శివః, సులభసాధ్యుడు శివుడు.

*కిం తు యస్యాస్తి దురితం - కోటిజన్మసు సంచితమ్.*
*తస్య ప్రకాశతే నాఽయం - త్వర్థో మోహాంధచేతసః.* **31**

*న కాలనియమో యత్ర - న దేశస్య స్థలస్య చ,*
*యత్రాస్య రమతే చిత్తం - తత్ర ధ్యానేన కేవలమ్,* **32**

*స్వాత్మత్వేన శివస్యాఽసౌ - శివసాయుజ్యమాప్నుయాత్,*

అసలు విషయమేమనగా -ఎవడైతే అనేక జన్మముల





నుండి పాపకర్మములజేసి మూటగట్టుకొని యున్నాడో అట్టి పాపిష్ఠునకు జ్ఞానశూన్యునికి, యీ శైవ తత్త్వము నచ్చదు. ఇట్టి సులభైక ఉపాస్యుడైన శివుని సేవించుటకు ఇట్టి సమయమనికాని, ఇట్టి స్థలమనిగాని, ఇట్టి ప్రదేశమనిగాని నిర్ణయము లేదు. ఎట్టి సమయమందైనను ఏ కాలను, ఏ దేశమందైనను మనస్సు సుప్రసన్నముగా నుండునో అదే సమయంబున ఆయా స్థలములందే దన హృదయమున పరమశివుని ధ్యానించినట్లైతే అట్టి నిర్మల మనస్సు గల మానవునకు సాక్షాత్తుగా కైలానప్రాప్తి గలుగుటలో సందేహమించుకయు లేదు అనగా సంశయింప బనిలేదు.

**అతిస్వల్పతరాయుశ్రీ - ర్భూతేశాంశాధిపోఽపి యః. 33**
**న తు రాజాఽహమస్మీతి - వాదినం హన్తి స్వాఽవ్యయమ్,**

**కర్తాపి సర్వలోకానా - మక్షయైశ్వర్యవానపి. 34**





*శివశ్శివోఽహ మస్మీతి - వాదినం యం చ కంచన,*

ఎట్టి మహేశాంశమున బుట్టినవాడైనను, "నేనే ప్రభువును" అనే అహంభావము ఎవనిలో పొడమునో అట్టి వానికి ఆయువు క్షీణించుటే గాకుండ నిర్వంశమగుటకు మూలమగును. కావున మూడు లోకములకు ప్రభువైనప్పటికిన్ని ఐశ్వర్యవంతుడైనను దురభిమానమునకు లోనుగాక శివోహంభావముతోనుండిన అథవా దాసోహం భావంతో నుండినను ఆ పరశివమూర్తి మిక్కిలి బ్రసన్నుండై దనలో నైక్యమొనర్చుకొనును.

*ఆత్మనా సహ తాదాత్మ్య - భాగినం కురుతే భృశమ్.* 35

*ధర్మార్థకామమోక్షాణాం - పారం యాన్త్యన్తి యేన వై,*
*మునయ స్తత్ప్రవక్ష్యామి - వ్రతం పాశుపతాభిధమ్.* 36

*కృత్వా తు విరజాం దీక్షాం - భూతిరుద్రాక్షధారిణః,*





*జపంతో వేదసారాఖ్యం శివనామసహస్రకమ్.* **37**

*వంత్యజ్య తేన మర్త్యత్వం శైవీం తనుమవాప్య చ,*

ఓయి! (ఋషి) మునివరులారా! తొల్లి మునీశ్వరులే ఆచరించి; ధర్మము, అధర్మము, కామము మరియు మోక్షమనెడు చతుర్విధములగు ఫల పురుషార్థముల సారముల చక్కగా నవగతము జేసికొన్న పాశుపతమనెడి వ్రతమును నీకు వివరించెదము వినుడు. మీరుగూడ నేను వివరించిన విధముగా విరజాదీక్షను బొంది, విభూతి, రుద్రాక్షలను మేనదాల్చి చతుర్వేద సారములైన శివసహస్ర నామములను వల్లింపుచుండ దత్రుభావముచేత అశాశ్వతమగు నీమనుష్యత్వమును వీడి శివస్వరూపమును బడయగలరు.

*తతః ప్రసన్నో భగవాం - చ్ఛంకరో లోకశంకరః.* **38**

*భవతాం దృశ్యతా మేత్య - కైవల్యం వః ప్రదాస్యతి,*





*రామాయ దండకారణ్యే - యత్ప్రాదాత్కుంభసంభవః,*
*తత్సర్వం వః ప్రవక్ష్యామి - శృణుధ్వం భక్తియోగినః.* *39*

*ఇతి శ్రీపద్మపురాణే శివగీతాయాం ప్రథమోఽధ్యాయః.*

తరువాత లోక కల్యాణకర్త శంకరుడు మీ యందనుగ్రహము గలవాడై ప్రత్యక్షమై కైవల్యమిచ్చును. పూర్వకాలమున దండకారణ్యములో దన భార్యను గోల్పోయిన శ్రీరామచంద్రునకు అగస్త్యమహాముని యే యోగశాస్త్రము నుపదేశించియుండెనో అట్టి దానినే సర్వమును మీకును బోధింతును గనుక అత్యంత భక్తిగలవారై యాలకింపుడు.

ఇది వ్యాసోక్త శ్రీపద్మపురాణాంతర్గతంబైన శివగీతలో
ప్రథమాధ్యాయము పరిసమాప్తము.



# అథ ద్వితీయాధ్యాయము

## వైరాగ్య యోగము

***ఋషయ ఊచుః -***

***కిమర్థ మాగతోऽగస్త్యో - రామచంద్రస్య సన్నిధిమ్,***
***కథం వా విరజాం దీక్షాం - కారయామాస రాఘవమ్.*** **1**
***తతః కిమాప్తవా న్రామః - ఫలం తద్వక్తుమర్హసి,***

ఋషులు వక్కాణించిరి :-

ఓయీ సూతమహాముని! దండకారణ్యంబులోనున్న శ్రీరాముని వద్దకు అగస్త్య మహాముని యెందులకు గాను విచ్చేసెను? ఏవిధముగా శ్రీరామునికి విరజాదీక్షనొసంగెను? ఆపైన రాముడేమి ఫలము నార్జించెను? ఆ సమస్తమును విస్తారముగా మాకు దెలుపుము. అనవిని సూతుడిట్లు చెప్పెను:



**రావణేన యదా సీతాఽపహృతా జనకాత్మజా. 2**

**తదా వియోగదుఃఖేన - విలపన్నాస రాఘవః,**
**నిర్నిద్రో నిరహంకారో - నిరాహారో దివానిశమ్. 3**

**మోక్తుమైచ్ఛత్తతః ప్రాణా - న్సానుజో రఘునన్దనః,**

ఎప్పుడైతే సహధర్మపత్నియగు సీతాదేవి రావణాసురుని చేత నపహరింపబడినదో అప్పుడు శ్రీరాముడు ప్రియురాలి విరహదుఃఖము వలన రాత్రి పగలు నిద్రలేమి కతమున ఆహారము, అహంకారము లేనివాఁడై తన తమ్ముడైన లక్ష్మణునితోఁసహ అనువులఁబాయుటకు బ్రయత్నించెను.

**లోపాముద్రాపతి ర్జ్ఞాత్వా- తస్య సన్నిధి మాగమత్. 4**

**అథ తం బోధయామాస - సంసారాఽసారతాం మునిః,**
**కిం విషీదసి రాజేన్ద్ర కాన్తా కస్య విచార్యతామ్. 5**



*జడః కిన్ను విజానాతి - దేహోఽయం పాంచభౌతికః,*
*నిర్లేపః పరిపూర్ణశ్చ - సచ్చిదానన్దవిగ్రహః. 6*

*ఆత్మా న జాయతే నైవ - మ్రియతే న చ దుఃఖభాక్,*

ఈ సంగతిని పసిగట్టి లోపాముద్రపతియైన అగస్త్యమహర్షి శ్రీరాముని కడకు వచ్చిన వాడయ్యెను. ఆ మీదట నాతడు సంసారమునందలి నిస్సారత నీప్రకారముగా నుద్బోధించెను:

ఓయీ రామచంద్రా! ఎందులకు నీవిటు దుఃఖించుచున్నావు. సీత యెవడిదో విచారించి చూడుము. మూఢులకీ రహస్యము దెలియదు. ఈ దేహము పంచభూతములతో గూడియున్నది. ఏలాంటి సంబంధము లేనిదీ యాత్మ సచ్చిదానంద స్వరూపమైనది. ఇది జనన మరణంబుల కతీతమైనది. మరియు దుఃఖములకు లోనుగానిది.



సూర్యోऽసౌ సర్వలోకస్య - చక్షుష్యేవ వ్యవస్థితః. 7

తథాపి చాక్షుషైర్దోషై - ర్న కదాచి ద్విలిప్యతే,
సర్వభూతా ऽన్తరాత్మాపి తద్వద్దుఃఖైర్న లిప్యతే. 8

దేహోऽపి మలపిణ్డోऽయం - ముక్తజీవో జడాత్మకః,
దహ్యతే వహ్నినా కాష్ఠై - శ్శివాద్యైర్భక్ష్యతేऽపి వా, 9

తథాపి నైవ జానాతి - విరహే తస్య కా వ్యథా,
సువర్ణగౌరీ దూర్వాయా - దళవ చ్ఛ్యామలాపి వా, 10

పీనోత్తుంగ స్తనాభోగ - భుగ్నసూక్ష్మావలగ్నకా,
బృహన్నితంబజఘనా - రక్తపాదసరోరుహా 11

రాకాచన్ద్రముఖీ బింబ - ప్రతిబింబరదచ్ఛదా,
నీలేందీవరనీకాశ - నయనద్వయశోభితా. 12

మత్తకోకిలసల్లాపా - మత్తద్విరదగామినీ,





**కటాక్షైరనుగృహ్ణాతి మాం - పంచేషుశరోత్తమైః. 13**

**ఇతి యో మన్యతే మూర్ఖ - స్స చ పంచేషుశాసితః,**

బంగారు వర్ణముగలది లేత గరిక. మావి శ్యామలయు, బిగువుచనుదోయి (కలశస్తనములు) గలది. దొండపండువంటి క్రింది పెదవిగలది. ఇందుముఖియు మున్నగు విశేషనామములతో గూడిన యువతుల క్రీగంటి చూపుల వలననూ పూవిలుకాని నుండి దప్పించి గాపాడునని యెవ్వడైతే దలపోయునో అట్టి యవివేకి మన్మథుని చేత శిక్షింపబడినవాడే యగును.

**తస్యాఽవివేకం వక్ష్యామి - శృణుష్వాఽవహితో నృప. 14**

**న చ స్త్రీ న పుమానేష - న చైవాయం నపుంసకః,**

**అమూర్తః పురుషః పూర్ణో - ద్రష్టా సాక్షీ సజీవనః. 15**

**యా తన్వంగీ మృదు ర్బాలా - మలపిండాత్మికా జడా,**





అటువంటి వాడి యవివేకము ఎట్టిదో దానివి గురించి వివరించుచున్నాను. శ్రద్ధతో వినుము.

పరమాత్ముడు స్త్రీ-పురుష నపుంసకముల కతీతమైనవాడు. మూర్తిత్వరహితుడు, సర్వాంతర్యామి, సమస్తమునకు సాక్షిభూతుడు, సర్వాపేక్షకుడు, సమస్త జీవితముగూడ అగును.

***సా న పశ్యతి యత్కించిన్న - శృణోతి న జిఘ్రతి. 16***

***చర్మమాత్రా తను స్తస్యా - బుద్ధ్యా వీక్షస్వ రాఘవ!***
***యా ప్రాణాదధికా సైవ - హన్త తే స్యాద్ఘృణాస్పదమ్. 17***

***జాయన్తే యది భూతేభ్యో - దేహినః పాంచభౌతికాః,***

సున్నితము, కోమలమైన యుపాంగములు (అవయములు) గలిగి, మల మూత్ర పిండాత్మకము, జడదేహముగలదియునైన యెవని తయనబడినదై, ఇతరులను





జూడదు, వినదు, వాసనను గూడ చూడదు. ఓ రామా! వివేక జ్ఞానముతో నొకపరి దర్శింపుము. నీవు దేనినైతే నీ ప్రాణము కంటెను మిన్నగాను, ప్రేమకు పాత్రమైనదిగాను దలపోయుచుంటివో అట్టి శరీరము తోలుతిత్తి మాత్రమే. హేయాస్పదమైనది. దానిని నీవు ప్రేమింపదగదు.

*ఆత్మా య దే కల త్రేషు - పరిపూర్ణ స్సనాతనః.* **18**

*కా కాన్తా తత్ర కః కాన్త - స్సర్వ ఏవ సహోదరాః,*
*నిర్మితాయాం గృహావల్యాం - తదవచ్ఛిన్నతాం గతమ్.* **19**

*నభ స్తస్యాం తు దగ్ధాయాం - న కాంచి త్క్షతి మృచ్ఛతి,*
*తద్వ దాత్మాపి దేహేషు - పరిపూర్ణ స్సనాతనః.* **20**
*హన్యమానేషు తేష్వేవ - స్వయం నైవ హి హన్యతే,*

పంచభూతాత్మకంబైన శరీరములం దంతటను పరమశివుడు (ఆత్మరూపమున) వ్యాపించియున్నాడు.





గృహనిర్మాణ సమయమున షాటిని విడిచి యాకాశముండదు, కాని అవి దహింపబడునప్పు డేవిధముగా నాకాశము దహింపఁబడదో అట్లే దేహములందుండెడు ఆత్మ నశింపదు. దేహములు నశించును.

***హన్తా చేన్మన్యతే హన్తుం - హత శ్చే న్మన్యతే హతమ్. 21***

***తా వుభౌ న విజానీతో - నాయం హన్తి న హన్యతే,***
***అస్మాన్నృపాతిదుఃఖేన - కిం ఖేదస్యాస్తి కారణమ్. 22***

***స్వస్వరూపం విదిత్వేదం - దుఃఖం త్యక్త్వా సుఖీ భవ,***

ప్రపంచమునందు ఒక వ్యక్తి మరొక వ్యక్తిని కొట్టినచో వాడిని కొట్టిన వాడనిగాని అట్లు కొట్టబడిన వ్యక్తి దెబ్బల కోర్చిన వ్యక్తినిగాని, ఇట్లు కొట్టినవాడు కొట్టబడినవాడు ఈ యుభయులలో నే ఒక్కరు కర్తలుగారు. కావున ఓ రామా! ఇందులకై శోకింపఁబనిలేదు. నీ యాత్మస్వరూపమును గనుఁగొని





దుఃఖమును మాని నిత్యసుఖివిగమ్ము.

*శ్రీ రామ ఉవాచ :-*

***మునే! దేహాన్య నో దుఃఖం - నైవ చేత్పరమాత్మనః. 23***

***సీతావియోగదుఃఖాగ్ని - ర్మాం భస్మీకురుతే కథమ్?***

***సదాఽనుభూయతే యోఽర్థ - స్స నాస్తీతి త్వయేరితః. 24***

***జాయతాం తత్ర విశ్వాసః - కథం మే మునిపుంగవ!***

రాముడు నివేదించుకొనుచున్నాడు: ఓయీ మునిపుంగవా! పరమాత్మకును శరీరమునకు వ్యధలేదని మీరాదేశించితిరి. అటులైన యెడల సీత యెడబాటుతో నుప్పతిలు దుఃఖము మదన బాణాగ్ని నన్ను గాల్చి భస్మావశేషము గావించుచున్నది. నిరంతరమేది యనుభవింపబడుచున్నదో ఆ విధమైనది మిథ్యయని నిరూపించితిరి, అద్దానిని గురించి నాకు విశ్వాసమెట్లు గలుగును? నాకు దెలియపరచుము.





**అన్యోऽస్తి నాస్తికో భోక్తా - యేన జన్తుః ప్రతప్యతే. 25**

**సుఖస్య వాపి దుఃఖస్య - త ద్బ్రూహి మునిసత్తమ!**

ఎట్టి దుఃఖము వలన మనుష్యుడు బాధజెందునో అట్టి దుఃఖము ననుభవించుటకు గాని, యెట్టి సుఖమువలన సుఖము ననుభవించునో అట్టి సుఖదుఃఖముల ననుభవించు వాడొక్కడే బాధ్యుడుగాని యితరులు భోక్తలెట్లగుదురు నాకు వివరింపుమో మునివర్యా!

**దుర్జ్ఞేయా శాంభవీ మాయా తయా సమ్మోహ్యతే జగత్ 26**

**మాయాం తు ప్రకృతిం విద్ధి - మాయినం తు మహేశ్వరమ్,**

**తస్యాऽవయభూతైస్తు - వ్యాప్తం సర్వమిదం జగత్. 27**

**సత్యజ్ఞానాత్మకోऽనన్తో - విభురాత్మా మహేశ్వరః,**

అగస్త్యుడు చెప్పుచున్నాడు: ఆ మహేశ్వరుడు సన్నిన



మాయను దెలిసికొనుటకు ఎవరికి సాధ్యపడును? ఆ మహేశ్వర మాయవలన ఈ ప్రపంచమంతయు మోహింపఁబడినది. అట్టి మాయను ప్రకృతిగను, మాయామయుడు మహేశ్వరుడని యెఱుంగుము. ఆ మహేశ్వరుడెటువంటి వాడనగా సాక్షాత్తుగా సత్యజ్ఞాన స్వరూపుడు. నాశమునభః పుష్పము వంటివాడు. (అనగా మృత్యుంజయుడు) సకలలోక సంరక్షకుండు, ఆత్మ స్వరూపుడు ఆతని యుపాంగభూతములైన (అవయవములైన) చేతనాచేతన ప్రాణికోటి చేత నీ ప్రపంచమునునిండా ఆవరించుకొనియున్నది.

*తస్యైవాంశో జీవలోకే - ప్రాణినాం హృదయే స్థితః.* **28**

*విస్ఫులింగా యథా వహ్నే - ర్జాయన్తే కాష్ఠయోగతః,*
*అనాదికర్మసంబంధా - త్తద్వదంశా మహేశితుః.* **29**

రాపిడి గల్గిన కట్టెలనుండియగ్ని బుట్టి దాని కణములు



వ్యాపించినట్లుగా మానవుని యనాదిసంచితమగు కర్మవాసనచేత మహేశ్వరాంశము ప్రపంచమందలి ప్రాణికోటి హృదయము లందిమిడియున్నది.

*అనాదివాసనాయుక్తాః - క్షేత్రజ్ఞా ఇతి తే స్మృతాః,*
*మనో బుద్ధిరహంకార - శ్చిత్తం చేతి చతుష్టయమ్.* *30*

*అన్తఃకరణమిత్యాహు - స్తత్ర తే ప్రతిబింబితాః,*
*జీవత్వం ప్రాప్నుయుః - కర్మ ఫలభోక్తార ఏవ తే.* *31*

అనాదియగు వాసనలచేత నిండియున్న అట్టి మహేశ్వరాంశసంజనితులైన ప్రాణులు. క్షేత్రజ్ఞులనఁ బరగుచున్నారు. మనస్సు-చిత్తము-బుద్ధి-అహంకారము ఈ నాల్గింటిని యంతఃకరణ చతుష్టయములందురు. వీటిలోనే ప్రతిబింబముగా నేర్పడిన చైతన్యమే ప్రాణముగా రూపొంది పుణ్యాపాపముల ఫలముల ననుభవించు చుండును. (సుఖదుఃఖములను జీవుడనుభవించుచుండునని భావము).





*తతో నైషయికం తేషాం - సుఖం వా దుఃఖమేవ వా,*
*త ఏవ భుంజతే భోగాzz - యతనేఽస్మిన్ శరీరకే.* **32**

*స్థావరం జంగమం చేతి - ద్వివిధం వపురుచ్యతే,*
*స్థావరా స్తత్ర దేహా స్స్యు - స్సూక్ష్మ గుల్మలతాదయః.* **33**

*అండజా స్స్వేదజా స్తద్వ - దుద్భిజ్జా ఇతి జంగమాః,*

అందుచేత విషయ విశేషమునుండి పొడమిన ఆనందముగాని, వ్యథగాని, భోగమునే యభిలషించు శరీరమున ప్రాణకోటియనుభవించుచుండును. అట్టి శరీరము స్థావరమని, జంగమమని రెండు విధములు. అందు స్థావర దేహమును, వృక్షములు, పొదలు, తీగెలు - ఇవే మున్నగునవి. వీనియందు సమన్వయించుకొనునది, జంగమదేహము, అండజము, స్వేదజమనియు, ఉద్భిజ్జమనియు మూడురకాలుగా విభజింపఁబడినది.





**యోని మన్యే ప్రపద్యన్తే - శరీరత్వాయ దేహినః. 34**

**స్థాణు మన్యే ప్రపద్యన్తే - యథాకర్మ యథాశ్రుతమ్,**
**సుఖ్యహం దుఃఖ్యహం చేతి - జీవ ఏవాభిమన్యతే. 35**

**నిర్లేపోఽపి పరంజ్యోతి - ర్మోహిత శ్శంభుమాయయా,**

ప్రాణి ఆయా కర్మమునను సరించి స్థావరత్వమును, జంగమత్వమును బడయును. ఏదో ఒక శరీరమును ధరించి దానను భవించే సుఖముగాని, దుఃఖముగాని యిదేదియు తనదిగాక ఇది కేవలము ఈశ్వరమాయయని దెలియవలెను.

**కామః క్రోధ స్తథా లోభో - మదో మాత్సర్య మేవ చ. 36**

**మోహశ్చేత్యరిషడ్వర్గ - మహంకారగతం విదుః,**
**స ఏవ బధ్యతే జీవ - స్స్వప్నజాగ్రదవస్థయోః. 37**

**సుషుప్తౌ తదభావాచ్ఛ - జీవశ్శంకరతాం గతః,**
**స ఏవ మాయయా స్పృష్టః - కారణం సుఖదుఃఖయోః. 38**



***శుక్తౌ రజతవద్విశ్వం - మాయయా దృశ్యతే శివే,***
***తతో వివేకజ్ఞానేన - న కోఽప్యత్రాఽస్తి దుఃఖభాక్.*** 39

***తతో విరమ దుఃఖాత్త్వం - కిం ముధా పరితప్యసే,***

కామ-క్రోధ-లోభ-మోహ-మద-మాత్సర్యములను అరిషడ్వర్గములనఁబడును. ప్రాణి స్వప్నావస్థలో పైన బేర్కొన్నబడిన పాటికి లోబడి బందీ భూతుడగును. సుషుప్తి అవస్థలో నాకామక్రోధాదులకు లోబడని యెడల నతడే శివైక్యమును జెందును. యద్యపి అట్లు మాయకు వశీభూతుడైనచో నతడు సుఖదుఃఖములకు గారణభూతుడే యగును. శుక్తికలో రజతమువలె, పరమ శివునియందు ప్రపంచము మాయామయంబుగా గోచరించును. వివేకముతో బరిశీలించి జూచిన సుఖదుఃఖములు మృగ్యములగును. అథవా మృగతృష్టిక వంటిది. కావున ఓ రామా! సీతను గురించి యేల దుఃఖించెదవు? వృథా దుఃఖించకుము.



*మునే! సర్వమిదం సత్యం - యన్మదగ్రే త్వయేరితమ్. 40*

*తథాపి న జహాత్యేత - త్ప్రారబ్ధాదృష్ట ముల్బణమ్,*
*మత్తం కుర్యా ద్యథా మద్యం - నష్టా విద్యమపి ద్విజమ్. 41*

*తద్వ త్ప్రారబ్ధభోగోఽపి - న జహాతి వివేకినమ్,*
*తతః కిం బహునోక్తేన - ప్రారబ్ధ స్స శివస్స్మరః. 42*

*బాధతే మాం దివారాత్ర - మహంకారోఽపి తాదృశః,*
*అత్యన్తపీడితో జీవ - స్థూలదేహం విముంచతి. 43*

*తస్మా జ్జీవాప్తయే మహ్యా - ముపాయః క్రియతాం ద్విజ!*
*ఇతి శ్రీపద్మపురాణే, శివగీతాయాం ద్వితీయోఽధ్యాయః.*

శ్రీరాముడు బలుకును : ఓయీ మునిపుంగవా! మీరు నా యందలి అనుగ్రహముచేతనేమి యానతిచ్చితిరో అయ్యవి యన్నియు వాస్తవములే అయినప్పటికిన్ని, నా ప్రారబ్ధరూపంబగు





ప్రియురాలైన సీత యొక్క ఎడబాటుతో నాలో రగిలిన దుఃఖాగ్ని యుపశమింపకున్నది. ఆ కారణము వలన వేయేల? నా ప్రారబ్ధరూపుండైన శివుఁడే అలరు విల్తుని రూపంబున నన్ను రేయింబవళ్ళు వేధింపుచున్నాడు. అహంకారము గూడ అటువంటిదే. ఈ విధముగా ప్రాణి మిగుల పీడింపబడినచో నీజడదేహము వీడిపోవును. కనుక నో శివభక్తాగ్రేసరా! జీవధారణ జేయుటకు ఉపాయమేదో తెల్పుము.

ఇది వ్యాసోక్త పద్మపురాణాంతర్గతంబైన శివగీతలో ద్వితీయాధ్యాయము సమాప్తము.



# తృతీయాధ్యాయము

## విరజాదీక్షాలక్షణయోగము

*అగస్త్య ఉవాచ :*

*న గృహ్ణాతి వచః పథ్యం - కామక్రోధాదిపీడితః,*
*హితం న రోచతే తస్య - ముమూర్షోరివ భేషజమ్.* **1**

*మధ్యేసముద్రం యా నీతా - సీతా దైత్యేన మాయినా,*
*ఆయాస్యతి నరశ్రేష్ఠ! - సా కథం తవ సన్నిధిమ్!* **2**

అగస్త్యుడు పలుకుచున్నాడు :

కామక్రోధా ద్యరిషడ్వర్గంబుల కధీనుడైనవాఁడు నీతి వచనములకు బెడచెవి బెట్టును. మరణమును గోరుకున్న మనిషి మంచి మందును బుచ్చుకొనుట సమ్మతించడు. అట్లే ఓరామా! నీ ధర్మపత్నియగు సీత మాయావియైన రావణుని



చేత నపహరింపఁబడి సాగర మధ్యన ఉంచబడినది అటువంటి నీ భార్య నీ చెంతకెట్లు రాగలదు?

*బధ్యన్తే దేవతా స్సర్వా - ద్వారి మర్కటయూథవత్,*
*కిం చ చామరధారిణ్యో - యస్య సన్తి సురాంగనాః.* 3

*భుంక్తే త్రిలోకీ మఖిలాం - య శ్శంభువరదర్పితః,*
*నిష్కంటకం తస్య జయః - కథం తవ భవిష్యతి?* 4

ఎవని భవన ప్రాంగణమున వానరుల గుంపువలె దేవతలు బంధింపబడినారో, ఆ దేవతల యొక్క భార్యలు వింజామరములను చేతబూని గాలివేయుచున్నారో మరియు నెవ్వడైతే మహేశ్వర వరమును బొంది గర్వముతో స్వర్గ మర్త్య పాతాళలోకములను నిరాటంకముగా బరిపాలించుచున్నాడో, అటువంటి రావణాసురుని పరాభవింపఁజేయుట నీ తరమా?

*ఇంద్రజిన్నామ పుత్రో యః - స్తస్యాzస్తీశవరోద్ధతః,*



**తస్యాగ్రే సంగరే దేవా - బహువారం పలాయితాః. 5**

**కుంభకర్ణాహ్వయో భ్రాతా - యస్యాస్తి సురసూదనః,**
**అన్యో దివ్యాస్త్రసంయుక్త - శ్చిరంజీవీ విభీషణః 6**

మరియు (పోగా) నాతనికి యింద్రజిత్తుడనే కుమారుడున్నాడు. అతడు పరమశివుని వరముచేత మహాబలశాలియై యింతవరకు దాను పరాభవమన నెట్టిదో ఎరుగడు. అటువంటి యోధునియెదుట నిలచియుద్ధము జేయుటకు శక్తిలేక యుద్ధభూమి నుండి యనేకసార్లు దేవతలు పలాయనము జిత్తగించిరి. అదియట్లుండగా సుపర్వగర్వము నణచి వైచిన కుంభకర్ణుండు నాతనికి దోబుట్టువు. మరియు దివ్యాస్త్రములతో సంసిద్ధుడై యుండిన చిరంజీవియగు విభీషణుడు గూడ నాతనికి యనుంగు సోదరుడే.

**దుర్గం యస్యాస్తి లంకాఖ్యం దుర్జయం దేవదానవైః,**



**చతురంగబలం యస్య - వర్తతే కోటిసంఖ్యయా. 7**

**ఏకాకినా త్వయా జేయ - స్స కథం నృపనందన!**
**ఆకాంక్షతే కరే ధర్తుం - బాలశ్చంద్రమసం యథా. 8**

సురాసురులకు ప్రవేశించుట వీలులేని (శక్యముగాని)ది, యజేయమైనది లంకా పురము రాజధానిగా నాతనికి గలదు, మరియు కోట్ల సంఖ్యాక (అసంఖ్యాక) మైన గజ-తురగ-పదాతి మున్నగు చతురంగ సైన్యముగల అంతటి రావణుని నీవొక్కండవెట్లు జయింపదలచావు? నీ దలంపును విచారించినచో బాల్యావస్థలోనున్న శిశువు తన హస్తములతో నాకాశమందలి చంద్రుని గ్రహించుమాడ్కి కామమోహింతుడవైన నీవు గొప్ప బలశాలియైన రావణుని జంపజూచుచున్నావు.

**తథా త్వం కామమోహేన - జయం తస్యాఽభివాంఛసి,**
**క్షత్రియోఽహం మునిశ్రేష్ఠ! - భార్యా మే రక్షసా హృతా. 9**

*యది తం న నిహన్మ్యాశు - జీవనే మేZ స్తి కిం ఫలమ్,*
*అత స్తే తత్త్వబోధేన న - మే కించిత్ప్రయోజనమ్.* 10

శ్రీరాముడు బలుకుచున్నాడు: ఓయీ! మునికులచంద్రా! క్షత్రియ వంశజనితుండ నేను. నా సతియైన సీతాదేవి రావణుని చేత నపహరించబడినది. అందుచేత లంకాధిపతియైన రావణుని ద్రుంచి నా సీతను ఆతని చెరవిడిపింపకుండిన నేను బ్రతికి యుండుట ప్రయోజనమేమి? కాన నీవిప్పుడు నాకు బోధించు తత్త్వమునుండి యేలాంటి లాభము లేదు. కామ క్రోధ లోభ మోహము మొదలగు నరిషడ్వర్గము నా దేహమును దహింపజేయుచున్నది. అహంకారమనునది నన్ను ఎల్లప్పుడు నా ప్రాణముల నపహరింపజేయుటకు నుద్యుక్తమైయున్నది.

*కామక్రోధాదయ స్సర్వే - దహంతే తే తనుం మమ,*
*అహంకారోఽపి మే నిత్యం - జీవనం హర్తుముద్యతః.* 11

హృతాయాం నిజకాన్తాయాం - శత్రుణా మమ తస్య వా,
యస్య తత్త్వబుభుత్సా స్యా - త్స లోకే పురుషాధమః. 12

తస్మా త్తస్య వధోపాయం - లంఘయిత్వాఽంబుధిం రణే,
బ్రూహి మే మునిశార్దూల! - త్వత్తో నాఽన్యోఽస్తి మే గురుః. 13

నా ప్రియమైన భార్య అపహరింపఁ బడుచుండగా శత్రువు చేత నవమానించబడిన వాడికి తత్త్వజిజ్ఞాస గలుగునో వాడు జగత్తునందు బురుషాధము డనబడును. అందుచేత సాగరమును లంఘించి నాకు శత్రువైన రావణుని బరిమార్చుటకు దగిన మార్గము నాలోచించి యానతిమ్ము. నీవు దక్క నాకు వేరే గురువు లేడని రాముడు బలికెను.

ఏవం చే చ్ఛరణం యాహి - పార్వతీపతిమవ్యయమ్,
స చే త్ప్రసన్నో భగవా - న్వాంఛితార్థం ప్రయచ్ఛతి. 14

దేవై రజేయ శ్శక్రాద్యై - ర్హరిణా బ్రహ్మణాఽపి వా,



*న తే వధ్యః కథం వా స్యా - చ్ఛంకరాఽనుగ్రహం వినా? 15*

అగస్త్యుడు చెప్పుచున్నాడు: అలా ఐతే మృత్యువు లేని మృత్యుంజయుడైన పరమ శివుని యాశ్రయించుము. ఆ పరశివమూర్తి ప్రసన్నుడయ్యేనేని నీయభీప్సితములను దీర్చుట కాతడొకడే సమర్థుడు. లంకాధిపతియగు రావణాసురుడు ఇంద్రాది దేవతలకు బ్రహ్మవిష్ణువులకును జయింపరానివాడు నీయందు నా పరమ శివుని యనుగ్రహమే లేనియెడల ఆతనిని నీవు జయించలేవు; సీతను బొందుట గూడ నీకు సాధ్యపడదు.

*అత స్త్వాం దీక్షయిష్యామి - విరజాగమ మాశ్రితః,*
*తేన మార్గేణ మర్త్యత్వం - హిత్వా తేజోమయో భవ. 16*

*యేన హత్వా రణే శత్రూ - న్సర్వాన్కామా నవాప్స్యసి,*
*అథ ప్రణమ్య రామ స్తం - దండవ న్మునిసత్తమమ్. 17*

*ఉవాచ దుఃఖనిర్ముక్తః - ప్రహృష్టేనాఽంతరాత్మనా.*





ఆ కారణముచేత శివునికి ప్రీతిదాయంబైన విరజాదీక్షను నీకు నొసంగెదను. ఆ పద్ధతి నాచరించి నీవు మానుషత్వమును వీడి తేజోమూర్తి వగుదువు. ఆ మార్గము శత్రుసంహారము జేయు కోరికను దీర్చును. (సూతుడు జెప్పుచున్నాడు.) ఆ మీదట శ్రీరాముడు నా అగస్త్య మహారుషికి దీర్ఘదండ నమస్కారము గావించి, దుఃఖమును వీడి సంతసించినవాడై యిట్లు పలికెను. (శ్రీరాముడు జెప్పును)

***కృతార్థోఽహం మునే! జాతో - వాంఛితార్థో మమాగతః. 18***

***పీతాంబుధిః ప్రసన్నస్త్వం - యది మే కిము దుర్లభమ్?***

***అత స్త్వం విరజాదీక్షాం - బ్రూహి మే మునిసత్తమ! 19***

ఓయీ అగస్త్య మహారుషీ! నేను నీ యనుగ్రహము వలన ధన్యుడనైతి, ఇఁకమీదట నాయభిలాష నెరవేరినట్లున్నది. సముద్రమున అరచేతన్గొని యాపోశనంబొనర్చిన మీరు నన్నునుగ్రహింపుచుండగా నేనెట్లు సఫల మనోరథుడనుగాను?



అందుచేత నన్ను అతిశీఘ్రముగా ననుగ్రహింపుము.

**అగస్త్య ఉవాచ:-**

**శుక్లపక్షే చతుర్దశ్యా - మష్టమ్యాం వా విశేషతః,**
**ఏకాదశ్యాం సోమవారే - ఆర్ద్రాయాం వా సమారభేత్. 20**

అగస్త్యుడు నుడువుచున్నాడు:-

శుక్లపక్షము చతుర్దశియందుగాని, లేదా అష్టమియందునుగాని, అథవా ఏకాదశియందుగాని లేక ఆర్ద్రానక్షత్రయుక్త సోమవారమందుగాని యీ పాశుపత వ్రతమును ప్రారంభించవలెను.

**యం వామ మాహూర్యం రుద్రం - శాశ్వతం పరమేశ్వరమ్,**
**పరాత్పరం పరం బాహుం - పరాత్పరతరం శివమ్. 21**

**బ్రహ్మణం జనకం విష్ణోర్వహ్నే - ర్వాయో స్సదాశివమ్,**
**ధ్యాత్వాzగ్నినాzవసథ్యాగ్నిం - విశోధ్య చ పృథక్పృథక్. 22**



*పంచభూతాని సంయమ్య - దగ్ధ్వా గుణవిధిక్రమాత్,*
*మాత్రాః పంచ చతస్రశ్చ - త్రిమాత్రా ద్వి స్తతః పరమ్. 23*

*ఏకమాత్ర మమాత్రం చ - ద్వాదశాంతవ్యవస్థితమ్,*
*స్థిత్యాం స్థాప్యామృతో భూత్వా- వ్రతం పాశుపతం చరేత్.24*

ఏ దేవుడిని రుద్రునిగాను, పరమేశ్వరునిగాను, పరాత్పరునిగాను, శివునిగాను, విష్ణ్వగ్ని వాయువులకు- జన్మనొసంగిన వానిని గాను ఏ పెద్దలు వాకొనుచున్నారో అటువంటి భగవంతుని మొట్టమొదట ధ్యానించి, వహ్నిని బూజించి పంచభూతంబులను నియమించి పంచచతుస్త్రిద్వ్యేక (ఐదు-నాలుగు-మూడు-రెండు-ఒండు) మాత్రల చేతనైనగాని, అమాత్రగనైన గాని, ద్వాదశాంతస్థితుండై యమృతుండై యీ పాశుపతవ్రతము ననుష్ఠింపవలెను.

*ఇదం వ్రతం పాశుపతం - వదిష్యామి సమాసతః,*





ప్రాతరేవ తు సంకల్ప్య - నిధాయాఽగ్నిం స్వశాఖయా. 25

ఉపోషిత శ్శుచిస్స్నాత - శ్శుక్లాంబరధరస్స్వయమ్,
శుక్లయజ్ఞోపవీతశ్చ - శుక్లఽమాల్యానులేపనః. 26

జుహుయా ద్విరజోమన్త్రైః - ప్రాణాపానాధిభిస్తతః,
అనువాకాఽంతమేకాగ్ర - సమిదాజ్యచరూ న్పృథక్. 27

ఇట్టి పాశుపతవ్రత విధానమును వివరింతును వినుమని జెప్పఁదొడంగెను. ప్రాతఃకాలమున నీవిధంబుగా సంకల్పించి నిరాహారంబుండి స్నానంబాచరించి శుచియై పరిశుభ్ర వస్త్రములను దాల్చి స్వశాఖోక్త ప్రకారంబుగా నర్పించి తెల్లని బ్రహ్మసూత్రములను, శ్రీగంధమును, పూలహారములను దాల్చి విరజామంత్రంబులను బ్రాణా పానంబుల హోమంబాచరించి "యాతె అగ్నే..... రితి" అనుమంత్రములతో నగ్నిని దనయందారోపించుకొని "భస్మాదాయాగ్ని..."అను





మంత్రముతో భస్మమును కురంగముద్రతో స్వీకరించి దన శరీరమంతటను త్రిపుండ్రరేఖలుగా ధరించవలెను. అట్లు భస్మమును ధరించుకొన్నవాఁడు మహాపాపములనుండి విముక్తుడగును. ఇందేమాత్రము సందేహములేదు.

*ఆత్మన్యగ్నిం సమారోప్య - 'యాతే అగ్నేతి' మంత్రతః,*
*భస్మాదాయాగ్నిరిత్యాద్యై - ర్విమృజ్యాంగాని సంస్పృశేత్.* **28**

*భస్మచ్ఛన్నో ద్విజో విద్వ - మహాపాతకసంభవైః,*
*పాపై ర్విముచ్యతే నిత్యం - ముచ్యతే న చ సంశయః.* **29**

*అగ్నివీర్యం యతో భస్మ - వీర్యవాన్భస్మసంయుతః,*
*భస్మస్నానరతో విప్రో భస్మ - శాయీ జితేంద్రియః.* **30**

*సర్వపాపవినిర్ముక్తః - శివసాయుజ్య మాప్నుయాత్,*
*ఏవం కురు మహారాజ - శివనామసహస్రకమ్.* **31**





**ఇదం తు సంప్రదాస్యామి - తేన సర్వ మవాప్స్యసి,**
***ఇత్యుక్త్వా ప్రదదౌ తస్మై - శివనామసహస్రకమ్.*** ***32***

ఈ విభూతివహ్నివీర్యమగుటచేత సదా ఏ ద్విజ్ఞుడు ఇంద్రియ సంయమనముగలవాడై భస్మస్నానాసక్తియందుండి, యా భస్మములోనే పరుండి భస్మమును వీడియుండడో అట్టివాఁడు సమస్త పాపములనుండి విముక్తుడై శివసాయుజ్యమును బొందును. ఓయీ మహారాజా! రామచంద్రా! నీవీ ప్రకారముగా ననుష్ఠించుము. శివ సహస్రనామములను నీకు బోధింతును. దీని ప్రభావమువలన నీవు సమస్త కోరికలను బొందగలవు. ఈ విధముగ నా అగస్త్య మహామునీంద్రు డుద్బోధించి శివ ప్రత్యక్షదాయకమగు వేద సారాంశ శివసహస్ర నామములను శ్రీరామునకు బోధించిన వాడయ్యెను.

***వేదసారాభిధం నిత్యం - శివప్రత్యక్షకారకమ్,***



*ఉక్తం చ తేన రామ! త్వం - జప నిత్యం దివానిశమ్.* 33

*తతః ప్రసన్నో భగవా - న్మహాపాశుపతాస్త్రకమ్,*
*తుభ్యం దాస్యతి తేన త్వం - శత్రూ న్హత్వాఽఽప్స్యసి ప్రియమ్.*34

*తస్యైవాఽస్త్రస్య మాహాత్మ్యా - త్సముద్రం శోషయిష్యసి,*
*సంహారకాలే జగతా - మస్త్రం త త్పార్వతీపతేః.* 35

*తదలాభే దానవానాం - జయ స్తవ సుదుర్లభః,*
*తస్మా ల్లబ్ధుం తదేవాస్త్రం - శరణం యాహి శంకరమ్,* 36

ఇతి శ్రీపద్మపురాణే శివగీతాయాం తృతీయోఽధ్యాయః.

మరియు నామునివరుండిట్లు జెప్పఁదొడగెను: ఓరామా! నీవు నా చేత బోధింపఁబడిన వేదసార శివసహస్రనామంబులను అనన్యభక్తితో నిశ్చల మనస్సుతో రేయింబవళ్ళు బఠించుము. దానితో (తత్ఫలితముగ) శివుఁడు బ్రసన్నుడై బ్రత్యక్షమై నీకు బాశుపతాస్త్రమును బ్రసాదించును.



నీవా యస్త్రమువలన శత్రువులను హతమొనర్చి నీ ప్రీతికి బాత్రురాలైన భార్యను బడయగలవు. ఆ మహాస్త్రము బలము చేతనే విశాలము మరియు గంభీరమునైన సాగరమును గూడ శుష్కింపజేయగలవు. ప్రళయ కాలములో నే మహాస్త్రము పరమ శివునకు (పార్వతీపతికి) ప్రధానమైనదిగా నున్నదో అటువంటి మహాస్త్రము నీకు లభ్యముగానిచో నీవు రాక్షసులను జయింపలేవు. ఆ కారణముచేత ఆ మహిమాన్వితాస్త్ర ప్రాప్తికై నీవనన్యభక్తితో నీశ్వరుని శరణు బొందుము.

ఇది వ్యాసోక్త శ్రీపద్మపురాణాంతర్గతంబైన శివగీతయందలి

మూడవ అధ్యాయము సమాప్తము.



# చతుర్థాధ్యాయము

## శివప్రాదుర్భావము

*శ్రీ మాత ఉవాచ:-*

*ఏవముక్త్వా మునిశ్రేష్ఠే - గతే తస్మి న్నిజాశ్రమమ్,*
*అథ రామగిరౌ రామః - పుణ్యే గోదావరీతటే.* **1**

*శివలింగం ప్రతిష్ఠాప్య - కృత్వా దీక్షాం యథావిధి,*
*భూతిభూషితసర్వాంగో - రుద్రాక్షాభరణై ర్యుతః.* **2**

*అభిషిచ్య జలైః పూర్ణై - ర్గౌతమీసింధుసంభవైః,*
*అర్చయిత్వా వన్యపుష్పై - స్తద్వ ద్వన్యఫలైరపి.* **3**

*భస్మచ్ఛన్నో భస్మశాయీ - వ్యాఘ్రచర్మాసనే స్థితః,*
*నామ్నాం సహస్రం ప్రజప - న్నక్తందివ మనన్యధీః.* **4**



మాసమేకం ఫలాహారో - మాసం పర్ణాశనస్తతః,
మాసమేకం జలాహారో - మాసం చ పవనాశనః. 5

శాంతో దాంతః ప్రసన్నాత్మా - ధ్యాయన్నేవం మహేశ్వరమ్.
హృత్పంకజే సమాసీన - ముమాదేహార్ధధారిణమ్. 6

చతుర్భుజం త్రిణయనం - విద్యుత్పింగజటాధరమ్,
కోటిసూర్యప్రతీకాశం - చంద్రకోటిసుశీతలమ్. 7

సర్వాభరణసంయుక్తం - నాగయజ్ఞోపవీతినమ్,
వ్యాఘ్రచర్మాంబరధరం - వరదాభయధారిణమ్. 8

వ్యాఘ్రచర్మోత్తరీయం చ - సురాసురనమస్కృతమ్,
పంచవక్త్రం చంద్రమౌళిం - త్రిశూలడమరూధరమ్. 9

నిత్యం చ శాశ్వతం శుద్ధం - ధ్రువమక్షరమవ్యయమ్,
ఏవం నిత్యం ప్రజపతో - గతం మాసచతుష్టయమ్. 10



సూతుడు శౌనకాదులకు జెప్పెను: ఈ ప్రకారముగా నగస్త్య మహారుషి శ్రీరాముని కుపదేశించి తన ఆశ్రమమునకు దరలిపోగా నిక్కడ శ్రీరామ చంద్రుడు పునీతంబైన గోదావరీ నదీ తటంబున నున్న రామగిరిలో శివలింగమును స్థాపించి శాస్త్రోక్తముగా దీక్షను స్వీకరించిన వాడై సర్వాంగములకు భస్మమును త్రిరేఖలతో నలంకరించుకొని శివలింగమును ఆరణ్య పత్రి పుష్పాదులతో బూచించి పులి చర్మాసనముపై యాసీనుఁడై రాత్రింబవళ్ళు అనన్య మనస్సుగలవాఁడై వేదసారశివసహస్ర నామములను బఠిస్తు ఒక మాసము ఫలములచేత, మరో మాసము పత్రములచేతను, మరోమాసము జలముచేతను, ఆపై మాసము గాలి వాయువునే యాహారముగా మార్చుకొని శాంతి, కాంతి, మున్నగు సద్గుణము లవరచుకొని స్వచ్ఛమైన మనస్సుతోడ హృద్గతపరాత్పరుని, అర్ధనారీశ్వరుని, నాలుగు చేతులు గల ముక్కంటిని, ఎరుపు మెరుపులవలెనున్న,



జటాజూటముల దాల్చినట్టి కోటి సూర్యప్రకాశముగలవాడు, కోటి చంద్రసుశీతలుండు, సమస్తాభరణాలంకృతుండును, నాగయజ్ఞోపవీతధారియు, పులిచర్మోత్తరీయముగా దాల్చినవాఁడు, వరదాభయహస్తముగలవాఁడు. సమస్త దేవదానవా(సురాసురా)దుల చేత నమస్కరించు కొనఁదగినవాడు. పంచముఖములును, ఉడురాజశేఖరుఁడును, డమరుక త్రిశూలధారియు, శాశ్వతుఁడు పరిశుద్ధుడును, అవ్యయుఁడగు మాహేశ్వరుని ధ్యానిస్తు చతుర్మాసములను గడిపెను.

*అథ జాతో మహానాదః ప్రళయాంబుధిభీషణః.*
*సముద్రమథనోద్భూతమంద రావనిభృద్ధ్వనిః.* **11**

*రుద్రబాణాగ్ని సందీప్త భృశత్త్రిపురవిభ్రమః,*
*తమాకర్ణ్యాథ సంభ్రాంతో యావత్పశ్యతి పుష్కరమ్.* **12**





తరువాత నొకదినమున ప్రళయకాలపు మహాసముద్రపు సవ్వడివలె మరియు సాగర మథన సమయంబున బొడమిన మందర పర్వతస్వనమువలె, మరియు త్రిపురసంహార కాలమున రుద్రబాణాగ్ని ధ్వనింబోలిన అతిభీషణంబైన ధ్వని వినఁబడగా భయభ్రాంతితో ఎదుట వీక్షింపగా,

**తావదేవ మహాతేజో రామస్యాసీత్పురో ద్విజాః,**
**తేజసా తేన సంభ్రాంతో నాపశ్యత్స దిశో దశ. 13**

**అంధీకృతేక్షణ స్తూర్ణం మోహం యాతో నృపాత్మజః,**
**వివింత్య తర్కయామాస దైత్యమాయాం ద్విజేశ్వరాః. 14**

ఒక మహాతేజస్సు గోచరించెను. అది జూచి సంభ్రాంత మనస్సుచేత శ్రీరాముఁడు దశదిశల గలయజూచెను. అట్టిమహాతేజశ్శక్తి ప్రభావమున దృష్టిగానరానివాడై ఒక్కత్రుటి కాలము మిగుల మోహముగలవాఁడై మొదట దానవుల మాయగా దలచెను.





*అథోత్థాయ మహావీర - స్సజ్యం కృత్వా ధను స్స్వకమ్,*
*ఆవిధ్య న్నిశితై ర్బాణై - ర్దివ్యాస్త్రై రభిమంత్రితైః.* **15**

*ఆగ్నేయం వారుణం సౌమ్యం - మోహనం సౌరపార్వతమ్,*
*విష్ణుచక్రం మహాచక్రం - కాలచక్రం చ వైష్ణవమ్.* **16**

పిదప లేచి తన కోదండమును బాణములతో సంధింపజేసి ఆగ్నేయము-వారుణము-మోహన-పాశుపత సౌమ్యం విష్ణుచక్రం, మహాచక్రం-కాలచక్రం-వైష్ణవమ్-రౌద్రం-బ్రాహ్మం-కౌబేరం- కులిశం-అనిలం-భార్గవం మున్నగు ననేకాస్త్రముల నభిమంత్రించి రాముడు ప్రయోగించెను.

*రౌద్రం పాశుపతం బ్రాహ్మం - కౌబేరం కులిశానిలమ్,*
*భార్గవాదిబహూన్యస్త్రా - ణ్యయం ప్రాయుజ్య రాఘవః.* **17**

*తస్మింస్తేజసి శస్త్రాణి - చాஉస్త్రాణ్యస్య మహీపతేః,*
*విలీనాని మహాభ్రస్య - కరకా ఇవ నీరధౌ.* **18**





*తతః క్షణేన జజ్వాల - ధను స్తస్య కరా చ్చ్యుతమ్,*
*తూణీరం చాంగుళీత్రాణం - గోధికాపి మహీపతేః.* **19**

శ్రీరాముడు వదలిన మహాస్త్రములన్ని ఆ గొప్ప తేజస్సులో మహాసముద్రమనబడిన వడగండ్ల మాదిరి కరిగిపోయినట్లుగా లీనములైన ఆమీదట తృటి కాలములో శ్రీరామచంద్రుని ధనుస్సుగూడ జారి(కింద నేలపై) బడి భస్మమైనది (బూడిద) మరియు అమ్ములపొదియు, హస్తకవచము, గోధికయు నేలపైఁబడి దగ్ధమైనవి.

*త ద్దృష్ట్వా లక్ష్మణో భీతః - పపాత భువి మూర్ఛితః.*
*అథాఽఽకించిత్కరో రామో -జానుభ్యా మవనిం గతః.* **20**

*మీలితాక్షో భయావిష్ట - శ్శంకరం శరణం గతః,*
*స్వరేణాఽప్యుచ్చరన్స్ల చ్చై - శ్శంభో ర్నామసహస్రకమ్.* **21**

*శివం చ దండవ ద్భూమౌ - ప్రణనామ పునఃపునః,*





*పునశ్చ పూర్వవచ్చాసీ - చ్ఛబ్దో దిఙ్మండలం స్వనన్.* **22**

*చచాల వసుధా ఘోరం - పర్వతాశ్చ చ కంపిరే,*
*అథ క్షణేన శీతాంశు - శ్శీతలం తేజ ఆదధత్.* **23**

*ఉన్మీలితాక్షో రామస్తు - యావద్యావత్ప్రపశ్యతి,*
*తావద్దదర్శ వృషభం - సర్వాలంకారసంయుతమ్.* **24**

*పీయూషమథనోద్భూత - నవనీతస్య పిండవత్,*
*ప్రోతస్వర్ణం మరకత - చ్ఛాయాశృంగద్వయాంచితమ్.* **25**

*నీలరత్నేక్షణం హ్రస్వ - కంఠకంబలభూషితమ్,*
*రత్నపల్యాణసంయుక్తం - నిబద్ధం శ్వేతచామరైః.* **26**

అదిగాంచి సౌమిత్రి లక్ష్మణుడు భయపడి నేలబడి మూర్ఛిల్లెను. తరువాత శ్రీరాముఁడు దిగ్భ్రాంతుడై యేమియు దోచక భూమిపై మోకాళ్ళూని (మోకరిల్లి) భయకంపితుడై గనులు మూసికొని, యుమాపతే నన్ను గాపాడువాఁడని యెంచి



గొంతెత్తి గట్టిగా వేదసారశివసహస్ర నామములను బఠించుచు ముమ్మాటికి దీర్ఘదండ నమస్కారములనసల్పెను. ఇంతలోనే మొదటి మాదిరిగా దిక్కులు మారుమ్రోగ మహాధ్వని గలిగెను. ఆ ధ్వనికి భూమి మరియు పర్వతములు గూడ కదలినవి. మరల త్రుటికాలములోనే చంద్రుని శీతలము తేజస్సు అగుపడెను. శ్రీరాముడు తేరుకొని జూచులోపున, పాలసముద్రమును జిలుకు (తరచు) చుండగా అందుండి యుద్భవించిన వెన్నముద్ద మాదిరి తెల్లగాను, బంగారు వన్నెగల తోక గలది, మరకతమణుల ననుకరించు కొమ్ములు గలది. ఇంద్ర నీలము-మణుల కన్నులు గలది,. కురుచ కంఠమున కంబలము గలది. రత్నమయమగు త్రాడు గలది, తెల్లని వింజామరములు గలది, గంటారావములతో దశదిశలను బూరించువదియగు నందీశ్వరుని జూచెను.

**ఘంటికాఘర్ఘరీశబ్దై : - పూరయంతం దిశో దశ,**



*తత్రాఽఽసీనం మహాదేవం - శుద్ధస్ఫటికవిగ్రహమ్,* **27**

*కోటిసూర్యప్రతీకాశం - కోటిశీతాంశుశీతలమ్,*
*వ్యాఘ్రచర్మాంబరధరం - నాగయజ్ఞోపవీతినమ్.* **28**

*సర్వాలంకారసంయుక్తం - విద్యుత్పింగజటాధరమ్,*
*నీలకంఠం వ్యాఘ్రచర్మో - త్తరీయం చంద్రశేఖరమ్.* **29**

*నానావిధాయుధోద్భాసి - దశబాహుం త్రిలోచనమ్,*
*యువానం పురుషశ్రేష్ఠం - సచ్చిదానందవిగ్రహమ్.* **30**

మరియు నా నందీశ్వరునధిరోహించిన స్వచ్ఛమగు స్ఫటికమణిని బోలు శుభ్రమగు వర్ణముగలిగి కోటిసూర్య ప్రకాశముగలవాడు కోటిచంద్రులబోలు శీతలత్వము గలవాడు, పులిచర్మమును ధరించినవాడు నాగయజ్ఞోపవీతమును దాల్చినవాడు, సమస్తాలంకారయుతుండును, విద్యుద్వల్లింబోలు ప్రకాశయుతుఁడు, గరళకంఠుడు, ఉడురాజశేఖరుఁడును



దశహస్తములతో సమస్తాయుధంబులను ధరించినవాడును, ముక్కంటియు యౌవ్వనవంతుడు, సచ్చిదానందస్వరూపుడు, పురుషశ్రేష్ఠుడు నగు పరమశివుని సందర్శించెను.

*తత్రైవ చ సుఖాసీనాం - పూర్ణ చంద్రనిభాననామ్,*
*నీలేందీవరదామాభా - ముద్యన్మరకతప్రభామ్.* **31**

*ముక్తాభరణసంయుక్తాం - రాత్రిం తారాచితామివ,*
*వింధ్యక్షితిధరోత్తుంగ - కుచభారభరాలసామ్.* **32**

*సదసత్సంశయావిష్ట - మధ్యదేశాంతరాం వరామ్,*
*దివ్యాభరణసంయుక్తాం - దివ్యగంధానులేపనామ్.* **33**

*దివ్యమాల్యాంబరధరాం - నీలేందీవరలోచనామ్,*
*అలకోద్భాసివదనాం - తాంబూలగ్రాసశోభితామ్.* **34**

*శివాలింగనసంజాత - పులకోద్భాసివిగ్రహామ్,*
*సచ్చిదానందరూపాఢ్యాం - జగన్మాతరమంబికామ్.* **35**



*సౌందర్యసారసందోహం - దదర్శ రఘునందనః,*
*స్వస్వవాహనసంబద్ధా - న్నానాయుధలసత్కరాన్.* *36*
*బృహద్రథంతరాదీని - సామాని పరిగాయతః,*

మరియు నక్కడే ఆనందముతో సుఖాసీనురాలై పూర్ణచంద్రునివలె ముఖబింబముగల నీలేందీవరమాలిక పగిదిగల, మరకతమణికాంతిని విరజిమ్ముచున్నది, ఆణిముత్యాల సరసములను దాల్చినదియగుటచే కాంతియుత నక్షత్రయుక్తమై విరాజిల్లురేయివలె నొప్పుచున్నదినగు కుంభస్తనములు గలది, సన్నని నడుముగలదియు, అమూల్య రత్నాలంకారములతో నొప్పునదియు, సుగంధపూమాలికలను దివ్య వస్త్రములను దాల్చినదియు నల్లవ పువ్వులవలెనున్న గన్నులు గలది. విడెముతోగూడినదియు, పతిదేవుని యాలింగనములతో పులకాంకితదేహము గలదియు, సచ్చిదానంద శరీరము గలదియు నిఖిల జగన్మాతయగు పార్వతినిఁ గాంచెను.





*వృష్యకాంతాపమాయుక్తా - న్దిక్పాలాన్పరితస్థితాన్.* **37**

*అగ్రగం గరుడారూఢం - శంఖచక్రగదాధరమ్,*
*కాలాంబుదప్రతీకాశం - విద్యుత్కాంతశ్రితాయుతమ్.* **38**

తరువాత, తమ తమ వాహనారూఢులై సమస్తాయుధములను ధరించి, తమ తమ భార్యాసమేతులై నలువైపులఁబూరించు బృహద్రథంతరాది సామగానము జేయుచున్న దిక్పాలకులను సందర్శించెను. మరియు పరమశివుని యెదుట శంఖ చక్ర గదా ఖడ్గములను దాల్చి నీలి మేఘము కాంతినొప్పుచున్న దేహము గలవాడై మెరుపు తీగను బోలిన శ్రీదేవితో గూడి గరుడవాహనము నధిష్ఠించి యనన్యభక్తితో రుద్రాధ్యాయమును బఠించుచున్న విష్ణువును గాంచెను.

*జపంతమేకమనసా - రుద్రాధ్యాయం జనార్దనమ్,*





***పశ్చా చ్చతుర్ముఖం దేవం - బ్రహ్మాణం హంసవాహనమ్.39***

***చతుర్వక్త్రై శ్చతుర్వేద - రుద్రసూక్తై ర్మహేశ్వరమ్,***
***స్తువంతం భారతీయుక్తం - దీర్ఘకూర్చజటాధరమ్. 40***

పిమ్మట పరమశివుని వెనుక భాగమున హంస వాహనము నధిరోహించి, దనసతియగు వాగ్దేవితోను, నాలుగు ముఖములతో నాలుగు వేదములలోని రుద్రసూక్తములతో నీశ్వరుని స్తుతించు బ్రహ్మను జూచెను.

***అథర్వశిరసా దేవం - స్తువంతం మునిమండలమ్,***
***గంగాదితటినీయుక్త - మంబుధిం నీలవిగ్రహమ్. 41***

***శ్వేతాశ్వతరమన్త్రేణ - స్తువంతం గిరిజాపతిమ్,***
***అనంతాదిమహానాగా - న్కైలాసగిరిసన్నిభాన్. 42***

***కైవల్యోపనిషత్పాఠా - న్మణిరత్న విభూషితాన్.***
***సువర్ణవేత్రహస్తాఢ్యం - నందినం పురత స్థితమ్. 43***





అధర్వ శిరస్సులతో శివుని స్తోత్రము గావించు మునులను గంగానది సమేతుడునగు, నీలదేహముగల వాడై శ్వేతాశ్వతర మంత్రములతో ఉమాకాంతుని స్తుతించుచున్న సాగరుని జూచెను. కైలాసపర్వతమువలె ఉన్నతములైనవి మణిరత్నాద్యలంకారములతో నొప్పుచున్నవియునై గైవల్యోపనిషత్తులను బఠించుచు శ్రీమహాదేవుని స్తోత్రము జేయుచున్న అనంతాది గొప్ప యేనుగులను జూచెను. మరియు స్వర్ణమయదండమును జేతబూని యగ్రభాగంబున నిలిచియున్న నందీశ్వరునిగూడ జూచెను.

**దక్షిణే మూషకారూఢం - గణేశం పర్వతోపమమ్,**
**మయూరవాహనారూఢ - ముత్తరే షణ్ముఖం తథా. 44**

**మహాకాలం చ చండీశం - పార్శ్వయోర్భీషణాకృతిమ్,**
**కాలాగ్నిరుద్రం దూరస్థం - జ్వలద్దావాగ్నిసన్నిభమ్. 45**





*త్రిపాదం కుటిలాకారం - నటద్భృంగిరిటిం పురః,*
*నానావికారవదనా - న్కోటిశః ప్రమథాధిపాన్.* **46**

దక్షిణపు దిక్కున పర్వతోపమానంబైన మూషిక వాహనారూఢుండైన విఘ్నేశ్వరుని, ఉత్తరపు దిక్కున మయూర వాహనారూఢుండైన షణ్ముఖస్వామిని, ఇరు పార్శ్వముల యందు భీషణాకారములుగల మహాకాలుని, చండీశ్వరుని, మరియు బడబాగ్నివలె దూరమున నున్న కాలాగ్ని రుద్రుని, అగ్రభాగమున మూడు పాదములు గలిగి వంకలు దిరిగిన యాకృతి గలిగి నాట్యము జేయుచున్న భృంగీశ్వరుని నానాప్రకారములైన ముఖములు గల అసంఖ్యాక ప్రమథగణాదిపతులను జూచెను.

*నానావాహనసంయుక్తం - పరితో మాతృమండలమ్,*
*పంచాక్షరీజపాసక్తాన్ - సిద్ధవిద్యాధరాదికాన్.* **47**



దివ్యరుద్రకగీతాని - గాయత్కిన్నరబృందకమ్,
తత్ర త్రైయంబకం మంత్రం - జపద్ద్విజకదంబకమ్. 48

గాయంతం వీణయా గీతం - నృత్యంతం నారదం దివి,
నృత్యతో నాట్యనృత్యేన - రంభాదీనప్సరోగణాన్. 49

గాయచ్చిత్రరథాదీనాం - గంధర్వాణాం కదంబకమ్,
కంబళాశ్వతరౌ శంభు - కర్ణకుండలతాం గతౌ. 50

గాయంతౌ పన్నగౌ గీతం - కపాలం కంబలం తథా,
ఏవం దేవసభాం దృష్ట్వా - కృతార్థో రఘునందనః. 51

హర్షగద్గదయా వాచా - స్తువ న్దేవం మహేశ్వరమ్,
దివ్యనామసహస్రేణ - ప్రణనామ పునఃపునః. 52

ఇతి శ్రీ పద్మపురాణే శివగీతాయాం చతుర్థోऽధ్యాయః.

సర్వత్ర వాహనములతోడ నున్న మాత్ప

సమూహమును పంచాక్షరీమహామంత్రమును బఠించు సిద్ధవిద్యాధరాదులను, రుద్రగీతాలనుఁ గానముజేయుచున్న కిన్నరులను త్ర్యంబకాది మంత్రములను బఠించు ద్విజాతి సమూహమును, నృత్యముజేయుచున్న రంభాదులను వీణలు మీటుతు గీతముల నాలపించు ఆకాశములో నాట్యము చేయుచున్న నారదుని జూచెను. సంగీతమునాలపించుచున్న చిత్రరథాది గంధర్వులను, శివునకు గర్ణాలంకారములైన కంబళాశ్వతరులను శివగీతలను గానంజేయు కపాల కంబలులను మహానాగములను, ఇట్లే అచట నున్న దేవ సభనుగాంచి శ్రీరాముడు కృతార్థుడై పెల్లుబికిన సంతోషముతోడ గద్గదస్వరముతో వేదసార సహస్రనామముల నుచ్చరించుచు మహాదేవుని స్తోత్రము చేయుచు మాటిమాటికి బ్రణామంబుల గావించెను.

ఇది వ్యాసోక్త పద్మపురాణాంతర్గతంబైన
శివగీతలో నాలుగవ అధ్యాయము
పరిసమాప్తము.



# పంచమాధ్యాయము

## రాముని యస్త్రప్రాప్తి

సూత ఉవాచ:-

అథ ప్రాదురభూ త్తత్ర - హిరణ్మయరథో మహాన్,
అనేకదివ్యరత్నాంశు - కిమ్మీరితదిగంతర:. 1

నద్యుపాంతికసంకాద్య - మహాచక్రచతుష్టయ:,
ముక్తాతోరణసంయుక్త - శ్వేతచ్ఛత్రశతావృత:. 2

శుద్ధ హేమఖురైరాఢ్య - తురంగగణసంయుత:,
ముక్తావితానవిలస - దూర్ధ్వదివ్యవృషధ్వజ:. 3

మత్తవారణకాయుక్త: - పంచతల్పోపశోభిత:,
పారిజాతతరూద్భూత - పుష్పమాలాభిరంజిత:. 4





మృగనాభీసముద్భూత - కస్తూరీమదపంకిలః,
కర్పూరాగరుధూపోత్థ - గంధాzzకృష్టమధువ్రతః. 5

సంవర్తఘనఘోషాఢ్యో - నానావాద్యసమన్వితః,
వీణా వేణుస్వనాసక్త - కిన్నరీగణసంకులః. 6

సూతుడు చెప్పుచున్నాడు :

పిదప శ్రీరాముని ముందట అతిశయించు రత్నముల కాంతులతో నలువంకల ప్రకాశింప జేయు చతుశ్చక్రంబు లున్నది, ముత్యాల తోరణములు, అసంఖ్యాకము లైన ఛత్రములు గలది. స్వచ్ఛమైన స్వర్ణమయంబైన గిట్టలు గల యశ్వరాజములతోడ, నంది ధ్వజముతోను, మదగజములు, పంచతత్వములు, పారిజాత పుష్పమాలలతోను అగురు, కస్తూరి, జవాది, ఇత్యాది సుగంధ వస్తువులు గలది. ప్రళకాలములో గర్జించుమేఘ ధ్వనివలె నిఖిల వాయిద్యములతోడను, కిన్నరులు, కింపురుషులతో నిండినదియు నగు దేదీప్యమానమగు రథము గనపడెను.





ఏవం కృత్వా రథశ్రేష్ఠం - వృషాదుత్తీర్య శంకరః,
అంబయా సహిత స్తత్ర - సటతల్పే వివేశత్తదా. 7

సురనీరజనేత్రాణాం - శ్వేతచామరచాలనైః,
దివ్యవ్యజనవాతైశ్చ - ప్రహృష్టో నీలలోహితః. 8

శంకరుడీలాంటి రథమును గల్పించి ఉమాసహితుడై నంది వాహనమునుండి దిగి యా రథము నందలి వీలుశయ్యను ప్రవేశించెను. దేవతాస్త్రీలు వీచే వింజామరములకు, సుఖముగా వీచెడు వాయువునకును బార్వతీపతి యానందించిన వాడయ్యెను.

క్వణత్కంకణనిర్ధ్వానై - ర్మంజుమంజీరశింజితైః,
వీణావేణుస్వనై ర్గీతైః - పూర్ణ మాసీ జ్జగత్త్రయమ్. 9

శుకవాక్యకలారావై - శ్వేతపారావతస్వనైః,
ఉన్నిద్రభూషఫణినాం - దర్శనాదేవ బర్హిణః. 10





నినదించు కరకంకణాల ధ్వనిచేత, మనోహరములై, చిన్న గజ్జెల ధ్వనులతోడ, వీణా వేణురావములతోడను, పారావత విరావములతోడను, చిలుకపలుకులతోను, జగమువ్యాపించెను. శివుని యాభరణములైన సర్పములను జూచి మయూరములు తమ పురుగులనే అసంఖ్యాకములుగా నములుతు నాట్యము జేసినవి.

నవృతు ర్దంశయంత స్స్యాం - శ్చంద్రకా న్కోటిసంఖ్యయా,
ప్రణమంతం తతో రామ - ముత్థాప్య వృషభధ్వజః. 11

ఆనినాయ రథం దివ్యం - ప్రహృష్టేనాంతరాత్మనా,
కమండలుజలై స్స్వచ్ఛై - స్స్యాయ మాచమ్య యత్నతః. 12

త మాచామ్యాఽథ పురత - స్స్వాంకే రామ ముపావయత్,
అథ దివ్యం ధను స్తస్మై - దదౌ తూణీర మక్షయమ్. 13

మహాపాశుపతం నామ - దివ్య మస్త్రం దదౌ తతః,





*ఉక్తశ్చ తేన రామోzపి - సాదరం చంద్రమౌళినా.* **14**

*జగన్నాశకరం రౌద్ర - ముగ్ర మస్త్ర మిదం నృప,*
*అతో నేదం ప్రయోక్తవ్యం - సామాన్యసమరాదికే.* **15**

*అన్యో నాస్తి ప్రతీఘాత - ఏతస్య భువనత్రయే,*
*తస్మా త్ప్రాణాత్యయే రామ! - ప్రయోక్తవ్య ముపస్థితే.* **16**

తరువాత గొప్ప ధనుస్సును తగ్గని అమ్ములపొదిని, పాశుపతాస్త్రమును బ్రసాదించెను. వెనువెంటనే మహాదేవుడు శ్రీరాముని గురించి యిట్లు బోధించెను: ఓయీ రామా! ఈ మహాస్త్రము రౌద్రము (రుద్రునికి సంబంధించినది) జగత్ప్రళయము గావింపజేయును కావున సామాన్య యుద్ధములలో నీ మహాస్త్రము నుపయోగింపకుము. స్వర్గ-మర్త్య-పాతాళము ఈ ముల్లోకములలోను ఏ యొక్కడైనను ఈ మహాస్త్రము ధాటిని భరించి ప్రతీకారము జేయువాఁడులేడు,





కనుక తనకు ప్రాణాపాయము సంభవించు సందర్భమున మాత్రమే దీనిని ప్రయోగించాలి తక్కిన సమయాల్లో దీని నుపయోగింపదగదు. దీని నుల్లంఘించిన యెడల జగత్సంహారము జరుగును.

*అన్యదైత త్ప్రయుక్తంచే - జ్జగత్సంక్షయకృ ద్భవేత్,*
*అథాఽఽహూయ సురశ్రేష్ఠా - ల్లోకపాలా న్మహేశ్వరః.* **17**

*ఉవాచ వరమప్రీతః - స్త్వం స్వ మస్త్రం ప్రయచ్ఛత,*
*రాఘవోఽయం చ తై రస్త్రైః - రావణం నిహనిష్యతి.* **18**

*తస్మై దేవై రవధ్య స్త్వ - మితి దత్తో వరో మయా,*
*తస్మా ద్వానరతా మేత్య - భవంతో యుద్ధదుర్మదాః.* **19**

తదుపరి దేవతలను, దిక్పాలురను రప్పించి మిగుల యానందముతోడ ఓయీ! దేవతలారా! మీమీ యాయుధంబులను ఒసగుడు. శ్రీరాముడాయా అస్త్రముల



శక్తిచేత రావణాసురుని వధించును, ఏకారణముచేతనైతే దేవతల చేత వధింపబడని వరము నొసఁగితినో నాకారణము వలన మీరందరిప్పుడు వనచరులై పరాక్రమించి యీ శ్రీరామునికి జేయూత నొసఁగండి. పిదప స్వస్థులు కాగలరు అని శివుడు యాజ్ఞాపించెను.

*సాహాయ్య మన్య కుర్వన్తు - తేన సుస్థా భవిష్యథ,*
*తదాజ్ఞాం శిరసా గృహ్యా - సురాః ప్రాంజలయ స్తదా.* **20**

*ప్రణమ్య చరణౌ శంభో - స్స్వం స్వ మస్త్రం దదుర్ముదా,*
*నారాయణాస్త్రం దైత్యారి - రైంద్ర మస్త్రం పురందరః.* **21**

*బ్రహ్మాఽపి బ్రహ్మదండాస్త్ర - మాగ్నేయాస్త్రం ధనంజయః,*
*యామ్యం యమోఽపి మోహాస్త్రం - రక్షోరాజ స్తథా దదౌ.* **22**

*వరుణో వారుణం ప్రాదా - ద్వాయవ్యాస్త్రం ప్రభంజనః,*
*కౌబేరం చ కుబేరోఽపి - రౌద్ర మీశాన ఏవ చ.* **23**

***సౌర మస్త్రం దదౌ సూర - స్సౌమ్యం సోమశ్చ పావకమ్,***
***విశ్వేదేవా దదు స్తస్మై - వసవో వాసవాభిధమ్.*** **24**

ఆ పరమ శివుని యాజ్ఞను దలదాల్చి కరములు జోడించి దేవతలు తమతమ ఆయుధముల బ్రసాదించిరి. వానిలో గోవిందుడు నారాయణాస్త్రమును, దేవేంద్రుడు ఇంద్రాస్త్రమును, బ్రహ్మ బ్రహ్మాస్త్రమును, అగ్నిదేవుడు ఆగ్నేయాస్త్రమును, యమధర్మరాజు యామ్యాస్త్రమును, నైఋతి మోహాస్త్రమును, వరుణుడు వారుణాస్త్రమును, వాయువు వాయువ్యాస్త్రమును, కుబేరుడు కౌబేరాస్త్రమును, శివుడు రౌద్రాస్త్రమును, సూర్యుడు సౌరాస్త్రమును, చంద్రుడు సౌమ్యాస్త్రమును, విశ్వదేవులు పావకాస్త్రమును, వసువులు వాసవాస్త్రమును ఒసంగిరి.

***అథ తుష్టః ప్రణమ్యైశం - రామో దశరథాత్మజః,***
***ప్రాంజలిః ప్రణతో భూత్వా - భక్తియుక్తో వ్యజిజ్ఞపత్.*** **25**



పిమ్మట శ్రీరాముడు సంతృప్తిజెంది శివునకు బ్రణమిల్లి చేతులు జోడించి భక్తిమీరఁ నిట్లు నివేదించుకొనెను:

*భగవ! న్మానుషైరేవ - నోల్లంఘ్యో లవణాంబుధిః,*
*తత్ర లంకాభిధం దుర్గం - దుర్జయం దేవదానవైః.* **26**

*అనేకకోటయ స్తత్ర - రాక్షసా బలవత్తరాః,*
*సర్వే స్స్వాధ్యాయనిరతా - శ్శివభక్తా జితేంద్రియాః.* **27**

*అనేక మాయాసంయుక్తా - బుద్ధిమంతోఽగ్నిహోత్రిణః,*
*కథ మేకాకినా జేయా - మయా భ్రాత్రా చ సంయుగే.* **28**

ఓ పరమేశ్వరా! విశాలము మరియు నగాధమైన సాగరము మానవుల చేత దాటశక్యము గానిది పోగా లంకానగరము ప్రవేశింప సాధ్యపడనిది. అంతేగాదు, దేవదానవులకు గూడ సాధించరానిది, అక్కడ మహాశాలురు, స్వాధ్యాయనిరతులు, శివ భక్తులు (వీరశైవులు) ఇంద్రియ నిగ్రహముగలవారు మాయాసహితులు బుద్ధిమంతులు,





అగ్నిహోత్రము గల(బ్రాహ్మణులు) వారును, మరియెందరో సుతులు ఉన్నారు. కేవలము నా సోదరుడగు లక్ష్మణునితో బాటు ఏకాకిగానున్న నేను మాత్రము రావణుని యెట్లు జయించగలను?

*రావణస్య వధే రామ! - రక్షసామపి మారణే,*
*విచారో న త్వయా కార్య - స్తస్య కాలోzయ మాగతః. 29*

*అధర్మే తు ప్రవృత్తాస్తే - దేవబ్రాహ్మణపీడనే,*
*తస్మా దాయుః క్షయం యాతం - తేషాం శ్రీరపి సువ్రత!30*

శివుఁడాదేశించుచున్నాడు: ఓయీ రామా! రావణుని వధించుట, మరియు రాక్షసులను బరిమార్చుటలో నీవెంత మాత్రము విచారపడకుము. రావణునికిఁజావు దగ్గరలో నున్నది. రాక్షసు లధర్మనిరతులై, దేవతలను బ్రాహ్మణులను బీడించుచున్నారు. కావున వారి యాయువు ఐశ్వర్యములు దొలగిపోవనున్నవి.





**రాజస్త్రీలంఘనాసక్తం - రావణం నిహనిష్యసి,**
**పానాసక్తో రిపు ర్జేతుం - సుకర స్సమరాంగణే. 31**

**అధర్మనిరత శ్శత్రు - ర్భాగ్యేనైవ హి లభ్యతే,**
**అధీతవేదశాస్త్రోzపి - సదా ధర్మరతోzపి వా. 32**

**వినాశకాలే సంప్రాప్తే - ధర్మమార్గా చ్చ్యుతో భవేత్,**

రాజు భార్యను లేవనెత్తుకొని పోయిన రావణుని నీవు యుద్ధభూమియందు వధింపగలవు. మద్యము త్రాగినవాడిని అనాయాసముగా జయించవచ్చును గదా! అధర్మనిరతుడగు శత్రువు తన యదృష్టముచేతనే లభించును. బాగుగా వేదాగమశాస్త్రముల నధ్యయన మొనర్చిన వాడైతేనేమి, ధర్మమార్గగామియైతేనేమి, "వినాశకాలే విపరీతబుద్ధిః" అనుసూక్తి మేరకు పోగాలము సమీపించినప్పుడు అధర్మమార్గ ప్రవర్తకుఁడగును.

**పీడ్యంతే దేవతాస్సర్వా - స్సతతం యేన పాపినా. 33**





*బ్రాహ్మణా ఋషయశ్చైవ - తస్య నాశ స్స్వయం స్థితః,*
*కిష్కింధానగరే రామ! - దేవానా మంశసంభవాః. 34*

*వానరా బహవో జాతా - దుర్జయా బలవత్తరాః,*
*సాహాయ్యం తే కరిష్యంతి - తై ర్బధాన పయోనిధిమ్. 35*

ఓ రామా! కిష్కింధాపురంబున అమరుల యంశము వలన అనేకమంది వనచరులు ఉద్భవించియున్నారు. వారందరు మిగుల శక్తి సంపన్నులై యితరులతో జయింపరానివారై సాగరమును బంధించి నీకవసరమైనంతగా సహాయ మొనర్చగలరు.

*అనేకశైలసంబద్ధే - సేతౌ యాంతు వలీముఖాః,*
*రావణం సగణం హత్వా - తా మానయ నిజప్రియామ్. 36*

*శస్త్రై ర్యుద్ధే జయో యత్ర - తత్రాఽస్త్రాణి న యోజయేత్,*
*నిరస్త్రే ష్వల్పశస్త్రేషు పలాయనపరేషు చ. 37*





*అస్త్రాణి ముంచ ద్దివ్యాని - స్స్వయమేవ వినశ్యతి,*
*అథ వా కిం బహూక్తేన - మయైవోత్పాదితం జగత్.* **38**

*మయైవ పాల్యతే నిత్యం - మయా సంహ్రియతేzపి చ,*
*అహ మేకో జగన్మృత్యు - ర్మృత్యోరపి మహీపతే!* **39**

*గ్రసేzహామేవ సకలం - జగ దేత చ్చరాచరమ్,*
*మమ వక్త్రగతాస్సర్వే - రాక్షసా యుద్ధదుర్మదాః.* **40**

*నిమిత్తమాత్ర స్త్వం భూయాః - కీర్తి మాప్స్యసి సంగరే,*

ఇతి శ్రీపద్మపురాణే శివగీతాయాం పంచమోzధ్యాయః.

వనచరులు అనేకములైన గొప్పగొప్ప రాతి గుండ్లతో సముద్రమునకు వంతెన గట్టి నీతోబాటు లంకకు వచ్చెదరు. నీవు భృత్యబంధుమిత్రుల సమూహముతోడగలసి లంకాధిపతిని హతమార్చిన ప్రియురాలగు సీతను దీసికొనిరమ్ము. సామాన్య శస్త్రములతోనే రణరంగములో





విజయము లభించుచుండగ అక్కడ మహాస్త్రములను ప్రయోగింపఁగూడదు. శత్రువులు పరుగెత్తుచుండగను ఆయుధాలు లేనివారైనను, కొద్దిమాత్రశస్త్రములున్న వారైనను అట్టివారిపై అస్త్రములఁ బ్రయోగించిన యెడల ప్రయోగించినవాడే వినాశనమునకు గురి యగును. పైన బేర్కొనినవారిపై మహాస్త్రములను బ్రయోగింపవలదు. వేయేల, ఈజగత్తంతయును నాతోనే సృష్టించబడినది, నాచేతనే రక్షించబడినది. నాచేతనే సంహరించబడినది, నేనే మృత్యువునకు గూడ మృత్యువును, సమస్త స్థిరచరాత్మక ప్రపంచమంతయును భ్రమింగెదను. (అత్ర అనేన హేతునా లీయతే గమ్యతే యత్ర సచరాచరం తల్లింగమితి సంజ్ఞితమ్) రణమందు మదించిన రాక్షసులందరు నా నోటబడినవారలే. నిమిత్తమునకు మాత్రము నీవుండుము. శాశ్వతమైన అపారమగు యశస్సును నీవు బడయగలవు.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతంబైన
శివగీతలో ఐదవ అధ్యాయము సమాప్తము.



# షష్ఠాధ్యాయము

## విభూతి యోగము

శ్రీరామ ఉవాచ:-

*భగవం స్త్వత మే చిత్రం - మహ దేత త్ప్రజాయతే,*
*శుద్ధస్ఫటికసంకాశ - స్త్రినేత్ర శ్చంద్రశేఖరః.* 1

*మూర్తఽస్త్వం తు పరిచ్ఛిన్నా - కృతిః పురుషరూపధృత్,*
*అంబయా సహితోఽత్రైవ - రమసే ప్రమథై స్సహ.* 2

*త్వం కథం పంచభూతాది - జగదేత చ్చరాచరమ్,*
*తద్బ్రూహి గిరిజాకాంత! - యది తేఽనుగ్రహో మయి.* 3

శ్రీరాముడు ప్రశ్నించుచున్నాడు:-

ప్రభూ! ఓ మహదేవా! మీరిప్పుడు సెలవొసంగిన విషయమునందు గొప్ప విభ్రాంతి గలుగుచున్నది. నీవు స్వచ్ఛమైన





స్ఫటికమణి మాదిరిగా తెల్లనైనవాడవు, పరిభిన్న స్వరూపుడవు. ఉమాదేవితో గూడి ప్రమథులతో నిక్కడ విరాజిల్లుచున్నావు. పంచభూతాత్మకమగున ప్రపంచమునెట్లు సృష్టించితివి? నాకు విస్తారముగా దెలియపరచి నన్ననుగ్రహింపుము.

*శృణు రామ! మహాభాగ! - దుర్జ్ఞేయ మమరైరపి,*
*త త్ప్రవక్ష్యామి యత్నేన - బ్రహ్మచర్యేణ సువ్రత.* 4

*పారం యాన్త్యన్యవాయాసా - ద్యేన సంసారవీరథేః,*
*దృశ్యంతే పంచభూతాని - యే చ లోకా శ్చతుర్దశ.* 5

*సముద్రాః పర్వతా దేవా - రాక్షసా ఋషయ స్తథా,*
*దృశ్యంతే యాని చాన్యాని - స్థావరాణి చరాణి చ.* 6

*గంధర్వాః ప్రమథా నాగా - స్సర్వే తే మద్విభూతయః,*
*పురా బ్రహ్మాదయో దేవా - ద్రష్టుకామా మమా కృతిమ్.* 7

ఓయీ రామా! బహుముఖ్యమైన విషయమునే



ఆలోచించి బ్రశ్నించితివి. ఇది దేవతలకు గూడ దెలియదు. కావున అట్టి గోప్యమైన విషయమును నీకు వివరించెదను అవధరింపుము. ఈ కన్నుల కగుపడుచున్నట్టి (దృగ్గోచరమగునట్టి) పంచభూతములు, పదునాలుగు భువనములు, సప్తసముద్రములు, సప్తపర్వతములు, ముక్కోటిదేవతలు, దానవులు, మరియు నీ చరాచరాత్మకములైన జీవరాసులు, గంధర్వులు, ప్రమథులు, సర్పములు మొదలగున వన్నియు నా యంశభూతములే, మొట్టమొదట బ్రహ్మాది దేవతలు నా నిజస్వరూపమును గనుగొన నిష్టపడినవారై నాకెంతగానో ఇష్టమైన మందరపర్వతమున కరగిరి.

*మందరం ప్రయయుష్పర్వే - మమ ప్రియతరం గిరిమ్,*
*స్తుత్వా ప్రాంజలయో దేవా - మాం తథా పురతస్స్థితాః. 8*

*తాన్దృష్ట్వా థ మయా దేవాన్ - లీలాకులితచేతసః,*
*తేషా మపహృతం జ్ఞానం - బ్రహ్మాదీనాం దివౌకసామ్. 9*

*ఆసంస్తేzసకృదజ్ఞానా - మామాహుః కో భవానితి,*
*అథాzబ్రువ మహం దేవా - బ్రహమేవ పురాతవః.* **10**

అటకు వెళ్ళినవారై బద్ధాంజలులై నన్ను గురించి స్తోత్రము చేయుచు, నాపర్వతము చేరువలో నిలిచిరి. అట్టి వారినే గనుగొని లీలామాత్రమైన చిత్తముతో నేను బ్రహ్మాది దేవతలయొక్క ఇంగిత జ్ఞానము నపహరించితిని. అప్పుడు వారు అజ్ఞానముతో నన్ను "నీవెవ్వఁడవని" బ్రశ్నించిరి. ఆ సందర్భమున నేను ఆ దేవతలతో "ఓయీ దేవతలారా! నేనే అనాదిపురుషుడిని.

*ఆసం ప్రథమమేవాహం - వర్తామి చ సురేశ్వరాః,*
*భవిష్యామి చ లోకేzస్మి - న్మత్తో నాన్యోzస్తి కశ్చన.* **11**

*వ్యతిరిక్తం చ మత్తోzస్తి - నాzన్య త్కించి త్సు రేశ్వరాః,*
*నిత్యోzనిత్యోzహమనఘో - బ్రహ్మణాం బ్రహ్మణప్పతిః.* **12**



*దక్షిణాంచ ఉదంచో zహం - ప్రాఞ్చః ప్రత్యఞ్చ ఏవ చ,*
*అధశ్చోర్ధ్వం చ విదిశో - దిశశ్చాzహం సురేశ్వరాః.* **13**

*సావిత్రీ చాపి గాయత్రీ - స్త్రీ పుమానపుమానపి,*
*త్రిష్టుప్ జగత్యనుష్టుప్చ - పఙ్క్తిశ్ఛంద స్త్రయీమయః.* **14**

*సత్యోzహం సర్వతశ్శాంత - స్త్రే తాగ్నిర్గౌరవం గురుః,*
*గౌరహం గహ్వరం చాహం - ద్యౌరహం జగతాం ప్రభుః.* **15**

*జ్యేష్ఠ స్సర్వసురశ్రేష్ఠో - వరిష్ఠోzహ మపాంపతిః,*
*ఆర్యోzహం భగవా నీశ - స్తేజోzహం చాదిరప్యహమ్.* **16**

*ఋగ్వేదోzహం యజుర్వేదః - సామవేదోzహ మాత్మభూః,*
*అథర్వణశ్చ మన్త్రోzహం - తథా చాంగిరసో వరః.* **17**

*ఇతిహాసపురాణాని - కల్పోzహం కల్పవా నహమ్,*
*నారాశంసి చ గాథాహం - విద్యోపనిషదోzస్మ్యహమ్.* **18**





శ్లోకా స్సూత్రాణి చైవాహ - మనువ్యాఖ్యానమేవ చ,
వ్యాఖ్యానాని తథా విద్యా - ఇష్టం హుత మథాऽऽహుతిః. 19

దాతా దత్త మయం లోకః - పరలోకోऽహ మక్షరః,
క్షర స్సర్వాణి భూతాని - దాంతిశ్శాంతిరహం ఖగః. 20

గుహ్యోऽహం సర్వేవేదేషు - ఆరణ్యోऽహమజోऽవ్యహమ్,
పుష్కరం చ పవిత్రం చ - మధ్యం చాऽహ మతః పరమ్.21

బహిశ్చాహం తథా చాంతః - పురస్తాదహమవ్యయః,
జ్యోతిశ్చాహం తమశ్చాహం - తన్మాత్రాణీంద్రియాణ్యహమ్.22

బుద్ధిశ్చాహమహంకారో - విషయాణ్యహమేవ హి,
బ్రహ్మే విష్ణుర్మహేశోऽహ - ముమా స్కందో వినాయకః. 23

ఇంద్రోऽగ్నిశ్చ యమ శ్చాహం - నిరృతిర్వరుణోऽనిలః,
కుబేరోऽహం తథేశానో - భూర్భువస్స్వర్మహార్ణవః. 24





**తవ వృత్యం చ పృథివీ - చాప స్తేజోऽనిలోऽవ్యహమ్,**
**ఆకాశోऽహం రవి స్సోమో - నక్షత్రాణి గ్రహాణ్యహమ్. 25**

మరియును ఓయీ దేవతలారా! నేనే అతి ప్రాచీనుడిని, నిత్యుడిని, అనిత్యుడిని, పాపరహితుఁడను, బ్రహ్మణస్పతిని, పది దిక్కులును నేనే, సావిత్రీ-గాయత్రీ స్త్రీ పున్నపుంసకములు నేనే. త్రిష్టుప్ - జగతి-అనుషుప్-పంక్తీ ఛందంబులు నేనె. వేదమయుడను, సత్యుడను, శాంతుడను, గౌరవమును నేనే. మానవుడిని, ఆగసము, జగత్పతిని, జ్యేష్ఠుడను, సర్వేశ్వరుడు, భగవంతుడు, ఈశ్వరుడు, తేజస్సు, ఇతిహాస పురాణాదులు, కల్పము, ఉపకల్పము, కల్పవంతుడు, విద్య, ఉపనిషత్తు శ్లోకము సూత్రము, మంత్రము, వ్యాఖ్యానము, హుతము, ఆహుతి, దాత, దానము, ఇహలోకము, పరలోకము, అక్షరము, క్షరము, సర్వభూతములు, దాంతి, శాంతి, గుహ్యమును నేనే. సర్వతోముఖుడను, అంతము, మధ్యము, ద్వారము,



బహిస్థానము, ముందు, వెనుక నేనే. మరియు నాశరహితుడను. జ్యోతిస్వరూపుడను. తమము, ఇంద్రియములు, బుద్ధి అహంకారము, విషయములు త్రిమూర్తులు, దిక్పాలురు, పార్వతి, షణ్ముఖుడు, గణపతి, పంచభూతములు, సప్తలోకములు, రవి, చంద్రుడు, నక్షత్రములు, గ్రహములు, ప్రాణము, కాలము, మృత్యువు, అమృతము, భూతము, ఉన్నవి, కలుగబోవునవి, ఈ సర్వములు నేనే.

*ప్రాణః కాలస్తథా మృత్యు - రమృతం భూతమవ్యహమ్,*
*భవ్యం భవిష్య త్కృత్స్నం చ - విశ్వం సర్వాత్మకోऽవ్యహమ్.26*

*ఓమాదౌ చ తథా మధ్యే - భూర్భువస్స్వస్తథైవ చ,*
*తతోऽహం విశ్వరూపోऽస్మి - శీర్షం చ జపతాం సదా. 27*

*అశితం పాయితం చాహం - కృతం చాకృతమవ్యహమ్,*
*పరం చైవాపరం చాహ - మహం సూర్యః పరాయణః. 28*



మొట్టమొదట (ఆదిలో) ఓంకారముగాను, మధ్యలో భూః-భువః-సువర్లోకములు, అంతమును, విశ్వరూపుడను నేనే, జపించువారి ఫలితమును నేనే, తినబడినది, తాగబడినది, చేయబడినది, పరము, అపరము, సూర్యుడు, పరాయణుడు లోకహితము, దివ్యము, అక్షరము, సూక్ష్మము, ప్రాజాపత్యము, పవిత్రమును, సౌమ్యము, అగ్రాహ్యము అగ్రియమును నేనే అయియున్నాను.

*అహం జగద్ధితం దివ్య - మక్షరం సూక్ష్మమవ్యహమ్,*
*ప్రాజాపత్యం పవిత్రం చ - సౌమ్యమగ్రాహ్యమగ్రియమ్. 29*

*అహమేవోపసంహర్తా - మహాగ్రాసౌజసాం నిధిః,*
*హృదయే దేవతాత్వేన - ప్రాణత్వేన ప్రతిష్ఠితః. 30*

లోక హితము విచిత్రమైనది. నాశము లేనిది. సూక్ష్మమైనది, ప్రాజాపత్యము, మేధ్యము, సౌమ్యము. అగ్రాహ్యము ఉత్తమోత్తమమైనది నేనే. ఉపసంహరించువాడను,



తేజోనిధిని, సమస్తప్రాణుల హృదయాంతరాళమున సూక్ష్మరూపుండనై యుండెదను, ప్రాణపదమున నుండువాఁడను నేనే.

*శిరశ్చోత్తరతో యస్య - పాదౌ దక్షిణత స్తథా,*
*తస్య సర్వోత్తరస్సాక్షా - దోంకారోఽహం త్రిమాత్రకః.* **31**

*ఊర్ధ్వమున్నామయే యస్మా - దధశ్చావనయామ్యథ,*
*తస్మా దోంకార ఏవాహ - మేకో నిత్య స్సనాతనః.* **32**

*ఋచో యజూంషి సామాని - యో బ్రహ్మ యజ్ఞకర్మణి,*
*ప్రణామయే బ్రాహ్మణేభ్య - స్తేనాహం ప్రణవో మతః.* **33**

*స్నేహో యథా మాంసఖండం - వ్యాప్నోతి వ్యాపయత్యపి,*
*సర్వలోకా నహం తద్వ - త్సర్వవ్యాపీ తతోఽస్మ్యహమ్.* **34**

*బ్రహ్మా హరిశ్చ భగవా - నాద్యంతం నోపలబ్ధవాన్,*
*తతోఽన్యే చ సురా యస్మా - దనంతోఽహమితీరితః.* **35**



ఎవడికైతే శిరస్సు ఉత్తరమున (దిక్కున) చరణములు దక్షిణ దిక్కున నుండునో అటువంటి సర్వశ్రేష్ఠుని, త్రిమాత్మకమగు ఓం (ప్రణవమును) కారమును నేనే, మద్భక్తులుగా నున్నవారి పాపములను బోనాడి పుణ్యలోకములను ప్రాపింప జేయుదును. పాపిష్టులను నరకకూపంబులో బడద్రోయింతును. కనుక నేనే శాశ్వతుడను. ఓంకారరూపుడను, ఋగ్యజః సామవేదములు నేనే, యజ్ఞకర్మలను ఏ కారణముచేత ద్విజులకు బ్రణాముం జేయించుచున్నాడనో ఆ కారణము వలన ప్రణవరూపుడను నేనే. మాంసపిండ మెట్లు సమస్త జీవులయందు వ్యాపించియున్నదో, అట్లే నేను సమప్రపంచమున బరిపూర్ణుడనై యుంట వలన సర్వాంతర్యామియును నేనే. మరియు బ్రహ్మ, విష్ణు-భగవంతుడు మిగత దేవతలందరును నా యాద్యంతములను దెలిసికొనలేకపోవుట వలన నన్నే అనంతుడనియెదరు.





గర్భ జన్మజరామృత్యు - సంసారభయసాగరాత్,
తారయామి యతో భక్తం - తస్మాత్తారోZహ మీరితః. 36

చతుర్విధేషు దేహేషు - జీవత్వేవ వసామ్యహామ్,
సూక్ష్మో భూత్వాZథ హృద్దేశే - యతత్సూక్ష్మః ప్రకీర్తితః. 37

మహాతమసి మగ్నేభ్యో - భక్తేభ్యో యత్ప్రకాశయే,
విద్యుద్వ దతులం రూపం - తస్మా ద్వైద్యుత మప్యహామ్. 38

ఏక ఏవం యతో లోకా - న్విసృజామి సృజామి చ,
వివాసయామి గృహ్ణామి - తస్మాదేకోZహ మీశ్వరః. 39

న ద్వితీయో యత స్తస్థే - తురీయం బ్రహ్మ య త్స్వయమ్,
భూతాన్యాత్మని సంహృత్య చైకో - రుద్రో వసామ్యహామ్.40

నా భక్తులను గర్భ-జన్మ-జరా-మృత్యుమయమగు నీ సంసారసాగరము నుండి దరింపఁజేయువాడిని కావున నన్ను తారకుడని యందురు. నాలుగు రకాల దేహములందును





జీవత్వరూపమున సూక్ష్మండనై యుండుటవలన సూక్ష్మరూపుడను, ఘోరాంధఃకారము (అజ్ఞానము)న మునిగియున్న భక్తులకు విద్యుత్తువలె భాసుర రూపమును జూపుటచేత వైద్యుతాభిఖ్యుడను వాడను నేనే. ఏ కారణమువలన నేనొక్కడినే సర్వలోకములను సృష్టించెదనో, వదలెదనో, జీవింపజేసెదనో మరల గ్రహించెదనో ఆ కారణముచేత నేనొక్కడినే ఈశ్వరుడిని, త్రిమూర్తుల నధిగమించి నాకు సమానమైనవాఁడు వేరొకడు లేకపోవుట వలన సమస్తప్రాణులను నా హృదంతరాళమునందె సంహరింతును, గనుక నేనొక్కడినే రుద్రుండనై యున్నాను.

*సర్వలోకా న్యదీశేzహ - మీశనీభిశ్చ శక్తిభిః,*
*ఈశాన మస్య జగత - స్స్వర్దృశం చక్షురైశ్వరమ్.* **41**

*ఈశాన మింద్రతస్థుష - స్సర్వేషామపి సర్వదా,*
*ఈశాన స్సర్వవిద్యానాం - య దీశాన స్త దస్మ్యహమ్.* **42**





**సర్వాన్భావా న్నిరీక్షేzహ - మాత్మజ్ఞానం నిరీక్షయే,**
**యోగం చ సమయే యస్మా - ద్భగవా న్మహాతో మతః. 43**

**అజస్రం యచ్చ గృహ్ణామి - విసృజామి సృజామి చ,**
**సర్వాన్ లోకాన్వ్యాసయామి - తేనాహం వై మహేశ్వరః. 44**

**మహాత్మ్యాత్మజ్ఞానయోగై - రైశ్వర్యైస్తు మహీయతే,**
**సర్వాన్భావాన్మహాదేవ - స్సృజత్యవతి పాzవ్యహమ్. 45**

నేను ఈ నీ శక్తులతోబాటు ఈ ప్రపంచమును సర్వాంతర్గతుండనై దెలసి ఈ జగత్తునకు దెలిసికొను సాధన వస్తువుగ నుండవలన జగన్నేత్రముగూడ నేనేట ఐయున్నాను. సర్వప్రాణికిని సమస్త విద్యలకును స్వామిని నేనే యగుట వలవ ఈశానుడను నేనే. అఖిల భావములను ఆత్మజ్ఞానమును, సమయమున యోగంబును జూచుటవలన నేనే భగవంతుడిని, సదా సమస్తలోకంబులను గ్రహించువాడను, త్యజించువాడను,





జీవత్వరూపమున సూక్ష్మండనై యుండుటవలన సూక్ష్మరూపుడను, ఘోరాంధఃకారము (అజ్ఞానము)న మునిగియున్న భక్తులకు విద్యుత్తువలె భాసుర రూపమును జూపుటచేత వైద్యుతాభిఖ్యుడను వాడను నేనే. ఏ కారణమువలన నేనొక్కడినే సర్వలోకములను సృష్టించెదనో, వదలెదనో, జీవింపజేసెదనో మరల గ్రహించెదనో ఆ కారణముచేత నేనొక్కడినే ఈశ్వరుడిని, త్రిమూర్తుల నధిగమించి నాకు సమానమైనవాఁడు వేరొకడు లేకపోవుట వలన సమస్తప్రాణులను నా హృదంతరాళమునందె సంహరింతును, గనుక నేనొక్కడినే రుద్రుండనై యున్నాను.

*సర్వలోకా న్యదీశేZహ - మీశినీభిశ్చ శక్తిభిః,*
*ఈశాన మస్య జగత - స్స్వర్దృశం చక్షురైశ్వరమ్.* **41**

*ఈశాన మింద్రతస్థుష - స్సర్వేషామపి సర్వదా,*
*ఈశాన స్సర్వవిద్యానాం - య దీశాన స్త దస్మ్యహమ్.* **42**



సర్వాన్భావా న్నిరీక్షేऽహ - మాత్మజ్ఞానం నిరీక్షయే,
యోగం చ సమయే యస్మా - ద్భగవా న్మహాతో మత:

అజస్రం యచ్ఛ గృహ్ణామి - విసృజామి సృజామి చ,
సర్వాన్ లోకాన్యాసయామి - తేనాహం వై మహేశ్వర:.

మహాత్మ్యాత్మజ్ఞానయోగై - రైశ్వర్యైస్తు మహీయతే,
సర్వాన్భావాన్మహాదేవ - స్సృజత్యవతి సోऽవ్యయహమ్.

నేను ఈ నీ శక్తులతోబాటు ఈ ప్రపంచ
సర్వాంతర్గతుండనై దెలసి ఈ జగత్తునకు దెలిసికొను
వస్తువుగ నుండవలన జగన్నేత్రముగూడ నేనేట ఐయు
సర్వప్రాణికిని సమస్త విద్యలకును స్వామిని నేనే యగుట
ఈశానుడను నేనే. అఖిల భావములను ఆత్మజ్ఞాన
సమయమున యోగంబును జూచుటవలన నేనే భగవం
సదా సమస్తలోకంబులను గ్రహించువాడను, త్యజించు



జీవత్వరూపమున నణుమాత్రుండనై యుండుటవలన సూక్ష్మరూపుడను, ఘోరాంధఃకారము (అజ్ఞానము)న మునిగియున్న భక్తులకు విద్యుత్తువలె భాసుర రూపమును జూపుటచేత వైద్యుతాభిఖ్యుడను వాడను నేనే. ఏ కారణమువలన నేనొక్కడినే సర్వలోకములను సృష్టించెదనో, వదలెదనో, జీవింపజేసెదనో మరల గ్రహించెదనో ఆ కారణముచేత నేనొక్కడినే ఈశ్వరుడిని, త్రిమూర్తుల నధిగమించి నాకు సమానమైనవాఁడు వేరొకడు లేకపోవుట వలన సమస్తప్రాణులను నా హృదంతరాళమునందె సంహరింతును, గనుక నేనొక్కడినే రుద్రుండనై యున్నాను.

*సర్వలోకా న్యదీశేZహ - మీశనీభిశ్చ శక్తిభిః,*
*ఈశాన మస్య జగత - స్స్వర్దృశం చక్షురైశ్వరమ్.* **41**

*ఈశాన మింద్రతస్థుష - స్సర్వేషామపి సర్వదా,*
*ఈశాన స్సర్వవిద్యానాం - య దీశాన స్త దస్మ్యహమ్.* **42**





**సర్వాన్భావా న్నిరీక్షేఽహ - మాత్మజ్ఞానం నిరీక్షయే,**
**యోగం చ సమయే యస్మా - ద్భగవా న్మహాతో మతః. 43**

**అజస్రం యచ్ఛ గృహ్ణామి - విసృజామి సృజామి చ,**
**సర్వాన్ లోకాన్యాసయామి - తేనాహం వై మహేశ్వరః. 44**

**మహత్యాత్మజ్ఞానయోగై - రైశ్వర్యైస్తు మహీయతే,**
**సర్వాన్భావాన్మహాదేవ - స్సృజత్యవతి సోఽస్మ్యహమ్. 45**

నేను ఈ నీ శక్తులతోబాటు ఈ ప్రపంచమును సర్వాంతర్గతుండనై దెలసి ఈ జగత్తునకు దెలిసికొను సాధన వస్తువుగ నుండవలన జగన్నేత్రముగూడ నేనేట ఐయున్నాను. సర్వప్రాణికిని సమస్త విద్యలకును స్వామిని నేనే యగుట వలన ఈశానుడను నేనే. అఖిల భావములను ఆత్మజ్ఞానమును, సమయమున యోగంబును జూచుటవలన నేనే భగవంతుడిని, సదా సమస్తలోకంబులను గ్రహించువాడను, త్యజించువాడను,





సృష్టించెదను, నివసింపజేయువాడను గనుక నేనే మహేశ్వరుడను, ఏ మహాదేవుడు మహత్తులలో నాత్మజ్ఞానయోగంబులతోడను, ఓ రామా! ఐశ్వర్యంబులతోడను మహత్త్వమును మించి సమస్తభావములను సృజించునో అట్టి మహదేవుఁడను గూడ నేనే.

ఏషోఽస్మి దేవః ప్రదిశోఽపి సర్వాః
పూర్వో హి జాతోఽస్మ్యహమేవ గర్భే,
అహం హి జాతశ్చ జనిష్యమాణః
ప్రత్యగ్జనా స్తిష్ఠతి సర్వతోముఖః. **46**

విశ్వతశ్చక్షు రుత విశ్వతో ముఖో
విశ్వతో బాహు రుత విశ్వత స్పాత్,
సం బాహుభ్యాం నమతి సం పతత్రై
ర్ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః. **47**





వాలాగ్రమాత్రం హృదయస్య మధ్యే
విశ్వేదేవం జాతవేదం వరేణ్యమ్,
మా మాత్మస్థం యేऽనుపశ్యంతి ధీరా
స్తేషాం శాంతి శ్శాశ్వతీ నేతరేషామ్. 48

అహం యోని మధితిష్ఠామి చైకో
మయేదం పూర్ణం పంచవిధం చ సర్వమ్,
మా మీశానం పురుషం దేవ మిత్థం
విచార్యమాణం శాంతి మత్యంత మేతి. 49

ప్రాణే ష్వంత ర్మనసో లింగమాహు
ర్యస్మిన్నశనాయా చ తృష్ణా క్షమా చ,
తృష్ణాం ఛిత్వా హేతుజాలస్య మూలం
బుద్ధ్వా చిత్తం స్థాపయిత్వా మయీహ. 50

దిశలను బుట్టినవాఁడును, జననమందువాడును,





పుట్టబోవువాడును, వృద్ధిజెందినవాఁడును (పెద్ద-జేష్ఠుడు) సర్వతోముఖుండును నేనే, లోకములను రక్షించువాడను, విశ్వమే చక్షువులుగను, ముఖములుగను, బాహులుఁగను, పాదములుగాను గలవాడను, భూః-భువః, స్వర్గాదుల స్రష్టను నేనే, పోగా నిఖిలజనహృదయంబులతో వాలాగ్రమాత్రమగు ప్రకాశ స్వరూపముగ నుండు నన్ను ప్రపంచమునకు ప్రభువుగాను, ముఖ్యునిగాను, ఆత్మస్థితునిగాను ఎవ్వరైతే దెలిసికొందురో అట్టి వారలకే శాశ్వతమగు శాంతి గలుగును. ఇతరులకు గలుగనేరదు. నేనొక్కడినే సమస్తములకు గారణభూతుండనై అయిదు ప్రకారములుగా నిఖిల లోకమువంతటిని సృష్టించి సర్వాంతర్యామినై యుండెదను. ఈ విధముగా నన్నీశ్వరునిగా దెల్సికొని, పురాణపురుషునిగాను, మహాదేవునిగా బరిశీలించువాఁడు మిగుల శాంతి జెందును. ఆకలి దప్పికలకు ఓర్పునకేది పుట్టుకయో అట్టి ప్రాణములోని





యాత్మకు గారణభూతుడిగా నన్ను వ్యవహరింతురు. అట్టి నాయందు మనస్సును కేంద్రీకరింపఁజేసి యెవ్వరైతే ధ్యానించుచు భజింతురో అటువంటివారలకే శాశ్వత శాంతి లభించును. ఇతరులకు గలుగనేరదు.

**ఏవం మాం యే ధ్యాయమానా భజన్తే**
**తేషాం శాంతి శ్శాశ్వతీ నేతరేషామ్,**
**యతో వాచో నివర్తంతే - అప్రాప్య మనసా సహ,**
**ఆనందం బ్రహ్మ మాం జ్ఞాత్వా - న బిభేతి కుతశ్చన. 51**

**శ్రుత్వేతి దేవా మద్వాక్యం - కైవల్యం జ్ఞాన ముత్తమమ్,**
**జపంతో మమ నామాని - జపధ్యానపరాయణాః. 52**

**సర్వే తే స్వస్వదేహాంతే - మత్సాయుజ్యం గతాః పురా.**
**తతో యే పరిదృశ్యన్తే - పదార్థా మద్విభూతయః. 53**



మయ్యేవ పకలం జాతం మయి వర్వం ప్రతిష్ఠితమ్,
మయి వర్వం లయం యాతి తద్బ్రహ్మాZద్వయమన్మ్యహమ్.

అణోరణీయా వహమేవ తద్వ
న్మహా వహం విశ్వమహం విశుద్ధః,
పురాతవోZహం పురుషోZహ మీశో
హిరణ్మయోZహం శివరూపమస్మి. *55*

అపాణిపాదోZహ మచింత్యశక్తిః
వశ్యామ్యచక్షుష్ప శృణోమ్యకర్ణః,
అహం విజానామి వివిక్తరూపో
వ చాస్తి వేత్తా మను చిత్పదాహమ్. *56*

వాఙ్మానసాగోచరుండనైయానంద బ్రహ్మమగు నన్ను గుర్తించిన పండితుడు ఎందువలనను భయపడడు. ఇట్లు నా వాక్యములను విని కైవల్యజ్ఞానము నెఱింగి యమరులు నా



యొక్క నామములనే ధ్యానించుచు జపధ్యానపరాయణాసక్తులై వారి వారి శరీరావసానకాలమున నా సాయుజ్యమునే బడసిరి. అందుచేత నేయే వస్తువు దృగ్గోచరమగుచున్నవో అవియన్నియు నాయంశములే. సమస్తం నాలోనే బుట్టి, నాలేనే ఉండి, నాలోనే లయమగుచున్నవి. ఆ కారణమున నేనే అద్వితీయ బ్రహ్మనైతిని, సూక్ష్మ పదార్థములలో సూక్ష్మరూపుడనై మహాత్పదార్థములో మహనీయుడనై, పురాణపురుషుడనై నిత్యుండనై హిరణ్మయుండనై శివరూపుడనై యున్నాను. హస్తపాదములు లేకుండానే నిరవధిక శక్తి పరిపూర్ణుఁడనై నేత్రరహితుఁడనయి సమస్తమును జూచుచు, కర్ణములు లేకుండానే సర్వమును వింటు నాకాశ స్వరూపుఁడనై చిత్స్వరూపుడనై సమస్తమును దెల్సికొందును. కాని ఇట్టి నన్ను గుర్తించు వారొక్కరును లేరు.

**వేదై రశేషై రహమేవ వేద్యో**
**వేదాంతకృ ద్వేదవిదేవ చాహమ్,**





న పుణ్యపాపే మయి నాస్తి నాశో
న జన్మ దేహేంద్రియబుద్ధయశ్చ. 57

న భూమిరాపో న చ వహ్నిరస్తి
న చానిలో మేఽస్తి న మే నభశ్చ,
ఏవం విదిత్వా పరమాత్మరూపం
గుహాశయం నిష్కల మద్వితీయమ్. 58

సమస్తసాక్షిం సదసద్విహీనం
ప్రయాతి శుద్ధం పరమాత్మరూపమ్,
ఏవం మాం తత్త్వతో వేత్తి - యస్తు రామ మహీపతే!
స ఏవ నాన్యో లోకేషు - కైవల్యఫల మశ్నుతే. 59

ఇతి శ్రీపద్మపురాణే శివగీతాయాం షష్ఠోఽధ్యాయః.

సమస్త వేదములద్వారా దెలిసికొనదగినవాడిని నేనే. వేదాంతములను రచించినవాడిని, వేదములను





గుర్తించినవాఁడిని, పుణ్యపాపముల కతీతుడను, నా కంతమనునది లేనేలేదు. (నాశనము లేదు) జనన దేహేంద్రియములు బుద్ధి శూన్యములు, మరియు నాకు పృథ్వి అప్పు-తేజ-ఆకాశము-వాయువు అనే పంచతత్వముల కతీతుడను, ఈ ప్రకారముగ నెవ్వడైతే పరమాత్మను ఒక్కనిగాను సమస్తసాక్షిగాను, శుద్ధస్వరూపునిగాను, సదసద్విహీనునిగాను, హృదయస్థితుడనైన నన్ను దెలిసికొందురో వారే పరమాత్మను బొందుదురు. ఓయీ రామా! ఇట్లు ఎవ్వరైతే నిజముగా నన్ను దెలిసికొందురో వారే కైవల్యమును బడయుదురు. ఇతరులు బొందనేరరు.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతంబైన

శివగీతలో ఆరవ అధ్యాయము సమాప్తము.



# సప్తమాధ్యాయము

## విశ్వరూపసందర్శనయోగము

శ్రీ రామ ఉవాచః-

*భగవ! న్త్వన్మయా పృష్టం - తత్తథైవ స్థితం విభో!*
*అత్రోత్తరం మయా లబ్ధం - త్వత్తో నైవ మహేశ్వర!* 1

*పరిచ్ఛిన్నపరీమాణే - దేహే భగవతస్తవ,*
*ఉత్పత్తి స్సర్వభూతానాం - స్థితిర్వా విలయః కథమ్?* 2

*నస్యాధికారసంబద్ధాః కథం - వామ స్థితాస్సురాః,*
*తే సర్వే త్వం కథం దేవ! - భువనాని చతుర్దశ.* 3

*త్వత్తశ్శృత్వాపి దేవాత్ర - సందేహో మే మహా నభూత్,*
*అప్రత్యాయితచిత్తస్య - సంశయం ఛేత్తు మర్హసి.* 4





ఓ స్వామీ! ఇంతవరకు నేనడిగిన ప్రశ్నకు సమాధానము ననుగ్రహించక పోయితిరి. సమస్త ప్రాణులు పరిమిత పరిమాణంబగు నిజ శరీరంబున ఎటులుద్భవిల్లుచున్నవి? ఏ విధముగ వర్ధిల్లుచున్నవి? మళ్ళీ ఏవిధముగ లయమగుచున్నవి? తమ తమ అధికారములో నుండి సృష్ట్యాదులఁగావింపుచున్న బ్రహ్మాదిదేవతలును చతుర్దశ భువనంబులును నీవెట్లైతివి? నాకు దెలియజేయుము. ఈ విషయమునంతయు నీవలన పలుమార్లు ఆలకించినప్పటికిన్ని నా చిత్తము నిశ్చలముగా నుండనందులకు సంశయించితిని, కనుక ఇట్టి సంశయమును నివారించుటకు మీరే సమర్థులు.

*శ్రీభగవా మువాచః-*

***వటబీజే సుసూక్ష్మేఽపి - మహావటతరుర్యథా,***
***సర్వదాఽఽస్తేఽవ్యథా వృక్షః - కుత ఆయాతి తద్వద.*** **5**





*తద్వన్మమ తవా రామ! - భూతానా మాగతిర్లయః,*
*మహాసైంధవపిండోఽపి - జలే క్షిప్తో విలీయతే.* 6

*న దృశ్యతే పునః పాకా - త్తత ఆయాతి పూర్వవత్,*
*ప్రాతః ప్రాతర్యథాఽఽలోకో - జాయతే సూర్యమండలాత్.* 7

*ఏవం మత్తో జగత్సర్వం - జాయతేఽస్తి విలీయతే,*
*మయ్యేవ సకలం రామ! - తద్వ జ్జానీహి సువ్రత!* 8

ఓ రామా! జగత్తులో మిక్కిలి చిన్నదగు మఱ్ఱి విత్తనములో గొప్ప వట (మఱ్ఱి) వృక్షమునిండియుండి సమయము ననుసరించి మరల వెలువడునట్లుగా నిఖిల ప్రాణికోటి నా శరీరమునుండే బయలుదేరుచున్నవి. మళ్ళీ నాయందే లీనమగుచున్నవి. సైంధవ పిండము (ఉప్పుముద్ద) ను జలములో బడవైచిన యది గరగిపోయి మరల పాకముజేయగా మొదటి స్వరూపమునే బొందునట్లుగా



ప్రాతఃకాలమున వెలుగుతో నిండి జగత్తును బ్రకాశింపఁజేయు విధమున సమస్త లోకములు నానుండే బుట్టి నాలోనే లయంబగుచున్నవి.

*శ్రీరామ ఉవాచః-*

*కథితేఽపి మహాభాగ! - దిగ్జడస్య యథా దిశి,*
*నివర్తతే భ్రమో నైవ - తద్వ న్మమ కరోమి కిమ్. 9*

శ్రీరాముడు బలుకుచున్నాడు:

ఓ మహానుభావా! నీ వెన్ని రకాలుగా నాకు బోధించినప్పటికిన్ని దిగ్భ్రాంతి జెందిన మానవుడికి దిక్కుదోచనట్లుగా, నాకేమియు దెలియుట లేదు, నేనేమి జేయుదును?

*శ్రీభగవా నువాచః-*

*మయి సర్వం యథా రామ! - జగచ్చైత చ్చరాచరమ్,*



*వర్తతే తద్దర్శయామి - న ద్రష్టుం క్షమతే భవాన్.* **10**

*దివ్యం చక్షుః ప్రదాస్యామి - తుభ్యం దశరథాత్మజ!*
*తేన పశ్య భయం త్యక్త్వా - మత్తేజోమండలం ధ్రువమ్.* **11**

*న చర్మ చక్షుషా ద్రష్టుం - శక్యతే మామకం మహః,*
*నరేణ వా సురేణాపి - తన్మమాఽనుగ్రహం వినా.* **12**

ఓ రామా! ఈ చరాచరాత్మకమైన ప్రపంచమంతయు నా యుదరంబున లీనంబై యున్నది. దానిని నీవు జూచుటకై నీకు శక్తిజాలదు. ఈ చర్మచక్షువులతో మానవుఁడైనను దేవుఁడైనను నా కరుణాకటాక్షములేక నా తేజోమండలమును గనుగొనలేడు కావున, ఓయి! దాశరథీ! నీకు దివ్యదృష్టిని ఒసఁగుచున్నాడను. నిర్భయుండవై నా తేజస్సును జక్కఁగా జూడుము.

*ఇత్యుక్త్వా ప్రదదౌ తస్మై - దివ్యం చక్షుర్మహేశ్వరః,*





అథాదర్శయదేతస్మై - వక్త్రం పాతాలసన్నిభమ్. 13

విద్యుత్కోటిప్రతీకాశ - మతిభీమం భయావహమ్,
తద్దృష్ట్వైవ భయాద్రామో - జానుభ్యా మవనీం గతః. 14

ప్రణమ్య దండవద్భూమౌ - తుష్టావ చ పునఃపునః,
అథోత్థాయ మహావీరో - యావదేవ ప్రపశ్యతి. 15

వక్త్రం పురభిదస్తావ - దంతర్బ్రహ్మాండకోటయః,
చటకా ఇవ లక్ష్యన్తే - జ్వాలామాలాసమాకులాః. 16

మేరుమందరవింధ్యాద్యా - గిరయ స్సప్తసాగరాః,
దృశ్యంతే చంద్రసూర్యాద్యాః - పంచభూతాని తే సురాః 17

అరణ్యాని మహానాగాః - భువనాని చతుర్దశ.
ప్రతిబ్రహ్మాండమేవం తు - దృష్ట్వా దశరథాత్మజః. 18

సురాసురాణాం సంగ్రామాం - స్తత్ర పూర్వాపరానపి,





విష్ణోర్దశావతారాంశ్చ - తత్కర్తవ్యాన్యపి ద్విజాః! 19

పరాభవాంశ్చ దేవానాం - పురదాహం మహేశితుః,
ఉత్పద్యమానా ముత్పన్నాం - త్సర్వానపి వినశ్యతః. 20

దృష్ట్వా రామో భయావిష్టః - ప్రణనామ ముహుర్ముహుః,
ఉత్పన్నతత్త్వజ్ఞానోఽపి - బభూవ రఘునందనః. 21

అథోపనిషదాం సారై - రర్థై స్తుష్టావ శంకరమ్.

సూతుఁడు పలుకుచున్నాడు:-

ఇట్లాదేశించిన వాఁడై శ్రీరామునకు దివ్యనేత్రము నను(గహించెను. తదుపరి రామునకు పాతాళ లోకముతో సమానమైన దననోటిని దెరచి చూయించెను. కోటి మెరపులతో సదృశమగు, అతీవ భయంకరమైన యానోరును జూడగానే శ్రీ రాముడు భయముతో దన మోకాళ్ళను నేలపై బెట్టి గూలబడెను. నేలపై సాగిలబడి (సాష్టాంగ) నమస్కారంబొనర్చి పరమ





శివుని గురించి మాటిమాటికి స్తుతించెను. తరువాత నా మహావీరుడు లేచి త్రిపురాంతకుండైన ఈశ్వరుని నోరు దెరచి చూచినంతలోనే కోట్ల కొలది బ్రహ్మాండ మండలములు అగ్నిజ్వాలలలో తపించుచున్న సెనగల వలె అగుపడెను. ఇంకను ఆ నోటిలో మేరు మందర, వింధ్యాది పర్వతములు, సప్తసముద్రములు, చంద్రసూర్యాది గ్రహములు, పంచభూతములు, దేవతలు, అరణ్యములు, ఆదిశేషుడు, చతుర్దశ భువనములు, ప్రతిబ్రహ్మాండంలోను, దేవదానవ సంగ్రామము, వాటి పూర్వాపరాలు, శ్రీ విష్ణువు యొక్క దశావతారములు, వాటి కర్తవ్య కార్యక్రమములు, దేవతల యొక్క వరాభవములును, ఈశ్వరుని యొక్క త్రిపురసంహారము, పుట్టబోయే వాటిని, పుట్టినవాటిని, పుట్టుచున్నవాటిని వీటన్నింటి వినాశమును జూచి శ్రీరాముడు తత్త్వజ్ఞాని అయినప్పటికి భయాన్వితుడై ముమ్మాటికి





ప్రణమిల్లెను. తరువాత ఉపనిషత్తులకు సారభూతములైన అర్థములతో శంకరుని గురించి స్తుతించెను.

*దేవ! ప్రపన్నార్తిహర! ప్రసీద*
*ప్రసీద విశ్వేశ్వర! విశ్వవంద్య!*
*ప్రసీద గంగాధర! చన్ద్రమౌళే!*
*మాం త్రాహి సంసారభయా దనాథమ్.* **22**

*త్వత్తో హి జాతం జగ దేత దీశ!*
*త్వయ్యేవ భూతాని వసంతి నిత్యమ్,*
*త్వయ్యేవ శంభో ! విలయం ప్రయాంతి*
*భూమౌ యథా వృక్షలతాదయోఽపి.* **23**

*బ్రహ్మేంద్రరుద్రాశ్చ మరుద్గణాశ్చ*
*గంధర్వయక్షాసురసిద్ధసంఘాః,*
*గంగాదినద్యో వరుణాలయాశ్చ*





**వసంతి శూలిం స్తవ వక్త్రమధ్యే. 24**

**త్వన్మాయయా కల్పిత మిందుమౌళే!**
**త్వయ్యేవ దృశ్యత్వ ముపైతి విశ్వమ్,**
**భ్రాంత్యా జనః పశ్యతి సర్వ మేత**
**చ్ఛుక్తౌ యథా రూప్య మహిం చ రజ్జౌ. 25**

ఓ ప్రభూ! ప్రసన్నార్తిహర! విశ్వేశ్వర! విశ్వవంద్య! గంగాధర! చంద్రమౌళి! ప్రసన్నుడవు గమ్ము. అనాథుడనైన నన్ను సంసారభయమునుండి రక్షింపుము. ఈశ్వరా! భూమిపై వృక్షములు, లతలు మొదలగునవి యుద్భవించి నశించునట్లు ఈ జగమంతయు నీనుండే బుట్టినది, నీయందే నివసించుచున్నది. హే శివా! నీలోనే లయమగుచున్నది. ఓయీ త్రిశూలధారీ! బ్రహ్మ, ఇంద్రుడు, మరుద్గణము, గంధర్వులు యక్షులు అసుర, సిద్ధసమూహములును గంగ మున్నగు నదులును సప్తసముద్రములు నీ యొక్క వదన మధ్యమందు





నివసించుచున్నవి. ఓ చంద్రశేఖరా! ఈ జగత్తు నీ మాయచేత సృష్టించబడినది. నీయందే దృశ్యత్వమును బొందినను జను భ్రాంతితో ముత్యపుచిప్ప (కౌచిప్ప) లో రజతమును, త్రాటియందు సర్పమును జూచినట్లుగా జూచి భ్రాంతి జెందుచున్నారు.

*తేజోభిరావూర్య జగ త్సమగ్రం*
*ప్రకాశమానః కురుషే ప్రకాశమ్,*
*వినా ప్రకాశం తవ దేవదేవ*
*న దృశ్యతే విశ్వ మిదం క్షణేన.* **26**

*అల్పాశ్రయో నైవ బృహంత మర్థం*
*ధత్తేZణురేకో న హి వింధ్యశైలమ్,*
*త్వద్వక్త్రమాత్రే జగ దేత దస్తి*
*త్వన్మాయయైవేతి చ నిశ్చినోమి.* **27**





రజ్జౌ భుజంగో భయదో యథైవ
న జాయతే నాస్తి న చైతి నాశమ్,
త్వన్మాయయా కేవల మాత్తరూపం
తథైవ విశ్వం త్వయి నీలకంఠ! 28

విచార్యమాణే తవ యచ్ఛరీర
మాధారభావం జగతా ముపైతి,
తదప్యవశ్యం మదవిద్యయైవ
పూర్ణ శ్చిదానందమయో యత స్త్వమ్. 29

పూజేష్టపూర్తాదివరక్రియాణాం
భోక్తుః ఫలం యచ్ఛసి శస్తమేవ,
మృ షైతదేవం వచనం పురారే!
త్వత్తోఽస్తి భిన్నం న చ కించిదేవ. 30

సమస్త ప్రపంచమును నీ ప్రకాశముతో నింపి



ప్రకాశవంతముగా జేయుచున్నావు. ఓ దేవదేవా! మహాదేవా! నీ ప్రకాశమే లేనియెడల ఒక క్షణమైనను ఈ జగత్తు అగుపడదుగదా! ఒక చిన్న వస్తువు గొప్ప పదార్థమును మోయలేదుగదా! కాని నీ నోటిలోన ప్రపంచమంతయును ఇమిడియున్నది. ఇదంతయును నీయొక్క మాయచేతనే యని నేను విశ్వసించుచున్నాను. ఓయీ! నీలకంఠా! త్రాటియందు సర్ప భ్రాంతివలె కనబడి యేరీతిగా భయమును గల్పించుచున్నదో అట్లే కేవలము ఆత్మస్వరూపుండవైన నీలోనే విశ్వమంతయు నీ మాయతో గల్పితమై జననముగాని, వినాశముగాని పొందనప్పటికి భయమును గొల్పుచున్నది. బాగుగా బరిశీలించగా, నీ యొక్క శరీరమే యీ ప్రపంచమునకు ఆధారభూతమైనదిగా నున్నదని జెప్పినచో యది యవశ్యముగా నా యజ్ఞానమనక దప్పదు. నీవు సర్వాంతర్యామివి. చిదానందస్వరూపుండవు. ఓయీ! త్రిపురసంహారకా!



ఇష్టాపూర్త్యాదిశ్రేష్ఠమైన కర్మలను జేయువారికి మహత్త్వపూర్ణమైన ఫలము నొసగుచున్నావను వచనము గూడ అబద్ధమైనదే, ఏలయనగా నీకంటె, నుభిన్నమైనది యే మాత్రములేదు. అంతా నీ స్వరూపమేగదా!

**అజ్ఞానమూఢా మునయో వదంతి**
**పూజోపచారాదిబహుక్రియాభిః,**
**తేషాం గిరీశో భజతీతి మిథ్యా**
**కుత స్త్వమూర్తస్య తు భోగలిప్సా. 31**

**కించిద్దలం వా చులకోదకం వా**
**య త్త్వం మహేశ! ప్రతిగృహ్య ధత్సే!**
**త్రైలోక్యలక్ష్మీమపి తజ్జనేభ్య**
**స్సర్వం త్వవిద్యాకృతమేవ మన్యే. 32**

**వ్యాప్నోషి సర్వా విదిశో దిశశ్చ**





త్వం విశ్వ మేకః పురుషః పురాణః,
నష్టేఽపి తస్మిం స్తవ నాస్తి హాని
ర్ఘటే వినష్టే నభసో యథైవ, 33

యథైవ మాకాశగ మర్కబింబం
క్షుద్రేషు పాత్రేషు జలాన్వితేషు,
భజత్యనేకప్రతిబింబభావం
తథా త్వమంతఃకరణేషు దేవః 34

సంసర్జనే వావ్యనే వినాశే
విశ్వస్య కించి త్తవ నాస్తి కార్యమ్,
అనాదిభి ర్దేహభృతా మదృష్టైః
తథాపి త త్స్వప్నవ దాతనోషి. 35

ఆరాధనోపచార ఉపహారములు మొదలగు అనేక క్రియలచేత నీవు ప్రసన్నుడవగుదువని యజ్ఞానముతో





మందమతులైన మునులు బలుకు చుందురు. అమూర్తుడవగు నీకు సుఖోపభోగమెక్కడిది? ఎవడైతే భక్తితో కొద్దిమాత్ర బిల్వ పత్రములు జలము సమర్పించునో ఆతనిని నీవు అత్యంత గౌరవముతో బ్రసన్నుండవై ముల్లోకరాజ్యమును అనుగ్రహించెదవనియు ఐనవ్పటికిన్ని వీనినన్నింటిని అజ్ఞానపాచరణగా నేననుకొనియెదను. పురాణ పురుషుడవగు నీ వొక్కడివే, దిశలను విదిశలను నిఖిల జగత్తును వ్యాపించియున్నావు. యద్యపి అవి నశించినను ఆకాశము వలె నీకుగూడా నాశమనేది లేదు. ఆకసమందు జరించె సూర్యుడు జలాశయ కూపటాదులలో నేవిధముగా భిన్నభిన్నములుగామ అగుపడునో, అదేరీతిగా నీవొక్కండవయ్యు లోకాంతః కరణములందు అనేక రూపములందు దృగ్గోచరుఁడవగుదువు. ఈ చరాచరాత్మకం సమస్త ప్రపంచమును బుట్టింప-రక్షింప, చివరికి లయ (హరించుట) మొనర్చుటవలన నీ కేమియు





లాభము (ఉపయోగము) లేదు. అనాది సంచితములగు శరీరుల అదృష్టాను సారముగాఁగలుగుచుండును. ఉండును, పోవును, అయినప్పటికిన్ని స్వప్నము మాదిరిగా విస్తరింపజేతువు.

*స్థూలస్య సూక్ష్మస్య జడస్య దేహ*
*ద్వయస్య శంభో! న చితం వినాऽస్తి,*
*అత స్త్వదారోపణ మాతనోతి*
*శ్రుతిః పురారే! సుఖదుఃఖయో స్సదా.* **36**

*నమ స్సచ్చిదంభోధిహంసాయ తుభ్యం*
*నమః కాలకంఠాయ కాలాత్మకాయ,*
*నమస్తే నమస్తాऽఘసంహారకర్త్రే*
*నమస్తే మృషాచిత్తవృత్త్యైకభోక్త్రే.* **37**

*ఏవం ప్రణమ్య విశ్వేశం - పురతః ప్రాంజలిస్థ్సితః,*
*విస్మితః పరమేశానం - జగదే రఘునందనః.* **38**





***ఉపసంహర విశ్వాత్మన్ - విశ్వరూపమిదం తవ,***
***ప్రతీతం జగదైకాత్మ్యం - శంభో! భవదనుగ్రహాత్.*** **39**

***పశ్య రామ మహాబాహో - మత్తో నాన్యోzస్తి కశ్చన,***
***ఇత్యుక్త్వైవోపసంజహ్రే - స్వదేహే దేవతాదికాన్.*** **40**

ఓ త్రిపురసంహారకా! స్థూలము-సూక్ష్మము-జడరూపములకు నీకును ఇంచుక భేదము లేదు. కావుననే సుఖ దుఃఖములకు గారణభూతుడవు నీవేయని వేదములు ఘోషించుచున్నవి. ఓ దేవదేవా! మహాదేవా! సచ్చిదానందమను సాగరములో హంసవైన నీకు నా ప్రణామంబు, నీలకంఠుని కొరకు కాలాత్మునికొరకు, నిఖిల పాప సంహారునికొరకు, మిధ్యాభూతంబగు చిత్త వ్యాపారములందును భోక్తవగు నీకు నా నమస్కారము.

సూతుడు చెప్పుచున్నాడు:-





ఈ విధముగ నా పరమేశ్వరుని ముంగిట జేతులు జోడించి నతమస్తకుండై నిలచి విరాటరూప సందర్శనముతో నాశ్చర్యచకితుడై వక్ష్యమాణ ప్రకారముగా నీశ్వరుని గురించి యిట్లు చెప్పుచున్నాడు: సర్వవ్యాప్తియగునో మహాదేవ! నీ విశ్వరూపమును ఉపసంహరింపుము. నీ యనుగ్రహమువలన సమస్త జగదైక్యమును సందర్శించితిని.

శ్రీ భగవంతు డాదేశించుచున్నాడు:-

ఓయీ రామచంద్రా! బాగుగా నవలోకింపుము. నాకంటెను-మరొకడెవ్వడును లేడు సుమా! సూతుడు బలుకుచున్నాడు: శివుఁడీ విధముగా నాదేశించి తన విశ్వరూపమునను్న దేవాదులను ఉపసంహరించుకొనెను.

***మీలితాక్షః పునర్ద్రష్టా - ద్యావ ద్రామః ప్రపశ్యతి,***
***తావదేవ గిరేశ్శృంగే - వ్యాఘ్రచర్మోపరిస్థితమ్. 41***



దదర్శ పంచవదనం - నీలకంఠం త్రిలోచనమ్,
వ్యాఘ్రచర్మాంబరధరం - భూతిభూషితవిగ్రహమ్. 42

ఫణికంకణభూషాఢ్యం - నాగయజ్ఞోపవీతినమ్,
వ్యాఘ్రచర్మోత్తరీయం చ - విద్యుత్పింగజటాధరమ్. 43

ఏకాకినం చంద్రమౌళిం - వరేణ్య మభయప్రదమ్,
చతుర్భుజం ఖండపరశుం - మృగహస్తం జగత్పతిమ్. 44

అథాజ్ఞయా పురస్తస్య - ప్రణమ్యోపవివేశ సః,
అథాహ రామం దేవేశో - యద్యత్ప్రష్టుమభీచ్ఛసి. 45

త త్సర్వం పృచ్ఛ రామ త్వం - మత్తో నాన్యోఽస్తి తే గురుః.
ఇతి శ్రీపద్మపురాణే శివగీతాయాం సప్తమోఽధ్యాయః.

ఆ పిదప శ్రీరామచంద్రుడు సంతసించినవాడై ఎంత సమయంలో తన కనులు మూసి తెరచునంతలో తన ముందట పర్వత శిఖరముపై వ్యాఘ్రాసనమున ఉపస్థితుడై యున్న

త్రినేత్రుని, పంచముఖుని, నీలకంఠుని వ్యాఘ్రచర్మాంబరధారుని, పైనిండ విభూతిని దాల్చినట్టి జటాధారిని, చంద్రశేఖరుని, అభయహస్తుని ముఖ్యుని చతుర్భుజుని, ఖండపరశు, మృగముల బట్టినవాని లోకైక నాయకుని సర్వవేష్టితుని మహాదేవుని గాంచెను. తదుపరి శ్రీరాముడు నమస్కరించి శివుని యానతి వలన ఆతని ముందట గూర్చుండెను. ఓయీ! శ్రీరామా! నీవే విషయములను బ్రశ్నించెదవో ప్రశ్నించుము, నీకు బోధించే విషయమై నా కంటెను మరొక గురువు లేడు అని యీశ్వరుఁడానతిచ్చెను.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతంబైనశివగీతలో

ఏడవ అధ్యాయము సమాప్తము.

## అష్టమాధ్యాయము

### గర్భోత్పత్త్యాది కథనము

పాంచభౌతికదేహస్య - చోత్పత్తి ర్విలయస్థితిః,
స్వరూపం చ కథం దేహే - భగవన్! వక్తుమర్హసి. 1

పంచభూతై స్సమారబ్ధో - దేహోఽయం పాంచభౌతికః,
తత్ర ప్రధానం పృథివీ - శేషాణాం సహకారితా. 2

జరాయుజోఽండజశ్చైవ - స్వేదజ శ్చోద్భిదస్తథా,
ఏవం చతుర్విధః ప్రోక్తో - దేహోఽయం పాంచభౌతికః. 3

శ్రీరాముడు ప్రశ్నించుచున్నాడు: లింగదేహమునందు పంచభూతములతో గూడిన శరీరమేరీతిగా నేర్పడుచున్నది? దీని స్థితి నాశము లెట్లు గలుగును? సవిస్తారముగా జెప్పుమని శ్రీరాముడు పరమశివుని బ్రశ్నించెను. అందుకు భగవంతుడీ





విధముగా వివరించెను: నీ శరీరము పంచభూతముల చేతనే యేర్పడినది. వాటిలో బ్రధానమైనది భూతత్త్వము. మిగిలిన జలాదులు సహకార భావమును బొందియుండును. ఇట్టి పంచభూతాత్మకంబైన ఈ శరీరము జరాయుజమనియు అండజమనియు, స్వేదజ ఉద్దిజముల వలన బుట్టెడు నీ దేహము నాలుగు రకాలుగా మారినది. అందు నర మృగాదులు జరాయుజములు, స్త్రీ గర్భకోశముల నుండి బుట్టినది. జరాయువనగా స్త్రీ గర్భకోశము, పక్షులు, సర్పములు మొదలగునవి. అండజములు, గ్రుడ్డు పగిలిన పిమ్మట వెలువడునవి, పురుగులు, దోమలు మొదలగునవి స్వేదజములు, చెమట నుండి బుట్టినవి. మఱ్ఱి మొదలగునవి చెట్లు ఉద్భిదములు, ఇవి భూమిని భేదించుకొని బుట్టినవి.

***మానవస్తు పర: ప్రోక్తో - దేవానామేవ స స్మృత:,***
***తత్ర వక్ష్యే ప్రథమత: - ప్రధానత్వా జ్జరాయుజమ్. 4***





*శుక్రశోణితసంభూత - వృత్తిరేవ జరాయుజః,*
*స్త్రీణాం గర్భాశయే శుక్ర - మృతుకాలే విశేద్యదా.* 5

*రజసా యోషితో యుక్తం - తదేవ స్యా జ్జరాయుజమ్,*
*బాహుల్యాద్రజసః స్త్రీ స్యా - చ్ఛుక్రాధిక్యే పుమా న్భవేత్.* 6

*శుక్రశోణితయోస్సామ్యే - జాయతేZథ నపుంసకః,*
*ఋతుస్నాతా భవేన్నారీ - చతుర్థదివసే తతః.* 7

*ఋతుకాలస్తు నిర్దిష్టః - ఆషోడశదినావధి,*
*తత్రాయుగ్మదినే స్త్రీ స్యా - త్పుమా న్యుగ్మదినే భవేత్.* 8

పైన వివరించబడిన దేహముల కంటెను భిన్నమైనది మానస దేహమని మరొకటి గలదు, అది కేవలము దేవతలకు మాత్రమే సంబంధించియున్నది. పురుషార్థసాధన భూతమగుట వలన ప్రధానమైనది గనుక జరాయుజదేహమును మొట్టమొదట





వివరించెదను, వినుము. శుక్రశోణితములనుండి యుద్భవించినదే జరాయుజమనఁబడును. ఋతు సమయంబులో స్త్రీయొక్క గర్భకోశములో శుక్రము ప్రవేశించి స్త్రీయొక్క శోణితముతో గల్సినదైనచో నదే జరాయుజమగును. శుక్రము అధికమైన పురుషుడును, శోణితమధికమైనచో స్త్రీయును, శుక్రశోణితముల సమానత్వమున నపుంసక వ్యక్తి జన్మించును. స్త్రీ ఋతుస్నాతురాలైనది మొదలుకొని పిదప యారు దినముల వరకు ఋతుసమయముగా నిర్దేశించబడినది. అందులో అయిదవదినము మొదలుకొని బేసి దినములు (5-7-9-11-13) ఈ దినములలో రాత్రి భర్తసంగమము గలిగినచో స్త్రీ సంతానమును, స్నానదినము మొదలుకొని సరి దినములు (4-6-8-10-12-14-16) ఈ సరిదినాల రాత్రులందు భర్త సంగమమేర్పడిన యెడల పురుష సంతానము గల్గును.



**షోడశే దివసే గర్భో - జాయతే యది సుభ్రువః,**
**చక్రవర్తీ తదా రాజా - జాయతే న వ సంశయః. 9**

**ఋతుస్నాతా యస్య పుంస - స్సాకాంక్షం ముఖమీక్షతే,**
**తదాకృతి ర్భవే ద్గర్భ స్త త్పశ్యే - త్స్వామినో ముఖమ్. 10**

యువతికి గర్భము ఋతుస్నానము పిదప పదారవ దినమున నిలచిన అప్పుడు జన్మించిన వాడు రాజుగాని రారాజుగాని యెదుగును. (పెరుగును). ఇందించుకయు సందేహము లేదు. యువతి ఋతుస్నానమొనర్చి యే పురుషుని ముఖమును అనురాగముతోఁజూచునో ఆతని యాకారముగానే గర్భమేర్పడును. కనుక యువతి పతి ముఖమునే ఋతుస్నానమునాడు అనగా (ఋతుమతియైన శుచిగాస్నానము గావించిన దినమున) ఉపభోగమొనర్చిన యెడల, విద్యా గంధము లేనివాఁడు వ్రతభ్రష్టుడు,



జాతివిహీనుడు. పరస్త్రీ రతుడు, గొప్పదరిద్రుడునగు పుత్రుడు జన్మించును. కనుక జ్ఞానులు ఋతుస్నాన దినమున యువతితో సంగమమును జేయుట వలదనిరి. కామశాస్త్రము రీత్యా ఆ దినము సంభోగము వలన బుట్టిన వాఁడు ఆయుష్యహీనుడు కాగలడనియాదేశించిరి. 5 వ దినమున ఉత్తమ కన్య 6 దినమున సత్పుత్రుడు 7వ దినమున కన్యను, 8వ దినమున ఐశ్వర్యవంతుడగు పుత్రుడు 9వ దినమున కన్యను, 10వ దినమున ఆచారవంతుడగు పుత్రుడు 11వ దినమున సౌందర్యరాసియగు కన్య12.వ. దినమున దీర్ఘాయుష్మంతుడగు పుత్రుడు, 13వ దినమున నవ్యభిచారిణియగు కూతురు, 14వ దినమున మంచి గుణవంతుడైన పుత్రుడు 15వ దినమున ధర్మజిజ్ఞాసగల సుపుత్రిక, 16.వ దినమున సంపూర్ణమైన జ్ఞానము, ఆయువు, ఐశ్వర్యవంతుడగు రాజువలె నున్న కుమారుని గనును. ఇది ఋతుదిన సంభోగము వలన గలుగు





సంతాన ప్రాప్తియున్న వారికి గలుగు విధానము. 16 దినములు గడచిన తరువాత మైథునేచ్ఛగాని, తత్కారణముగాని జేయుట వృథా యగును. కనుకనే రామాదులు ఋతుదినంబులను వీడి భోగింపక బ్రహ్మచర్యవ్రతు లనిపించుకొనిరి. ఋతుదినములలో మాత్రమే సంభోగించి యితరదినములలో యువతితో సంభోగించనివాఁడు గూడ బ్రహ్మచర్యవ్రతుడని యాదేశింపఁబడినది.

*యా స్త్రీచర్మావృతి స్సూక్ష్మ - జరాయు స్సా నిగద్యతే,*
*శుక్రశోణితయో ర్యోగా - త్తస్మిన్నేవ భవే ద్యతః.* **11**

*తత్ర గర్భో భవే ద్యస్మా - త్తేవ ప్రోక్తో జరాయుజః,*
*అండజాః పక్షిసర్పాద్యా - స్స్వేదజా మశకాదయః.* **12**

*ఉద్భిజ్జా వృక్షగుల్మాద్యాః - మానసాశ్చ మహర్షయః,*
*జన్మకర్మవశాదేవ - నిషిక్తం స్మరమందిరే.* **13**





*శుక్రం రజస్సమాయుక్తం - ప్రథమే మాసి తద్ద్రవమ్,*
*బుద్బుదం కలలం తస్మా - త్తత: పేశీ భవే దిదమ్.* **14**

*పేశీ ఘనం ద్వితీయే తు - మాసి పిండ: ప్రజాయతే,*
*కరాంఘ్రిశీర్షకాదీని - తృతీయే సంభవంతి హి.* **15**

ఏ యువతి యొక్క చర్మావృత వృతము సూక్ష్మముగా నున్నదో దానినే జరాయు (గర్భాచ్ఛాదనరూపమైన తోలు తిత్తి (పేశి) యనబడును.) వని చెప్పుదురు. శుక్రశోణితముల కలయిక వలన గర్భము దానియందే యుత్పత్తి యగును. కనుకనే జరాయువను తిత్తినుండి జన్మించిన గవాదులు జరాయుజములందురు. ద్విజము సర్పాదులు అండజములు, దోమలు మొదలగునవి స్వేదజములు. వృక్షములు పొదలు ఉద్భిజ్జములు సురర్షులు. మానసములు, ముందు జరుగబోవు జన్మకారణ కర్మ వశమున స్త్రీ యోనిలో బ్రవేశించిన శుక్రము





రజతముతో గూడి ప్రథమ మాసమున ద్రవరూపమున నుండును. నీళ్లమాదిరిగా నున్న యా ద్రవము గట్టిపడి తరువాత పేశీకోశాకృతిని ధరించును. రెండవ నెలలో గట్టిపడగానే పిండాకారమును దాల్చును. కరచరణములు (హస్తపాదములు) మస్తకము మొదలగునవి మూడవ మాసమునను, జీవునకు గారణభూతమైన లింగదేహము నాలుగవ మాసమందును గలుగును.

*అభివ్యక్తిశ్చ జీవస్య - చతుర్థే మాసి జాయతే,*
*తత శ్చలతి గర్భోZపి - జనన్యా జఠరే స్వతః.* **16**

*పుత్రశ్చే ద్దక్షిణే పార్శ్వే - కన్యా వామే చ తిష్ఠతి,*
*నపుంసకస్తూదరస్య - భాగే తిష్ఠతి మధ్యమే.* **17**

*అతో దక్షిణపార్శ్వే తు - శేతే మాతా పుమా న్యది,*
*అంగప్రత్యంగభాగాశ్చ - సూక్ష్మా స్స్యు ర్యుగప త్తదా.* **18**



***విహాయ శ్మశ్రుదంతాదీన్ జన్మానంతరసంభవాన్,***
***(ఏషా ప్రకృతిరస్యాస్తు - వికృతి స్సమ్మతా మతా.) 19***

***చతుర్థే వ్యక్తతా తేషాం - భావానామపి జాయతే,***
***పుంసాం స్థైర్యాదయో భావా - భూతత్వాద్యాస్తు యోషితామ్.20***

నాలుగవ మాసములోనే మాతృగర్భమున పిండము తనంతట తానే కదలుచుండును. కుమారుని జననమయ్యేటట్లైతే కుడి ప్రక్కను, స్త్రీ యైన యెడల ఎడమప్రక్క పిండము కదలుచుండును. గర్భము మధ్యభాగములో కదలుచుండిన నపుంసకుడు జన్మించును. తల్లి కుడిప్రక్కమీద పరుండిన కుమారుడు జన్మించును. అట్టి నాల్గవ మాసముననే ఆ పుట్టబోయే శిశువుకు హస్తపాదాద్యంగములు, వేళ్ళు, గోళ్ళును మొదలగు ఉపాంగములు గల్గును. జన్మాంతర జన్యములగు మీసములు, దంతములును మాత్రము అప్పుడు గలుగనేరవు. ఆ నాల్గవ మాసముననే పురుషప్రాణికి స్థిరత్వాదిభావములును,



స్త్రీలకు చంచలత్వాది భావములును ప్రకటమగుచుండును.

*నపుంసకే చ తే మిశ్రా - భవంతి రఘునందన!*
*మాతృజం చాస్య హృదయం - విషయా నభికాంక్షతి. 21*

*తతో మాతుర్మనోఽభీష్టం - కుర్యా ద్గర్భవివృద్ధయే,*
*తాం చ ద్విహృదయాం - నారీ మాహు ర్దౌహృదినీం తతః. 22*

*అదానా ద్దోహదానాం స్యు - ర్గర్భస్య వ్యంగతాదయః,*
*మాతుర్యద్విషయే లోభ - స్తదార్తో జాయతే సుతః. 23*

*ప్రబుద్ధం పంచమే చిత్తం - మాంసశోణితపుష్టతా,*
*షష్ఠేఽస్థిస్నాయునఖర - కేశలోమవివిక్తతా. 24*

*బలవర్ణౌ చోపచితౌ - సప్తమే త్వంగపూర్ణతా,*
*పాదాంతరితహస్తాభ్యాం - శ్రోత్రరంధ్రే పిధాయ సః. 25*

నపుంసకునిలో మిశ్రమ గుణములుండును. ఓ రామా!





తల్లి మనస్సునుండే మనస్సు గలుగును. కనుక తల్లి కోరికలనే కోరుచుండును. అందుచేత మాతృగర్భాభివృద్ధికి మాతృ అభిలాషితములను (ఆకాంక్షలను) దప్పకుండ నెరవేర్చవలయును. తల్లి ఆ సందర్భమున రెండు హృదయములు గలదగును. కావున ఆమెకు దౌహృదిని యను పేరు వచ్చినది. గర్భిణీయువతి యొక్క కోరికలను దీర్చకున్న (దీర్చనిచో) ఆ పుట్టబోయే పిండమునకు అంగలోపత్వము అథవా అంగవైకల్యము (వికలాంగము), అంగహీనత్వము, శక్తిలేమితనము, మందబుద్ధి మొదలగునవి కలుగబోవు సంతానములో పొడసూపును. ఇక అయిదవ మాసమున దెలియబడిన జ్ఞానము గలవాడు, మాంసరక్తముల పుష్టిగలవాడగును, ఆరవ మాసములో ఎముకలు, నరములు, గోళ్ళు వెండ్రుకలు మొదలగు వానియొక్క అభివృద్ధి జరుగును. బలము రంగు గలిగి శరీరము ఏడవ మాసమున అంగము





పరిపూర్ణతతో నుండును. చరణములతో మూయబడిన చేతులతో చెవుల రంధ్రములను మూయబడినవాఁడై యా ప్రాణి (ముందుశ్లోకముతో సంబంధము)

*ఉద్విగ్నో గర్భసంవాసా - దస్తి గర్భభయా న్వితః,*
*ఆవిర్భూతప్రబోధోऽసౌ - గర్భదుఃఖాదిసంయుతః.* 26

*హా కష్టమితి నిర్విణ్ణ - స్స్వాత్మానం శోచతీత్యథ,*
*అనుభూతా మహా సహ్యా - పురోమర్మచ్ఛిదోऽసకృత్.* 27

*కరంభవాలుకా స్తప్తా - పాశ్చాదహ్యంతాఘుఖాశయాః,*
*జఠరానలసంతప్త - పిత్తాఖ్యరసవిప్రుషః.* 28

*గర్భాశయే నిమగ్నం తు - దహం త్యతిభృశం హి మామ్,*
*ఉదర్యకృమివక్త్రాణి - కూటశాల్మ లకంటకైః.* 29

*తుల్యాని చ తుదంత్యార్తం - పార్శ్వాస్థిక్రకచార్దితమ్,*
*గర్భే దుర్గంధభూయిష్ఠే - జఠరాగ్ని ప్రదీపితే,* 30





గర్భవాసముచేత పరాధీనుఁడై భవిష్యద్గర్భనివాస భయముతో గూడియున్నాడు. ఉత్పన్నమైన జ్ఞానముగలవాఁడై గర్భజనిత దుఃఖాదులతో గూడి అక్కటా! దుర్భరమై దుఃఖముతో గూడిన వాఁడై దన యాత్మను గురించి శోకించును. (ఇక్కడ విశేషాంశము సందర్భానుసారముగా వీరశైవ ధర్మసిద్ధాంతము సరిపడును) అయితే వీరశైవ సిద్ధాంతము మేరకు తల్లి గర్భమున నున్న పిండమునకు ఎనిమిదవమాసము ఆ పిండమునకు జ్ఞానోదయ మేర్పడి సహింపరాని నరకబాధచేత పరమాత్ముని గురించి నాకు మళ్ళీ ఇట్టి జన్మను బ్రసాదించకుమని పరమాత్ముని ప్రార్థించుకొనుచుండునని యున్నది ఇట్లే శివగీతలో 7,8 అయుక్తమై యున్నది.

పలుసార్లు మర్మచ్ఛేదకములగు, మరియు భరింపరానట్టియు పాపపూరిత దేహములనుభవించబడెను. మురుమ్మరాలు (పేలాలు) వేఁచెడి ఇసుకలతో తపించబడిన,



అత్యంత కష్టతరమైన నివాసములలో నుంటిని. జఠరాగ్నిచేత బహుగా తపించబడి పిత్తవాతాదిశ్లేష్మ బిందువులు పేశీకోశమున నడిగియున్న నన్ను మిక్కిలి దహింపజేయుచున్నది, కొండబూరుగు ముండ్లతో సమానములైన గర్భస్థక్రిములనోర్లు తల్లి పక్కటెముకలను రంపములతో పీడితుఁడనగు నన్ను మరింత వేధించుచున్నవి, జఠరాగ్ని హోత్రముతో దహింపజేయునని దుర్వాసనతో భరింపరాని గర్భముననే కష్టము నాచేత ననుభవించబడెనో దానికంటెను కుంభీపాక నరకము నాకు తక్కువగా నున్నది.

*దుఃఖం మయాప్తం యత్తస్మా - త్కనీయః కుంభపాకజమ్,*
*పూయాఽసృక్శ్లేష్మపాయిత్వం - వాంతాశిత్వం చ య ద్భవేత్, 31*

*అశుచౌ కృమిభావశ్చ - తత్ప్రాప్తం గర్భశాయినా,*
*గర్భశయ్యాం సమారుహ్య - దుఃఖం యాదృ జ్మయాఽపి తత్. 32*

*నాఽతిశేతే మహాదుఃఖం - నిశ్శేషనరకేషు తత్,*
*ఏవం వ్మరమ్పురా ప్రాప్తా - నానాజాతీశ్చ యాతనాః.* **33**

*మోక్షోపాయమభిధ్యాయ - న్వర్తతేఽభ్యాసతత్పరః,*
*అష్టమే త్వక్ప్రుతీ స్యాతా - మోజ స్తేజశ్చ హృద్భవమ్.* **34**

*శుభ్రమాపీతరక్తం చ - నిమిత్తం జీవితే మతమ్,*
*మాతరం చ పునర్గర్భం - చంచలం త త్ప్రధావతి.* **35**

గర్భములోనుండిన నేను రక్తమయముగా నున్న వస్తువును రక్తమును కఫము (శ్లేష్మము) ను ద్రావఁబడినది. ఉదరములోనున్న (తల్లిదినిన) అన్నమును తినబడినది. విణ్మూత్రములందు క్రిమిత్వమును బొందబడినది. గర్భములో నున్నప్పుడు నేను బొందిన దుఃఖము సమస్త నరకములన్ని యనుభవించిన దానికంటెను అధికమైనది. ఈ ప్రకారముగా మొదట దాను బొందిన యనేక సంకరజాతులను కఠినమైన

సంకష్టములను స్మరించి, నిఖిలమైన దుఃఖాభ్యాసముగలవాడై మోక్షోపాయమును గురించి చింతించుచున్నాడు. అష్టమ మాసమున చర్మమునకు జలనమేర్పడును, హృదయమునుండి ఓజస్సును, తేజస్సును బుట్టును. ఓజస్సనగా శుభ్రమగు రంగు గలది, తేజస్సనగా, కొద్దిగా పచ్చపచ్చగా రక్తవర్ణముతో గూడినది. ఈ రెండును జీవితమునకాశ్రయములుగా నుండును. అదృష్టవశముచేత తల్లి గర్భమును వీడి ఆ యెనిమిదవ మాసమున జన్మించినచో ఓజస్సుతో విడువఁబడి జీవించడు.

*తతో జాతేZష్టమే మాసి - న జీవత్యోజసోజ్ఝితః,*
*కించిత్కాల మవస్థానం - సంస్కారా త్పీడితాంగవత్.* 36

*సమయః ప్రసవస్య స్మా - న్మాసేషు నవమాదిషు,*
*మాతురస్రవహాం నాడీ - మాశ్రిత్యాన్వవతారితా.* 37

*నాభిస్థనాడీగర్భస్య - మాత్రాహారరసావహా,*

*తేన జీవతి గర్భోఽపి - మాత్రాహారేణ పోషితః.* **38**

*అస్థియంత్రవినిష్పిష్టః - పతితః కుక్షివర్త్మనా,*
*మేదోఽసృగ్దిగ్ధసర్వాంగో - జరాయుపుటసంవృతః.* **39**

*విష్ఠామూత్రశదుఃఖార్తో - రుదన్నుచ్చైరధోముఖః,*
*యంత్రాదేవం వినిర్ముక్తః - పతత్యుత్తానశాయ్యుత.* **40**

తొమ్మిదవ మాసమున ప్రసవమునకు సమయమైనప్పటికిన్ని కొంతకాలము బరువు మోయువాడిలా నిలిచియున్నట్లు గర్భమునందే ఉండగలదు. (సామాన్యముగా మూడుతొమ్మిదులు మోయువారి విషయమేమనగా, ఎక్కువ భారమైన కట్టెలు మున్నగు భారమును మోయువాడు అట్లే నిలచిపోయినట్లు నిలచిపోవును. ఇట్లే కొంతకాలము ఎక్కువగా గర్భములో జీవుడుండునని వివరణము) తల్లియొక్క శోణితమును ధరించిన వాడి నాశ్రయించి విస్తరించబడినట్టి



నాభియందున్న తల్లియొక్క ఆహార రసమును వహించు నాడి యేదైతే ఉందో అట్టి తల్లియాహారముతోనే గర్భమందున్న శిశువు పోషించబడును. (ఇక్కడ శిశువు జన్మించె విధానమును వివరించుచున్నాడు.) ఎముకల యంత్రమయమగు యోనినుండి పీడింపఁబడినవాఁడై యదేద్వారమునుండి జరాయు కోశముతోఁజుట్టఁబడి మెదడు రక్తముల చేత మూయబడిన సమస్తావయవ పరిపూర్ణుండై క్రిందబడును. ఇట్లా శిశువు జన్మించిన తరువాత బాల్యాద్యవస్థలను వివరించుచున్నాడు. అధోముఖుడై శోకించుచు మిగుల దుఃఖముతోఁ బీడితుండై ఈ విధముగ యోనియంత్రమునుండి బయలుదేరి క్రిందబడును. మరియు వెల్లకిలబడియుండును.

***ఆకించిత్క స్తదాలోకై - ర్మాంసపేశీవదాస్థితః,***
***శ్వమార్జారాదిదంష్ట్రిభ్యో - రక్షతే దండపాణిభిః.*** **41**





*పితృవద్రాక్షసం వేత్తి - మాతృవద్డాకినీమపి,*
*పూయం పయోవదజ్ఞానా - ద్దీర్ఘకష్టం తు శైశవమ్.* **42**

*శ్లేష్మణా పిహితా నాడీ - సుషుమ్నా యావదేవ హి,*
*వ్యక్తవర్ణం చ వచనం - తావద్వ్యక్తుం న శక్యతే.* **43**

*అత ఏవ హి గర్భేఽపి - రోదితుం నైవ శక్యతే,*
*దృప్తోఽథ యౌవనం ప్రాప్య మన్మథజ్వరవిహ్వలః.* **44**

*గాయత్యకస్మాదుచ్చైస్తు - తథాకస్మాచ్చ వల్గతి,*
*ఆరోహతి తరూన్వేగాచ్ఛాంతానుద్వేజయత్యపి.* **45**

(అట్లు జన్మించినతడు పరి బాల్యాద్యవస్థలను వివరించుచున్నాడు) అథో(క్రింద) ముఖముగలవాఁడై శోకించును మిగుల దుఃఖముతో బీడింవబడినవాడై యోనియంత్రంనుండి బయలుదేరి (విడువబడి-జారి) క్రిందపడి మరల వెల్లకిలబడును. కేవలము మాంసపుముద్ద





మాదిరిగానుండి యేమియు జేయుటకు శక్తిలేక తనవారిచేత కుక్కపిల్ల మొదలగు క్రూర ప్రాణులబారి నుండి రక్షింపబడుచున్నాడు. బాల్యావస్థలో నజ్ఞానిగా యుండుటవలన తండ్రిని రాక్షసునిగాను, తల్లిని రాక్షసిని (రాక్షసాంగనవలె), పాలను పూయముగాను జూచును. కావున బాల్యావస్థ బహుకష్టభూయిష్టమైనది. సుషుమ్నానాడియగు బ్రహ్మానాడి యెంతవరకైతే శ్లేష్మముచేత జుట్టబడియుండునో అంతవరకు నోటినుండి మాటరాదు. (ఇక యౌవనావస్థను వివరించుచున్నాడు) యౌవ్వనవంతుడై కామపరవశుడై సంగీతములు (రాగముల) నాలపించును. అకస్మాత్తుగా దన శక్తిసంపదపై గర్వించును. వృక్షముల పైకిఁబ్రాకును. శాంతులను గష్టబెట్టును. కామ-క్రోధ-మద-మాత్సర్యములతో యుక్తుడై ఒక్కరిని గూడ లెక్కజేయడు.

**కామక్రోధమదాంధస్స - న కాంశ్చిదపి వీక్షతే,**



అస్థిమాంసశిరాలా యా - వామాయా మన్మథాలయే. 46

ఉత్తానపూతిమండూక - పాటితో దరసన్నిభే,
అవక్తస్స్మరబాణార్త - ఆత్మనా దహ్యతేऽనిశమ్. 47

అస్థిమాంసశిరాత్వగ్భ్యః - కిమన్య ద్వర్తతే వపుః,
కామానాం మాయయా మూఢో - న కించి ద్వీక్షతే జగత్.48

నిర్గతే ప్రాణపవనే - దేహే హంత మృగీదృశః,
యథా హి జాయతే - నైవ వీక్షతే పంచషై ర్దినైః. 49

మహాపరిభవస్థానం - జరాం ప్రాప్యాऽతిదుఃఖితః,
శ్లేష్మణా పిహితోరస్కో - జగ్ధ మన్నం న జీర్యతే. 50

విశాలమై దుర్వాసన చేతను, చీల్చబడిన కప్పయొక్క ఉదరము మాదిరిగా నున్న, మరియు నెముకలు, మాంసము, నాడులతో గూడియున్న స్త్రీ యోనియందు అనురాగము గలవాడ్డై కామ్మకార్ముక పీడితుండగు నాత్మ చేత



తపించబడును. ఇట్టి శరీరమున ఎముకలు, మాంసము, నాడులున్న ఈ నాడులు-తోళ్ళకంటె వేరొకటి యేమియు లేదు. అటులున్నను సుందరీమణుల యొక్క మాయచేత తెల్విలేనివాఁడై (వివేకమును గోల్పోయి) లోకమును కొంచెమైనను లెక్కజేయడు, అసువుల బాసిన మీదట యువతులు అయిదారు దినములలో ఏ విధము మారిపోవుదురో మూర్ఖుడగు యువకుడు జూడకున్నాడు. (వంధ్యహి చూచినచో మోహితుడు గాడనియు) (ఇఁక వృద్ధావ్యపు దుఃస్థితిని నిరూపించుచున్నాడు) మిగుల యనాదర స్థానమగు వృద్ధావస్థలో నుండి మిగుల దుఃఖముగలవాడై శ్లేష్మముతో నాక్రమించ బడిన యుదరము గల వాఁడై యుంటవలన నాతడు భుజించిన యన్నము జీర్ణము కాదు.

***వన్నదంతో మందదృష్టిః - కటుతిక్తకషాయభుక్,***
***వాతభుగ్నకటిగ్రీవా - కరోరుచరణోZబలః,*** **51**





*గదాయుతపమావిష్టో - పరిభూతస్వ్యబంధుభిః,*
*నిశ్చాచో మలదిగ్ధాంగ - ఆలింగితవరోషితః. (?)* **52**

*ధ్యాయన్నమలభా వ్యోగా - న్కేవలం వర్తతేZచలః,*
*సర్వేంద్రియక్రియాలోపా - ద్దావ్యతే బాలకైరపి.* **53**

*తతో మృతిజదుఃఖస్య - దృష్టాంతో నోపలభ్యతే,*
*యస్మాద్బిభ్యతి భూతాని - ప్రాప్తాన్యపి పరాం రుజమ్.* **54**

*నీయతే మృత్యునా జంతుః - పరిష్వక్తోZపి బంధుభిః,*
*సాగరాంతర్జలగతో - గరుడేనేవ పన్నగః,* **55**

కదిలిన దంతములు, మందగించిన దృష్టిగలవాడై రోగనివారణమునకై కారము, చేదు, ఒగరు గల వస్తువులను వాడును. వాతముచేత వంగిన నడుము గలిక (కటి) భాగము, కుత్తుక, హస్తములు, తొడలుగలవాడై శక్తిహీనుడగును. మరియు ఈ పలురకాలైన వ్యాధుల చేత గూడికొన్నవాడై, మలముతో



దూషితమైన దేహముగలవాడై, తన వారిచేత దూషితుడై, ఆచారహీనుడై ప్రవర్తించుచుండును. సులభముగా లభించని రుచికరమైన యాహారమును, మెత్తని పడక మొదలగు సుఖములనే గోరుచుండును. అవయవముల కంపనము గలవాడై, సర్వేంద్రియముల శైథిల్యము వలన బాలుర చేతను అవహాస్యమునకు గురియగుచున్నాడు. అనారోగ్యము, ముసలితనము మొదలగువాటివలనను దారిద్ర్యాదులతోడను అనుభవించిన దుఃఖముకంటెను అధికమై యెటువంటి వారికిని భయగ్రస్తుని జేయుచు సామ్యహీనమగుట చేత జావువలన దుఃఖమన్నింటిని మించిన దగును. సముద్రములో తలదాచు కొనియున్న పామునుగూడ గరుడుని రీతిగా ఆత్మీయులచేత జుట్టబడియున్నను (ప్రాణినైనను) మృత్యువుచేత నపహరించబడును.

***హా కాంతే! హా ధనం! పుత్రాః - క్రందమానః సుదారుణమ్,***



**మండూక ఇవ సర్పేణ - మృత్యునా నీయతే నరః. 56**

**మర్మస్వాకృష్యమాణేషు - ముచ్యమానేషు సంధిషు,**
**య ద్దుఃఖం మ్రియమాణస్య - స్మర్యతాం త మ్ముముక్షుభిః. 57**

**దృష్టా వాక్షిప్యమాణాయాం - సంజ్ఞయా హ్రియమాణయా,**
**మృత్యుపాశేన బద్ధస్య - త్రాతా నైవోపలభ్యతే. 58**

**సంరుధ్యమాన స్తమసా - మహ చ్ఛిత్త మివావిశన్,**
**ఉపఘాత స్తదా జ్ఞాతి - వీక్షతే దీనచక్షుషా. 59**

**అయఃపాశేన కాలేన - స్నేహపాశేన బంధుభిః,**
**ఆత్మానం కృష్యమాణం త - మీక్షతే పరిత స్తథా. 60**

ఓసీ ప్రియురాలా! ఓ విత్తమా! ఓయీ! మిత్రులారా! అని పంబోధిస్తూ భయంకరముగా దుఃఖిస్తు మానవుఁడు కప్పను పామువలె మృత్యువు చేత గొనిపోబడును. మర్మస్థానములు ప్రాణవాయుతో వీడిపోవుచుండగా కరచరణాదుల సంధులు





వీడిపోగా మరణము బొందువాని దుఃఖము వర్ణించుట యసాధ్యము కావున మోక్షేచ్ఛులవారిచేత సర్వధా పరమాత్ముడు స్మరింపఁబడుగాక. యమకింకరుల చేత దృష్టియాకర్షించబడి చైతన్యమును గోల్పోయి మృత్యుపాశముతో బంధింపఁబడిన వాడిని గాపాడువాడుండడు. (కనుక అన్ని విపత్తులబారి వలన రక్షించు పరమాత్ముని యెల్లప్పుడు స్మరించవలెను) అజ్ఞానముచేత నాక్రమించబడిన ఆసన్నమరణుడు గొప్ప జ్ఞానమును బొందిన పగిది, బంధువుల చేత బిలువఁబడి దీనత్వముగల చూపులతో, అందరిని అవలోకించును. (మాట్లాడుశక్తిలేమిచేత చూపుతోనే తృప్తినొందును) యముని లోహపుత్రాడుతో గట్టబడిన వాడై, బంధువుల ప్రేమత్రాటిచేత నిరువైపుల లాగబడుచున్న యాత్మను చూచుచుండును. అల్లాంటప్పుడు జ్ఞానమునకు ప్రతిఫలము నిచ్చునది భగవద్ధ్యానమొక్కటే.



హిక్కయా బాధ్యమానస్య - శ్వాసేన పరిశుష్యతః,
మృత్యునా కృష్యమాణస్య - న ఖల్వస్తి పరాయణమ్. 61

సంసారయంత్ర మారూఢో - యమదూతై రధిష్ఠితః,
క్వ యాస్యామీతి దుఃఖార్తః - కాలపాశేన యోజితః. 62

కిం కరోమి? క్వ గచ్ఛామి? - కిం గృహ్ణామి? త్యజామి కిమ్?
ఇతి కర్తవ్యతామూఢః - కృచ్ఛ్రా ద్దేహో త్త్యజత్యసూన్. 63

యాతనాదేహసంబద్ధో - యమదూతైరధిష్ఠితః,
ఇతో గత్వాZనుభవతి - యాయా స్తా యమయాతనాః. 64

తాసు యల్లభతే దుఃఖం - త ద్వక్తుం నహతే కుతః,
కర్పూరచందనాద్యైస్తు - లిప్యతే సతతం హి యత్. 65

భూషణైర్భూష్యతే చిత్రైః - సువస్త్రైః పరివార్యతే,
అస్పృశ్యం జాయతేZప్రేక్ష్యం - జీవత్యక్తం సదా వపుః. 66



ఎక్కిళ్లతో గట్టబడినవాడై, శ్వాసలతో నిండిన, మృత్యువు చేత నాకర్షితుడైన వాడికి రక్షకమైన దేదియులేదు గదా! సంసారయంత్రమున (చక్రమున) అధిష్టించి (ఎక్కి న)న వాడు, యమకింకరులతో నాక్రమించినవాడు, ఎక్కడికి వెళ్ళుదును? ఏమి చేయుదును అని అతీవశోకసంతప్తుడై యమపాశముచేత బంధించబడును. నేనెక్కడికి వెళ్ళుదును, ఏమిచేయుదును, ఏమి గైకొందును, దేనిని విడుతును అని యాలోచిస్తు దానుచేయబోవు పనిలో (కింకర్తవ్యతామూఢుడై) అతి కష్టముతో దన యసువులను వదలును. తరువాత యమయాతనలననుభవించు దేహము గలవాడై యిక్కడినుండి వెళ్ళి యమపురికేగి ఆయా యమయాతనలను బొందును. (యమయాతనలనగా యమపట్టణములోని కష్టములలోని యే ఒక్కదానిని గూడ బేర్కొనుటకు శక్తిజాలమి ఇంక ఆయాతనల దుఃఖముల నెవడు వర్ణింపగలడు? ఏ శరీరమైతే కర్పూర



చందనాదులతో బూయబడుచుండునో చిత్రవిచిత్రమైన యలంకారములచేత నలంకరించబడెనో, విలువైన వస్త్రములతో గప్పబడెనో అలాంటి శరీరము అసువులను బాయగా, ముట్టదగనిది, చూడదగనిదే యగును. ఒక్కక్షణమైనను ఆలస్యము జేయకుండ ఇంటినుండి వెడలింతురు.

*నిష్కాసయంతి నిలయాత్ - క్షణం న స్థాపయంత్యపి,*
*దహ్యతే చ తతః కాష్ఠై - స్తద్భస్మ క్రియతే క్షణాత్.* 67

*భక్ష్యతే వా సృగాలేన - గృధ్రకుక్కురవాయసైః,*
*పునర్న దృశ్యతే సోఽథ - జన్మకోటిశతైరపి.* 68

*మాతా పితా గురుజన స్స్వజనో మమేతి*
*మాయోపమే జగతి కస్య భవే త్ప్రతిజ్ఞా,*
*ఏకో యతో వ్రజతి కర్మపురస్సరోఽయం*
*విశ్రామవృక్షసదృశః ఖలు జీవలోకః.* 69



**సాయం సాయం వాసవృక్షం సమేతాః**
**ప్రాతః ప్రాత స్తేన తేన ప్రయాంతి,**
**త్యక్త్వాzన్యోన్యం తం చ వృక్షం విహంగా**
**యద్వ త్తద్వ జ్జ్ఞాతయోzజ్ఞాతయ శ్చ. 70**

పిదప ప్రాణములఁబాసిన దేహమును కఱ్ఱ (కట్టెలు) తో గాల్చిగాని, లేదా ఖననముజేసిగాని, అథవా నక్క-గ్రద్ద-కుక్క-కాకి-మొదలగువాటితో నా దేహము దినబడును. ఇఁక వందకోట్ల జన్మలకైనను మళ్ళీ గనపడకుండ పోవును. మాయాకల్పితంబైన ఈ ప్రపంచమున తల్లి-తండ్రి-గురువు-స్వజనము మొదలగు ప్రతిజ్ఞ వట్టిదగును, ఎందుచేతననగా స్వకర్మచేత నొక్కడేబుట్టి యొక్కడే పోవును. ఈ జీవలోకము విశ్రాంతి వృక్షముతో సమానమైనది. యెట్లైతే విహంగములు (పక్షులు) ప్రతిసాయంకాలము తమతమ నివాస వృక్షముపైన గలిసియుండి, ప్రతి ప్రాతఃకాలమునందు వృక్షమును వీడి వెళ్ళిపోవునో, అట్లే వాటివలెనే బంధువులు-బంధువులు గానివారు స్వకర్మచేత దమను వీడిపోదురు.





*మృతిబీజం భవేజ్జన్మ - జన్మబీజం భవేన్మృతిః,*
*ఘటయంత్రవ దశ్రాంతో - బంభ్రమీత్యనిశం నరః.* **71**

*గర్భే పుంస శ్శుక్రపాతా - ద్యదుక్తం మరణావధి,*
*తదేతస్య మహావ్యాధే - ర్మత్తో నాన్యోఽస్తి భేషజమ్.* **72**

*ఇతి శ్రీపద్మపురాణే శివగీతాయాం అష్టమోఽధ్యాయః.*

మరణమునకు జననము జననమునకు మరణము కారణములై మానవుడు కుమ్మరివాడి చక్రము మాదిరిగా తిరుగుచుండును. యువతి గర్భములో పురుషుడి రేతఃపతనము మొదలుకొని మానవుని మరణము పర్యంతరముపైన చెప్పబడిన దుఃఖభూయిష్టమైన ఈ సంసారమను రోగమునకు నా ధ్యానమున కంటెను మరో ఔషధము లేదు.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతమగు
శివగీతలో ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.



# నవమాధ్యాయము

## శరీర నిరూపణము

*శ్రీభగవా నువాచ:-*

*దేహస్వరూపం వక్ష్యామి - శృణుష్వాzవహితో నృప,*
*మత్తో హి జాయతే విశ్వం - మయ్యై నైత త్ప్రధార్యతే.* 1

*మయ్యేవేద మధిష్ఠానే - లీయతే శుక్తిరౌప్యవత్,*
*అహం తు నిర్మల: - పూర్ణ స్సచ్చిదానందవిగ్రహ:.* 2

*అసంగో నిరహంకార - శ్శుద్ధం బ్రహ్మ సనాతనమ్,*
*అనాద్యవిద్యాయుక్తస్సన్ - జగత్కారణతాం వ్రజే.* 3

*అనిర్వాచ్యా మహాzవిద్యా - త్రిగుణా పరిణామినీ,*
*రజ స్సత్వం తమశ్చేతి - తద్గుణా: పరికీర్తితా:.* 4



**సత్త్వం శుక్లం సమాదిష్టం - సుఖజ్ఞానాస్పదం నృణామ్.**
**దుఃఖాస్పదం రక్తవర్ణం - చంచలం చ రజో మతమ్. 5**

ఓ రామా! దేహ స్వరూపమును గురించి జెప్పుచున్నాను. అవధానమనస్కుడవై వినుము. ఈ ప్రపంచమంతయు నానుండి సృష్టింపఁబడుచున్నది. నానుండే రక్షింపబడుచున్నది. భ్రాంతికల్పితమైన వెండి ముత్యపు చిప్పవలె ఈ ప్రపంచమంతయు సర్వమునకు నాధారభూతుఁడనైన నాలోనే లయమగుచున్నది. అయినను నేను నిర్మలుఁడను పరిపూర్ణుండను సచ్చిదానంద స్వరూపుండును, సాంగత్యము లేనివాడను అహంకారములేనివాఁడను, సనాతనమగు బ్రహ్మమును, అనాదియగు అవిద్యతోగూడియున్న వాడనై యీ ప్రపంచమంతటికి గారణభూతుఁడనగుచున్నాను. ఇట్టిదని చెప్పుటకుగూడ వీలుపడని గొప్పదగునవిద్య త్రిగుణాత్మకము, పరిణామ స్వరూపము గలిగినది. 1. తమోగుణము,

2. రజోగుణము, 3. సత్వగుణములనియు ఈ మూడు మాయాగుణములని చెప్పఁబడినవి. ఈ మూడింటిలో 1. సత్వగుణము తెలుపు వర్ణము గలది. ఇది మానవులకు సుఖమును, జ్ఞానమును గలుగజేయుచున్నది. రజోగుణము ఎరుపు రంగు గలది, ఇది చంచలమైనది, దుఃఖమును గలుగజేయును.

*తమః కృష్ణం జడం ప్రోక్త ముదాసీనం సుఖాదిషు,*
*అతో మమ సమాయోగా - చ్ఛక్తిస్సా త్రిగుణాత్మికా. 6*

*అధిష్ఠానే చ మయ్యేవ - భజతే విశ్వరూపతామ్,*
*శుక్తౌ రజతవ ద్రజ్జౌ - భుజంగో యద్వదేవ తు. 7*

*ఆకాశాదీని జాయంతే - మత్తో భూతాని మాయయా,*
*తై రారబ్ధ మిదం సర్వం - దేహోzయం పాంచభౌతికః. 8*

*పితృభ్యా మశితా దన్నాత్ - షట్కోశం జాయతే వపుః,*

స్నాయవోzస్థిని మజ్జా చ - జాయంతే పితృతస్తథా. 9

త్వఙ్మాంసశోణితమితి - మాతృతశ్చ భవంతి హి,
భావా స్స్యు ష్షడ్విధా స్తస్య - మాతృజాః పితృజా స్తథా. 10

రసజా ఆత్మజా స్సత్త్వ - సంభూతా స్స్వాత్మజా స్తథా,
మృదవ శ్శోణితం మేదో - మజ్జా ప్లీహా యకృ ద్గుదమ్. 11

తమోగుణము నలుపురంగు గలది. ఇది జడమైనది. సుఖాదుల యందు ఉదాసీనత గలిగియుండును. కనుక త్రిగుణాత్మకమగు మాయాశక్తి నా సంయోగముతో నధిష్ఠాన భూతునైన నాలోనే ముత్తెపుచిప్పలోని వెండివలె, త్రాటియందు పాముభ్రాంతివలె విశ్వస్వరూపం బొందుచున్నది. ఆకాశాది పంచభూతములు మాయచేత నా నుండె బుట్టుచున్నవి. ఈ ప్రపంచమంతయు అట్టి పంచభూతములతోనే ఆరంభింపఁబడినది. ఈ దేహము ఈ పంచభూతముల



చేతనే తయారుచేయబడినది. తల్లిదండ్రులు భుజించిన అన్నమునుండి ఆరుకోశములు గల ఈ శరీరము బుట్టుచున్నది. (తల్లి వలన మూఁడు తండ్రివలన మూఁడు కోశములగుచున్నవి) తండ్రినుండి స్నాయువులు (నరములు) ఎముకలు, మేదస్సు బుట్టుచున్నవి, చర్మము, మాంసము, శోణితము(రక్తము) ఈ మూడును తల్లినుండి బుట్టుచున్నవి, అట్టి దేహమునకు మాతృజములు, ప్రితృజములు, రసజములు, ఆత్మజములు, సత్వసంభూతములు, స్వాత్మజములు అని యారు భావములు గలవు. అందు మృదువులైన, శోణితము, మేదస్సు, మజ్జ, గుల్మము, యకృత్, గుదము(అపానవాయుస్థానము) హృదయం, నాభి, మొ॥ తల్లినుండి బిడ్డకేర్పడును.

**హృన్నాభీత్యేవమాద్యాస్స్యు - ర్భావా మాతృభవా మతాః,**
***శ్మశ్రురోమకచస్నాయు - శిరాధమనయో నఖాః.*** ***12***





*దశవా తృక్ మిత్యాదిష్టిరాః - పితృసముద్భవాః,*
*శరీరోపచితి ర్వర్ణో వృద్ధి - స్తృప్తి ర్బలం స్థితిః.* **13**

*అలోలుపత్వ ముత్సాహ - ఇత్యాదీన్ రసజాన్విదుః,*
*ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం - ధర్మాధర్మౌ చ భావనా.* **14**

*ప్రయత్నో జ్ఞాన మాయుశ్చే - ంద్రియాణీత్యేవమాత్మజాః,*
*జ్ఞానేంద్రియాణి శ్రవణం - స్పర్శనం దర్శనం తథా.* **15**

*రసనం ఘ్రాణ మిత్యాహుః - పంచ తేషాం చ గోచరాః,*
*శబ్దః స్పర్శ స్తథా రూపం - రసో గంధ ఇతి క్రమాత్.* **16**

*వాక్క రాంఘ్రిగుదోపస్థా - న్యాహుః కర్మేంద్రియాణి హి,*
*వచనాదానగమన - విసర్గరతయః క్రమాత్.* **17**

మీసములు మొదలగు ముఖవెంట్రుకలు, శరీరమందలి వెంట్రుకలు, తలవెంట్రుకలు, వపారూపముగల ధాతు విశేషములు, నాడులు, పెద్దనాడులు, గోళ్ళు, ఇంద్రియములు,





ముఖస్థిరమైనది తండ్రినుండి గలుగును. శరీరోత్పత్తిలోని స్థూలత్వము, శ్యామలాదివర్ణము, క్రమాభివృద్ధి, తృప్తి, బలము, యధారీతిగా నుండుట, ఆసక్తిలేకుండుట, ఉత్సాహము మొదలగునవి రసజములని దెలియవలెను. అభిలాష-ద్వేషము, సుఖదుఃఖములు, విధినిషేధములు, స్మృతికి గారణమగు వస్తువు (భావన) యత్నము, జ్ఞానము, ఆయుస్సమయము, ఇంద్రియములు, ఇవి జీవికర్మానుసార జాతములగుట వలన ఆత్మజములనబడును. శ్రవణాదులు జ్ఞానేంద్రియములైదు, శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములు, తన్మాత్రలు, వాక్పాణిపాదపాయోవస్థలు, కరేంద్రియములు, వచనోదానగమన మలత్యాగేంద్రియ సంఖములనునవి తన్మాత్రలు, ఉభయాత్మకము మనస్సు- మనోబుద్ధ్యహంకారములు చిత్తమును అంతఃకరణ చతుష్టయము అని చెప్పఁబడును. వాటిలో-



*కర్మేంద్రియాణాం జానీయా - న్మన శ్చోభయాత్మకమ్,*
*క్రియా స్తేషాం మనో బుద్ధి - రహంకారస్తతః పరమ్, 18*

*అంతఃకరణ మిత్యాహు - శ్చిత్తం చేతి చతుష్టయమ్,*
*సుఖం దుఃఖం చ విషయౌ - విజ్ఞేయౌ మనసః క్రియాః. 19*

*స్మృతిభీతివికల్పాద్యాః - బుద్ధిః స్యాన్నిశ్చయాత్మికా,*
*అహం మమేత్యహంకార - శ్చిత్తం చేతయతే యతః. 20*

స్మృతి -భీతి-వికల్పము-మొదలగునవి, సుఖదుఃఖ సాక్షాత్కారము, మనస్సుచేయు క్రియలు, నిశ్చయాత్మకజ్ఞానము బుద్ధి, నేను, నాదియనునది యహంకారము, ఇంద్రియాగోచరములను దలంపఁజేయునది చిత్తము.

*సత్త్వాఖ్యమంతఃకరణం - గుణభేదా త్త్రిధా మతమ్,*
*సత్త్వం రజ స్తమ ఇతి - గుణా స్సత్త్వాత్తు సాత్త్వికాః. 21*

*ఆస్తిక్యశుద్ధిధర్మైక - రుచిప్రభృతయో మతాః,*



*రజసో రాజసా భావాః - కామక్రోధమదాదయః.* **22**

*నిద్రాలస్య ప్రమాదాది - వంచనాద్యాస్తు తామసాః,*
*ప్రసన్నేంద్రియతారోగ్యా - నాలస్యాద్యాస్తు సత్త్వజాః* **23**

*దేహో మాత్రాత్మక స్తస్మా - దాదత్తే తద్గుణా నిమాన్,*
*శబ్ద శ్శ్రోత్రం ముఖరతా - వైచిత్ర్యం సూక్ష్మతా ధృతిః.* **24**

*బలం చ గగనా ద్వాయో - స్స్పర్శశ్చ స్పర్శనేంద్రియమ్,*
*ఉత్క్షేపణ మవక్షేపా - కుంచనే గమనం తథా.* **25**

*ప్రసారణ మితీమాని - పంచ కర్మాణి రూక్షతా,*
*ప్రాణాపానౌ తథా వ్యాన - సమానోదానసంజ్ఞకాన్.* **26**

*నాగం కూర్మం చ కృకరం - దేవదత్తం ధనంజయమ్,*
*దశైతా వాయువికృతీ - స్తథా గృహ్ణాతి లాఘవమ్.* **27**

నామాంతరము చేత సత్వగుణమని చెప్పఁబడు





అంతఃకరణము, గుణభేదము వలన మూఁడు ప్రకారములు అవియే సత్త్వరజస్తమోగుణములు. సాత్త్వికగుణములు ఏవియనగా: ఆస్తికత్వము, శుభ్రత, ధర్మాసక్తి మొదలగు మంచిగుణములన్నియు సాత్త్వికగుణములు (సత్త్వగుణ జన్యములు) రజోగుణమునుండి రాజసగుణములు అనగా కామ-క్రోధ-మదము మొదలగునవి. మధ్యమగుణములు, నిద్ర-ఆలస్యము (సోమరితనము) ప్రమాదం (జాగ్రత్తలేనిది) వంచించుట ఇవే మొదలగునవి తమోగుణజన్యములు తామసములు. నిర్మలేంద్రియత్వము ఆరోగ్యము, కుశలత, మొదలగునవి పైన బేర్కొనిన సాత్త్వికగుణ జన్యములు. ఈ శరీరము పంచతన్మాత్రాత్మకము, కనుక తద్గుణములనే స్వీకరించును. శబ్దము శ్రోత్రేంద్రియము. మాటలాడుట, పనిలో నిపుణతలాఘవము, ధైర్యము, శక్తి- ఇవి ఆకాశమునుండి లభించును. స్పర్శము, స్పర్శేంద్రియము (చర్మముపైనుండు





స్పర్శేంద్రియమనుట) చాచుట-వంచుట, ముడుచుట, విస్తరింపజేయుట, గమనము, కాఠిన్యము ప్రాణ-అపాన, వ్యాన-ఉదాన, సమానములు అను పంచ మహావాయువులు, నాగము కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము అను పంచోపవాయువులు, తేలికయగుట, ఈ గుణములు వాయువుచేత లభ్యములు.

*తేషాం ముఖ్యతరః ప్రాణో - నాభేః కంఠాదవస్థితః,*
*చరత్యసౌ నాసికయో - ర్నాభౌ హృదయపంకజే.* 28

*శబ్దోచ్చారణనిశ్వాసో - చ్ఛ్వాసాదేరపి కారణమ్,*
*అపానస్తు గుదే మేఢ్రే - కటికంఘోదరేష్వపి.* 29

*నాభికందే వృషణయో - రూరుజానుషు తిష్ఠతి,*
*తస్య మూత్ర పురీషాది - విసర్గః కర్మకీర్తితమ్.* 30

(ఇక వాయుదశకము యొక్క స్థానములను అవి





జేయు (క్రియలవివరణము) పదివాయువులలో ప్రాణవాయువు ప్రధానమైనది. ఇది నాభిమొదల్కొని కంఠము వరకు దాని సంచారస్థానము -నాసారంధ్రముల ద్వారా హృదయపద్మము నందును నాభియందును ప్రవేశించి తిరుగుచుండును. శబ్దోచ్చారణము ఉచ్ఛ్వాస నిశ్వాసములకీ వాయువే ముఖ్యకారణమైనది. గుదము నందును, శిశ్నమందును, కటియందును, పిక్కలందును, కడుపునందును, నాభికందమునందును, గజ్జలయందును, తొడలయందును, ముంజేతులలోను నుండునది అపానవాయువు. మూత్ర పురీష విసర్జన జేయుట దీనిక్రియ.

*వ్యానోఽక్షిశ్రోత్రగుల్ఫేషు - జిహ్వాఘ్రాణేషు తిష్ఠతి,*
*ప్రాణాయామధృతిత్యాగ - గ్రహణా ద్యస్య కర్మచ.* **31**

*సమానో వ్యాప్య నిఖిలం - శరీరం వహ్నినా సహ,*
*ద్విసప్తతిసహస్రేషు - నాడీరంధ్రేషు సంచరన్.* **32**





*భుక్తపీతరసా న్నమ్య - గానయన్ దేహపుష్టికృత్,*
*ఉదానః పాదయోరాస్తే - హస్తయో రంగసంధిషు.* **33**

*కర్మాzన్యదేహోన్నయనో - త్క్రమణాది ప్రకీర్తితమ్,*
*త్వగాదిధాతూ నాశ్రిత్య - పంచ నాగాదయ స్థితాః.* **34**

*ఉద్గారాదినిమేషాది క్షుత్పిపాసాదికం క్రమాత్,*
*తంద్రీప్రకృతిశోకాది - తేషాం కర్మ ప్రకీర్తితమ్.* **35**

(వ్యానము యొక్క స్థానము కర్మను జెప్పుచున్నాడు) చక్షుః శ్రోత్ర జిహ్వాఘ్రాణములందును, గుల్ఫములందును ఉండునది వ్యానవాయువు, దానివని రేచక-పూరక-కుంభకములు, సమాన వాయువు అగ్నితోగూడి శరీర మంతట వ్యాపించి డెబ్బది రెండువేల నాడుల రంధ్రములందును సంచరించుచుండును. తినిన యాహారము యొక్క మరియు త్రావఁబడిన రసపదార్థముల యొక్క సారమును గైకొని శరీర





పుష్టిని క్రమ పద్ధతిలో నుంచును. ఉదాన వాయువు కరచరణముల యొక్క సంధులయందుండును, ఉదానవాయువు కర్తవ్యకర్మయేమనగా శరీరమును లేవనెత్తుట, ఉత్క్రమణము మొదలగునవి. ఇఁకపోతే ఉపవాయువులగు నాగాదుల స్థితిని దెల్పును, ఇవి చర్మమందునున్న త్వగింద్రియములోను, మాంసమునందును, రక్తములోను ఎముకలయందును, క్రొవ్వునందును, నరములందును వ్యాపించియుండును. ఎక్కిళ్ళు, వాంతి, మొదలగునవి నాగవాయుగుణములు, కన్నులు మూయుట, తెరచుట, చూచుట మొదలగునవి కూర్మవాయుగుణములు, ఆకలి, దాహము, తుమ్ముట మొదలగునవి కృకర వాయుగుణములు. అలసత్వము, నిద్ర-అనవహితత్వము మొదలగునవి దేవదత్త వాయుగుణములు ప్రకృతిచేత (సహజముగా స్వాభావికముగా) దుఃఖించుట, నవ్వుట మొదలగునవి ధనంజయ వాయు గుణములు.



అగ్నేస్తు రోచకం రూపం - దీప్తిం పాకం ప్రకాశతామ్,
అమర్షతీక్ష్ణసూక్ష్మాణా - మోజ స్తేజశ్చ శూరతామ్. 36

మేధావితాం తథాzzదత్తే - జలాత్తు రసనం రసమ్,
శైత్యం స్నేహం ద్రవం స్వేదం - గాత్రాదిమృదుతామపి. 37

భూమేzర్ఘ్రాణేంద్రియం గంధం - స్థైర్యం ధైర్యం చ గౌరవమ్,
త్వగసృఙ్మాంసమేదోzస్థి - మజ్జాశుక్రాణి ధాతవః. 38

అన్నం పుంసాzశితం త్రేధా - జాయతే జఠరాగ్నినా,
మలం స్థవిష్ఠో భాగస్స్యా - న్మధ్యమో మాంసతాం వ్రజేత్.39

మనః కనిష్ఠో భాగస్స్యా - త్తస్మా దన్నమయం మనః.
అపాం స్థవిష్ఠో మూత్రం స్యా - న్మధ్యమో రుధిరం భవేత్.40

(తేజస్సు వలన గలిగే ప్రయోజనములను వివరించుచున్నాడు). కాంతివంతమగు రూపము. దీప్తి-జీర్ణశక్తి-శాంతి-కోపము-తైక్ష్ణము,సూక్ష్మత్వము, శక్తి తేజస్సు, కార్యము,



ఈ గుణములన్నియు అగ్నివలన గ్రహించుచున్నాడు. మరియు తేజస్సు నుండి మేధాశక్తి లభించును. ఇక జలగుణములను వాకొనుచున్నాడు. రసనేంద్రియము (నాలుక) రసము, స్నేహము, శీతలత్వము, ద్రవము, చెమట, శరీర మృదుత్వము మొదలగునవి జల లభ్యములు. ఇఁకపోతే భూమివలన గ్రహింపఁదగు గుణములను బేర్కొనుచున్నాడు. గంధము, స్థిరత్వము, ధైర్యము, గురుత్వము, (బరువు) త్వక్కు, మాంసము, రక్తములు, మెదడు, ఎముక, క్రొవ్వు, శుక్రము, నాడులు, భూమినుండి లభించును. ప్రాణులచేత దినఁబడిన యన్నము, మూడు భాగములుగా జఠరాగ్నివలన నిర్మింపఁబడును. అందులో స్థూలభాగము మలము, మధ్యభాగము మాంసము.
అందులో స్థూలభాగము మలము, మధ్యభాగము మాంసము.
తేలికభాగము మనస్సు. కావుననే మనస్సు అన్నమయము. ఉదకమున స్థూలభాగము మూత్రము. మధ్యభాగము రక్తము, తేలికభాగము ప్రాణముగాను మారుచుండును. కనుకనే జలమయము ప్రాణమందురు.





*కనిష్ఠభాగః ప్రాణస్స్యా - త్తస్మాత్ప్రాణో జలాత్మకః,*
*తేజసోZస్థి స్థవిష్ఠ స్స్యా - న్మజ్జామధ్యసముద్భవా.* **41**

*కనిష్ఠా వాఙ్మతా తస్మా - త్తేజో Zబన్నాత్మకం జగత్,*
*లోహితా జ్జాయతే మాంసం మేదో - మాంససముద్భవమ్.42*

*మేదసోZస్థీని జాయంతే - మజ్జా చాZస్థిసముద్భవా,*
*నాడ్యోZపి మాంససంఘాతా - చ్ఛుక్రం మజ్జాసముద్భవమ్.* **43**

*వాతపిత్తకఫాశ్చాత్ర - ధాతవః పరికీర్తితాః,*
*దశాంజలిజలం జ్ఞేయం - రసస్యాంజలయో నవ.* **44**

*రక్తస్యాష్టౌ పురీషస్య - సప్త హి శ్లేష్మణశ్చ షట్,*
*పిత్తస్య పంచ చత్వారో - మూత్రస్యాంజలయస్త్రయః.* **45**

*వసాయా మేదసో ద్వౌ తు - మజ్జాత్వంజలిసమ్మితః,*
*అర్ధాంజలి తథా శుక్రం - తదేవ బలముచ్యతే.* **46**





జలములోని సూక్ష్మభాగము ప్రాణముగా మారును, కనుక ప్రాణము జలమయమని చెప్పబడును. (జలంనామ జీవనందనం, అమరకోశములోనున్నది) తినబడిన అగ్నియందలి స్థూలభాగము ఎములకుగాను, మధ్యభాగము ఎముకలలోని గుజ్జుగాను మారును. వహ్నిలోని సూక్ష్మభాగము వాక్కుగాను మారుటచేత ఈ వాక్కును తేజోమయమందురు. కనుక ప్రపంచమంతయు తేజస్సు జలమయముగానుండును. రక్తము వలన మాంసము, దానినుండి మెదడు బుట్టును. అట్టి మేదస్సునుండి యెముకలు, ఆ ఎముకల నుండి క్రొవ్వు బుట్టును. దేహమందలి మాంసముతో నాడులు బుట్టును. ఆ క్రొవ్వునుండి వీర్యము గలుగుచున్నది. వాతము, పిత్తము, కఫము ఈ మూడు ధాతువులుగా జెప్పబడినవి. ఈ దేహములోని జలము పదిదోసిళ్ళ పరిమాణము సరము తొమ్మిది దోసిళ్ళుగా చెప్పఁబడినది. రక్తము ఎనిమిది, మలము ఏడు, శ్లేష్మము ఆరు. పిత్తము ఐదు, మెదడు రెండు, క్రొవ్వు, శుక్రము అరదోసిలి సమానముగా నుండును. ఈ శుక్రమే బలము అని చెప్పబడును.





అస్థ్నాం శరీరే సంఖ్యా స్యాత్ - షష్టియుక్తం శతత్రయమ్
జలజాని కపాలాని - రుచకాస్తరణాని చ. 47

నలకానీతి తాన్యాహు: - పంచధాZస్థీని సూరయః,
ద్వే శతే త్వస్థిసంధీనాం - స్యాతాం తత్ర దశోత్తరే. 48

రౌరవా: ప్రసరాస్స్యంద - సేచనాస్స్యురులూఖలాః,
సముద్రా మండలా శ్శంఖా - వర్తా వాయసతుండ కాః. 49

ఇ త్యష్టధా సముద్దిష్టా - శ్శరీరేష్వస్థిసంధయః,
సార్ధకోటిత్రయం రోమ్ణాం - శ్మశ్రుకేశా స్త్రిలక్షకాః. 50

శరీరములో మూఁడువందల అరువది (360) ఎముకలుండును. అవి జలములు, కపాలములు, రుచకములు, తరణములు, మరియు నలకములనియు, జ్ఞానులు జెప్పుదురు. ఐదు విధములుగాను చెప్పుదురు. ప్రతిశరీరములోను రెండువందల పది యెముకల సంధులుండును. ఇట్టి





అస్థిసంధులు రౌరవములు, ప్రసరములు, స్కందసేచనములు, ఉలూఖలములు. సముద్రములు, మండలములు, శంఖావర్తములు, వాయసమండలముల, అని యెనిమిది రకాలుగా చెప్పఁబడును. ఈ దేహమునందు మూఁడు కోట్ల ఏబది లక్షలు(3,50,00,000) వెంట్రుకలుండును. తల వెంట్రుకలు, మరియు మీసముల వెంట్రుకలు మూడు లక్షలు (3,00,000) ఉండును.

*దేహస్వరూపమేవం తే ప్రోక్తం దశరథాత్మజ,*
*తస్మా దసారో నాస్త్యేవ - పదార్థో భువనత్రయే.* **51**

*దేహేఽస్మి న్నభిమానేన - న మహోపాయబుద్ధయః,*
*అహంకారేణ పాపాని - క్రియంతే హంత సాంప్రతమ్,*
*తస్మా దేతత్స్వరూపం తు - విబోద్ధవ్యం మనీషిణా.* **52**

ఇతి శ్రీపద్మ పురాణాంతర్గత శివగీతాయాం నవమోఽధ్యాయః.





ఓయీ రామా! నీకు ఈ శరీరము యొక్క స్వరూపమును సంపూర్ణము వివరించితిని. మూఁడు లోకములలోను ఈ దేహముకంటెను హీనమైనదే వస్తువు లేదు సుమా! గొప్ప తెలివి (బుద్ధి) నిపుణతగల జ్ఞాన సంపన్నులు గూడ ఇట్టి సారములేని శరీరము పట్ల మిగుల అభిమానము వలన అహంకారులై పాప కర్మల నాచరింతురు. కనుక జ్ఞానులైన వారు ఇట్టి హేయమైన దేహనిజస్వరూపమును సంపూర్ణముగా దెలిసికొనవలెను. (శరీరాభిమానమును వీడి ఆత్మానురక్తిని బెంచుకొనదగునని భావము.)

ఇట్లు ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును, శ్రీ శివ రామ, సంవాద (ప్రశ్నోత్తర) రూపాత్మకమగు శ్రీ శివగీతలో శరీర నిరూపణమను తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.



# దశమాధ్యాయము

## జీవస్వరూప నిరూపణము

శ్రీరామ ఉవాచ:-

*భగవన్! కుత్ర జీవోఽసౌ - జంతోర్దేహేఽవతిష్ఠతే,*
*జాయతే వా కుతో జీవః - స్వరూపం వాఽస్య కిం వద.* **1**

*దేహాంతే వా కుత్ర యాతి - గత్వా వా కుత్ర తిష్ఠతి,*
*కథ మాయాతి వా దేహం - పున ర్నాయాఽఽతి వా వద.* **2**

*సాధు పృష్టం మహాభాగ! - గుహ్యా ద్గుహ్యతరం హి యత్,*
*దేవైరపి సుదుర్జ్ఞేయ - మింద్రాద్యైర్వా మహర్షిభిః.* **3**

*అన్యస్మై నైవ వక్తవ్యం - మయాపి రఘునందన!*
*త్వద్భక్త్యాఽహం పరం ప్రీతో - వక్ష్యా మ్యవహితశ్శృణు.* **4**

*సత్యజ్ఞానాత్మకోఽనంతః - పరమానందవిగ్రహః,*





**పరమాత్మా పరంజ్యోతి - రవ్యక్తో వ్యక్తకారణమ్. 5**

శరీర స్వరూపమును దెలిసికొని జీవుని గురించి విషయమును దెలిసికొనుటకై రాముఁడు పునఃప్రశ్నించు చున్నాడు. ఓయీ భగవంతుడా! మహామహిమగల ఈ దేహమందు పరోక్షుడ (కనులకు అగుపడని) గు జీవుడుంటున్నాడా? జన్మించుచున్నాడా? జీవుడను బేరెట్లు వచ్చినది? ఈ జీవత్వమనునది స్వాభావికమా? అజ్ఞానముతో గూడియున్నదా? జీవుని స్వరూపమెట్టువంటిది? అది జ్ఞానాత్మకమా? తద్విరుద్ధమా? దేహస్వరూపమును గురించి యెట్లు వచ్చును? లేదా రాదా? అదంతయూ సవిస్తారముగా నాకు బోధించుమనెను.

శ్రీభగవంతుఁడుపదేశించెను:- మిగుల రహస్యమగు నిది యింద్రాది దేవతలచేతను గూడ తెలియదగినది కాదు. నీయందలి భక్తిచేత బ్రసన్నుండనై చెప్పుచున్నాను.



అవధానమనస్కుండవై వినుము. దీనిని పరవారలకు దెలుపదగదు. ప్రతిబింబరూపుడగు జీవుని స్వరూపమును దెలిసికొనుటకు మొట్టమొదట బింబరూపుగు పరమేశ్వర జ్ఞానమును గురించి తప్పకుండ తెలిసికొని బింబమానము నాదేశించుచున్నాడను.

నిత్యో విశుద్ధ స్స ర్వాత్మా - నిర్లేపోzహం నిరంజనః,
సర్వధర్మవిహీనశ్చ - న గ్రాహ్యో మనసాzపి చ. 6

నాహం సర్వేంద్రియగ్రాహ్యః సర్వేషాం గ్రాహకో హ్యహమ్,
జ్ఞాతాzహం సర్వలోకస్య - మమ జ్ఞాతా న విద్యతే. 7

దూర స్సర్వవికారాణాం - పరిణామాదికస్య చ,
యతో వాచో నివర్తంతే - అప్రాప్య మనసా సహ. 8

ఆనందం బ్రహ్మ మాం జ్ఞాత్వా - న బిభేతి కుతశ్చన,
యస్తు సర్వాణి భూతాని - మయ్యే వేతి ప్రపశ్యతి. 9



***మాం చ సర్వేషు భూ తేషు - తతో న విజుగుప్సతే,***
***యస్య సర్వాణి భూతాని - హ్యాత్మైవాఽభూద్విజానతః. 10***

నేను శాశ్వతుడను, నిర్మలుండను, అందరి యంతరంగమున నున్నవాడిని, సమస్త స్వరూపుడను. వృద్ధిని బొందువాడిని, క్రియా శూన్యుడను, సర్వధర్మరహితుడను మనస్సున కగోచరుడను. సమస్తేంద్రియములతో నగ్రాహ్యుడను, సర్వమును గ్రహించువాడిని, సర్వలోకములను దెలిసికొన్న వాడిని, నన్నెవరును దెలియని (గుర్తించని) వాడిని, పరిణామాది వికారరహితుడను, నన్ను వివరించుటలో నే వేదములైతే మనస్సుతో గూడ గుర్తించలేక మౌనమును వహించునో అటువంటి యానందమయుడనగు పరబ్రహ్మనైన నన్ను దెలిసికొనిన వాఁడెక్కడను భీతిల్లడు. సమస్త ప్రాణులు నాయందే యున్నవని మదాత్మగాదలచునో నన్నన్ని ప్రాణులయందు వానినిగా నెవ్వడైతే దెలిసికొనునో అట్టివాడు సమస్త





ప్రాణులనుండి దనను రక్షించుకొనదలఁచినవాడుఁకాడు. సమస్త ప్రాణులు నాపరమాత్మయేనని దెలిసికొనునట్టి, ఐక్యమునే జూచునట్టి వాడికి మోహశోకము లెట్లు గలుగును?

*కో మోహ స్తత్ర క శ్శోక - ఏకత్వ మనుపశ్యతః,*
*ఏష సర్వేషు భూతేషు - గూఢో ऽऽత్మా న ప్రకాశతే.* 11

*దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా - సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః,*
*అనాద్యవిద్యయా యుక్త - స్తథాప్యేకో ऽహ మవ్యయః.* 12

*అవ్యాకృతబ్రహ్మరూపో - జగత్కర్తా మహేశ్వరః,*
*జ్ఞానమాత్రే యథా దృశ్య - మిదం స్వప్నే జగత్త్రయమ్.* 13

*తద్వ న్మయి జగ త్సర్వం - దృశ్యతే ऽస్తి విలీయతే,*
*నానావిద్యానమాయుక్తో - జీవత్వేన వసామ్యహమ్.* 14

*పంచ కర్మేంద్రియాణ్యేవ - పంచ జ్ఞానేంద్రియాణి చ,*
*మనో బుద్ధి రహంకార - శ్చిత్తం చేతి చతుష్టయమ్.* 15





ఇట్టి పరమాత్ముడు సమస్తప్రాణులలోను గుప్తముగానుండి అదృశ్యముగా నుండును. సూక్ష్మముగా బరిశీలించి జూచువారికి బ్రహ్మము నెఱింగిన సూక్ష్మదర్శులకు మాత్రమే జూడబడును. సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యుడనగు నేను మాత్రము అనాదియగు నజ్ఞానము చేతనన్నాక్రమించియున్నవాడనైనా మరూపానభివ్యక్త మగు బ్రహ్మరూపుడగు సృష్టికర్తనగుచున్నాను. స్వప్నములో నీ మూఁడు లోకములు అజ్ఞానముచేత ప్రత్యక్షజ్ఞానమున గల్పింపబడుచున్నట్లుగా ఈ లోకమంతయు నాలోనే అగుపడుచున్నది. ఉన్నది, లయమగుచున్నది.

రాముడు ప్రశ్నించుచున్నాడు: పైన నేను బ్రశ్నించిన వాటిలోని జీవుని సంగతి రానేలెదే, అని ప్రశ్నింపగా, జీవునిగురించి వివరిస్తూ అజ్ఞానముతోఁగూడి నేనే జీవుఁడను





వ్యవహారముతో జీవుని లక్షణములను వివరించి దానికి జన్మలేదని చెప్పి అజ్ఞాన కర్మబంధమునుండి విడుదలై ఒక జీవునికి ముక్తియైన యెడల యనేకప్రాణులకు ముక్తిశూన్యమని చెప్పి అజ్ఞానము నశించుటే అసలైన ముక్తియని వివరించి సుమారుగా ప్రశ్నలకు సమాధానమిచ్చి లోకాంతర గమనాగమనముల గురించిన ప్రశ్నలలో లింగదేహము విడుదలయ్యేవరకుప్రాణికయ్యెద సాధ్యపడదని యానతిచ్చి లింగదేహము సందర్భమురాగ అట్టి లింగదేహమును గురించి యాదేశించుచున్నాడు. ఈ లింగశరీరము పాపపుణ్యముల ననుభవించుటకై మన దేహమునందు చిన్నదిగా నిమిడి యుండును. ఇది యేయే వస్తువులతో నిర్మింపబడినదనగా పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, మనోబుద్ధి యహంకార చిత్తములు, పంచమహావాయువులును, ఇట్లు ఈ పందొమ్మిది వస్తువులు గల్సి లింగశరీరమగును.





*వాయవః పంచ మిళితాః - యాంతి లింగశరీరతామ్,*
*తత్రాఽవిద్యాసమాయుక్తం - చైతన్యం ప్రతిబింబితమ్.* 16

*వ్యావహారికజీవస్తు - క్షేత్రజ్ఞః పురుషోఽపి చ,*
*స ఏవ జగతాం భోక్తా - ఽనాద్యయోః పుణ్యపాపయోః.* 17

*ఇహాముత్రగతి స్తస్య - జాగ్రత్స్వప్నాదిభోక్తృతా,*
*యథా దర్పణమాలిన్యా - ద్దృశ్యతే మలినం ముఖమ్.* 18

*తద్వ దన్తఃకరణగై - ర్దోషై రాత్మాఽపి దృశ్యతే,*
*పరస్పరాధ్యాసవశా - త్స్యా దన్తఃకరణాత్మనోః.* 19

*ఏకీభావాభిమానేన - పరాత్మా దుఃఖభాగివ,*
*మరుభూమౌ జలత్వేన - మధ్యాహ్నార్కమరీచికాః.* 20

ఆ లింగ దేహమునందు అజ్ఞాన సంపర్కమున్నవాడై భగవంతుని యాత్మప్రతిబింబితమైన చైతన్యమును బొంది, క్షేత్రజ్ఞుఁడనియు, పురుషుడనిగాని వ్యవహారిక జీవుడగు





పరమాత్ముఁడుండును. అతడె యనాదియగు పుణ్య-పాపముల ఫలభోక్తయగును. ఇహపరముల గతియు జాగ్రదాద్యవస్థల భోక్తృత్వము నాయనకే జెందును. అంతఃకరణ దోషములతో నాత్మ దోషిగా గనుపడును. అద్దము మలినముగా నుండిన యెడల మన ముఖాలుగూడ మలినముగా నగుపడుచున్నవి గదా! ఆత్మాంతఃకరణముల యొక్క అన్యోన్యముగా తదాత్మ్యాధ్యాసవశమున నైక్యాభిమానముతో పరమాత్ముడు గూడ దుఃఖమునే యనుభవించుచున్నవాడి పగిది యుండును కాని యది నిజమైనది గాదు. ఎడారిలో ఎండమావులు భూమియందు నీరువలె భాసించును. అజ్ఞానియైనవాఁడది నీరుగాదని తెల్సికొని, అట్టి ఎండమావులెన్నటికిని చల్లటివిగావు, మరింతగా తాపమునే గల్గించును.

*దృశ్యంతే మూఢచిత్తస్య - న హ్యార్ద్ర స్త్రావకారకః,*
*తద్వదాత్మాzపి నిర్లేపో - దృశ్యతే మూఢచేతసామ్.* **21**



*స్వావిద్యాఖ్యాత్మదోషేణ - కర్తృత్వాదికధర్మవాన్,*
*తత్ర చాన్నమయే పిండే - హృది జీవోఽవతిష్ఠతే.* 22

*ఆనఖాగ్రం వ్యాప్య దేహం - త ద్భువేఽవహితశ్శృణు,*
*పురీతదభిధానేన - మాంసపిండో విరాజతే,* 23

*నాభేరూర్ధ్వమధః కంఠా - ద్వ్యాప్య తిష్ఠతి య స్సదా,*
*తస్య మధ్యేఽస్తి హృదయం - సనాలం పద్మకోశవత్.* 24

*అధోముఖం చ తత్రాస్తి - సూక్ష్మం సుషిరముత్తమమ్,*
*దహరాకాశ మిత్యుక్తం - తత్ర జీవోఽవతిష్ఠతే.* 25

మూర్ఖులకు నిర్లేపుడైన యాత్మ తన యజ్ఞానమూలకమైన యాత్మదోషము వలన కర్తృత్వాదిక ధర్మములు గల వాడివలె గోచరించును. అందులోను అన్నాత్మకమగు స్థూల శరీరములో నఖశిఖ పర్యంతము వ్యాపించి

జీవుడు హృదయమందుండును. దత్తచిత్తుడవై యాలకింపునే చెప్పే విషయమును, నాభికి పైన, కంఠమునకు దిగువ, పురీతన్నామకమైన మాంసపిండమొకటి గలదు. అది సదాప్రకాశించుచుండును. అట్టి మాంసపిండము మధ్యన క్రిందు ముఖముగలదై కాడతో గూడి కమలము పగిది హృదయ ముండును. ఆ దానిలో నొక సూక్ష్మమగు నుత్తమమైన రంధ్రముండును. అది ప్రాణమునకు (జీవునికి) నివాసస్థానము, దీనినే దహరాకాశమందురు.

*వాలాగ్రశతభాగస్య - శతధా కల్పితస్య చ,*
*భాగో జీవ స్స విజ్ఞేయః - స చానన్త్యాయ కల్పతే,* **26**

*కదంబకుసుమోద్బుద్ధ - కేసరా ఇవ సర్వతః,*
*ప్రసృతా హృదయాన్నాడ్యో - యాభి ర్వ్యాప్తం శరీరకమ్.* **27**

*హితం బలం ప్రయచ్ఛన్తి - యస్మా త్తేన హితాః స్మృతాః,*
*ద్వాసప్తతిసహస్రైస్తా - స్సంఖ్యాతా యోగవిత్తమైః.* **28**

హృదయాఽత్తాస్తు నిష్క్రాంతా - యథా ర్కాద్రశ్మయ స్తథా,
ఏకోఽత్తరశతం తాసు - ముఖ్యా విష్వగ్వినిర్గతాః. 29

ప్రతీంద్రియం దశ దశ - నిర్గతా విషయోన్ముఖాః,
నాద్యః కర్మాదిహేతూత్థాః - స్వప్నాదిఫలభుక్తయే. 30

వెంట్రుక యొక్క కొసభాగమును నూరుభాగములుగా జేసి అందును నొక భాగమును మరో నూరుభాగములు జేసిన అందొక దాని యంశ పరిమాణము గలిగి జీవుడుండును. అట్టి జీవుడే యనంతు డపరిఛిన్నుడని వాకొందురు. కడిమి పువ్వులో ఆవరించుకొనియున్న కింజల్కములవలె వక్షమునుండి శరీరమంతటను నాడులు వ్యాపించుకొని యుండును, హితమును శక్తిని ఒసగునవి గనుక హృదయనాడులు డెబ్బదిరెండువేలుగా గణింపఁబడినవి. వాటిలో నూటొక్కటి నాడులు ప్రధానములు, అవి సూర్యునినుండి కిరణములవలె హృదయమునుండి అంతట వ్యాపించి వెలువడినవి. కర్మము, అదృష్టము, వీటిననుసరించి పుట్టిననాడులు స్వప్నాది

ఫలానుభవము కొరకు ప్రతీంద్రియమునుండి పదిపదిగా విషయాభిముఖములై బయల్దేరుచుండును.

*వహన్త్యంభో యథా నద్యో - నాడ్యః కర్మఫలం తథా,*
*అనంతైకోర్ధ్వగా నాడీ - మూర్ధపర్యంత మంజసా.* 31

*సుషుమ్నేతి సమాదిష్టా - తయా గచ్ఛన్విముచ్యతే,*
*తత్రావస్థితచైతన్యం - జీవాత్మానం విదుర్బుధాః.* 32

*యథా రాహు రదృశ్యోzపి - దృశ్యతే చంద్రమండలే,*
*తద్వ త్సర్వగతోzప్యాత్మా - లింగదేహే హి దృశ్యతే.* 33

*యథా ఘటే నీయమానే - ఘటాకాశోzపి నీయతే,*
*తద్వ త్సర్వగతోzప్యాత్మా - లింగదేహే వినిర్గతే.* 34

*నిశ్చలః పరిపూర్ణోzపి - గచ్ఛతీత్యుపచర్యతే,*
*జాగ్రత్కాలే తథా జ్ఞోzయ - మభివ్యక్తవిశేషధీః.* 35



నదులు నీటిని గలిగి యున్నట్లుగా ఈ నాడులు కర్మఫలమును బొందియున్నవి. ఈనూటయొక్క నాడులలో నొకటి శిరస్సువరకు ఎడతెగకుండ విస్తరించియుండును. దానినే సుషుమ్నానాడి యందురు. ఆ నాడిద్వారా జీవము (ప్రాణము) పోయినవాడు ముక్తిని బడయును. అక్కడ స్థిరపడియున్న చైతన్యమే జీవుడని పెద్దలందురు. రాహుగ్రహమెట్లు అగోచరుడై చంద్రునిలో నగుపడుచున్నాడో, అట్లే సర్వగతుడైన యాత్మగూడ లింగ శరీర సంబంధముతో గన్నులకగుపడును. కుండను దీసికెళ్ళుచుండగా తద్గతమైన ఘటాకాశమును గొనిపోవునట్లెన్నబడునో అట్లే అంగ శరీరము నిర్గమించుటచేత సర్వగతుడైన మరియు నిర్మలుండైన పరిపూర్ణుండగు నాత్మగూడ వెళ్ళుచున్నాడని భావించబడును.

నిజముగా నిష్క్రియుడగు యా జీవుడు జాగ్రదవస్థయందు జ్ఞానవంతుడై బుద్ధీంద్రియస్ఫూర్తి గలిగి



సూర్యుడు దశదిశలరీతిగా సమస్త వస్తువులందును వ్యాపించియున్నాడు.

వ్యాప్నోతి నిష్క్రియ స్సర్వాన్ - భాను ర్దశ దిశో యథా,
నాడీభి ర్వృత్తయో యాన్తి - లింగదేహసముద్భవాః. 36

తత్తత్కర్మానుసారేణ - జాగ్రద్భోగోపలబ్ధయే,
ఇదం లింగశరీరాఖ్య - మామోక్షం న వినశ్యతి. 37

ఆత్మజ్ఞానేన నష్టేఽస్మి - న్నావిద్యే సశరీరకే,
ఆత్మస్వరూపావస్థానం - ముక్తిరి త్యభిధీయతే. 38

ఉత్పాదితే ఘటే యద్వ - ద్ఘటాకాశత్వ మృచ్ఛతి,
ఘటే నష్టే యథాకాశం - స్వరూపేణావతిష్ఠతే. 39

జాగ్రత్కర్మక్షయవశా - త్స్వప్నభోగ ఉపస్థితే,
బోధ్యావస్థాం తిరోధాయ - దేహాద్యాశ్రయలక్షణామ్. 40



కర్మానుసారముగ జాగ్రదవస్థలో ఫలానుభవమునకై లింగశరీరమునుండి యుప్పతిల్లినవై (పుట్టి) వృత్తులు నాడులతోఁ జేరి బయల్దేరును. ఇట్టి లింగశరీరము ముక్తి పర్యంతము నశించదు. తత్వజ్ఞానముచేత నీ లింగదేహము అజ్ఞానముతో గూడి నశించినయెడల ఏ కైవల్యావస్థ యున్నదో అదే ముక్తియనఁబడును. ఘటము (కుండ) పుట్టడముతోనే ఘటగత ఆకాశముబుట్టియుంది నశించడంతోడనే ఆకాశము స్వస్వరూపములో లీనమగునట్లు ముక్తాత్మగూడ దన స్వపాన్నిబడయును. జాగ్రదవస్థలో కర్మము క్షీణించుటచేత స్వప్నసంబంధమైన ఫలము లభించగా జ్ఞానావస్థను మరుగుపరచి మళ్ళీ స్వప్నావస్థను బడసి జ్ఞానావస్థల కర్మలచేత మనస్సునకు దీసికొని వచ్చిన సంస్కారముగల వాడై స్వప్నములో ఫలానుభవేచ్ఛచేత తనమాయచేత దానే మాయావంతుడై గారడివాడివలె అవస్థాంతరమును ఆశ్రయించును.





కర్మోద్భావితసంస్కార - స్తత్ర స్వప్నరిరంసయా,
అవస్థాం చ ప్రయాత్యన్యాం - మాయావీవాత్మమాయయా. 41

ఘటాదివిషయా న్సర్వా - న్బుద్ధ్యాదికరణాని చ,
భూతాని కర్మవశతో - వాసనామాత్రసంస్థితాన్. 42

ఏతా న్పశ్య న్స్వయంజ్యోతి - స్సాక్ష్యాత్మా వ్యవతిష్ఠతే,
అత్రాంతఃకరణాదీనాం వాసనాద్వాసనాత్మతా. 43

వాసనామాత్రసాక్షిత్వం - తేన తత్ర పరాత్మనః.
వాసనాభిః ప్రపంచోऽత్ర - దృశ్యతే కర్మచోదితః. 44

జాగ్రద్భూమౌ యథా తద్వ - త్కర్తృకర్మక్రియాత్మకః,
నిశ్శేషబుద్ధిసాక్ష్యాత్మా - స్వయమేవ ప్రకాశతే,
వాసనామాత్రసాక్షిత్వం - సాక్షిణ స్స్వాప ఉచ్యతే. 45

జీవునకు జాగ్రదవస్థలో (సుఖ) భోగములనుభవించు





కర్మనశించినందుకు స్థూలదేహమును బాహ్యేంద్రియ వృత్తి నుండి వెనుదిరిగి స్వప్నావస్థనుబొందిౘ పూర్వకర్మ సంస్కారములతో స్వప్నభోగముల ననుభవించవలెననెడి కోరికతో మాయావి తన మాయచేత అనేకరూపములను ధరించునట్లు ఒక అవస్థనుండి మరోఅవస్థను బొందును. జీవుడు వాసనా (బలము) మాత్రరూపముతో నున్న ఘటాది సమస్త విషయములను, బుద్ధి మొదలగు కరణములను, పృథివ్యాది భూతపంచకములను జూచి స్వయంజ్యోతి స్వరూపంబైన ఈ యాత్మ సాక్షి మాత్రముగనే యుండును. ఇందులో అంతఃకరణాదులయొక్క వాసనవలన జీవునకు శాసనాత్మకత సిద్ధించును. అంతఃకరణాదులందు వాసనలుంటవలన వాటి సాక్షిత్వము పరమాత్మలో సిద్ధించును. వాసనల ప్రభావముచేతనే కర్మప్రేరితమైన ఈ జగత్తు అగుపడుచున్నది. జాగ్రదవస్థలో వలెనె స్వప్నావస్థయందును ఈ వాసనారూపమైన ప్రపంచము కర్త-కర్మ-క్రియాత్మకముగానే





అగుపడును. సమస్త బుద్ధికృత వ్యాపారములకు ఆత్మ సాక్షిభూతమై స్వయముగానే ప్రకాశించును. సమస్త వాసనలకు సాక్షిగానుండుటవలన స్వాపమనియందురు.

*భూతజన్మని యద్భూతం - కర్మ తద్వాసనావశాత్,*
*నేదీయస్త్వా ద్వయస్యాద్యే - స్వప్నం ప్రాయః ప్రపశ్యతి.* **46**

*మధ్యే వయసి కార్కశ్యా - త్కరణానా మిహోర్జితః,*
*ప్రాయేణ వీక్షతే స్వప్నం - వాసనాకర్మణో ర్వశాత్.* **47**

*యియాసుః పరలోకం తు - కర్మవిద్యాదిసంభృతమ్,*
*భావినో జన్మనో రూపం - స్వప్న ఆత్మా ప్రపశ్యతి.* **48**

*యద్వత్ప్రపతనా చ్ఛ్యేన - శ్శ్రాన్తో గగనమండలే,*
*ఆకుంచ్య పక్షౌ యతతే - నీడే నిశ్శయనాయనే.* **49**

*ఏవం జాగ్రత్స్వప్నభూమౌ - శ్రాన్త ఆత్మాఽభిసంచరన్*
*ఆపీతకరణగ్రామః - కారణేనైతి చైకతామ్.* **50**





శైశవావస్థలో నేదియగుచున్నదో (జరుగుచున్నదో) ఆయాకార్యము వెనుకటి జన్మవాసనచేత జరుగుచున్నదిగా దెలియవలెను, శైశవమనునది మొదటి జన్మకు సన్నిహిత సంబంధము గలది కావున అట్టి జన్మల సంస్కారము అంటుకొని యుండును. అవన్నియు స్వప్నమున అప్పుడప్పుడు దర్శనమిచ్చుచుండును, జ్ఞాననిష్ఠాచరణాదుల సంపాదించబడిన ఫలితముగ పరలోక సుఖమునను భవింప కోరికయున్నవాఁడు (ప్రాణి) స్వప్నమున భవిష్యజ్జన్మరూపమున గాంచుచున్నాడు. ఎక్కువవేగముతో పరుగిడిన డేగ తనగూటిలోనెట్లు ప్రవేశించి విశ్రాంతిని బొందునో అట్లుగానే జాగ్రత్స్వప్నాదుల అలసిన జీవుడు గూడ ఇంద్రియములనెల్ల దనలో సంస్కారరూపమున నణచుకొని ఈశ్వరునితో నైక్యమును బొందుచున్నాడు.

***నాడీమార్గైరింద్రియాణా - మాకృష్యాదాయ వాసనాః,***
***సర్వం గ్రసిత్వా కార్యం చ - విజ్ఞానాత్మా విలీయతే. 51***





ఈశ్వరాఖ్యేఽవ్యాకృతేఽథ - యథా సుఖమయో భవేత్,
కృత్స్నప్రపంచవిలయ - స్తథా భవతి చాత్మనః. 52

యోషితః కామ్యమానాయాః - సంభోగాంతే యథా సుఖమ్,
స ఆనందమయో బాహ్యో - నాఽఽన్తరః కేవలం యథా. 53

ప్రాజ్ఞాత్మతాం సమాసాద్య - విజ్ఞానాత్మా తథైవ సః,
విజ్ఞానాత్మా కారణాత్మా - యథా తిష్ఠన్నథాఽపి సః. 54

అవిద్యాసూక్ష్మవృత్త్యాను - భవత్యేవ యథాసుఖమ్,
అజ్ఞానమపి సాక్ష్యాది - వృత్తిభి శ్చానుభూయతే. 55

తథాహం సుఖ మస్వాప్సం - నైవ కించి దవేదిషమ్,
ఇత్యేవం ప్రత్యభిజ్ఞాపి - పశ్చా త్తస్యోపపద్యతే. 56

జాగ్రత్స్వప్నసుషుప్త్యాఖ్య - మేవేహాఽముత్రలోకయోః,
పశ్చాత్కర్మవశాదేవ - విస్ఫులింగా ఇవాఽచలాత్. 57





జాయన్తే కారణాదేవ - మనోబుద్ధ్యాదికాని తు,
పయఃపూర్ణఘటో యద్వ - న్నిమగ్నః స్సలిలాశయే. 58

తైరేవోద్భృత ఆయాతి - విజ్ఞానాత్మా తథైత్యజాత్,
విజ్ఞానాత్మా కారణాత్మా - తథా తిష్ఠం స్తథాపి సః. 59

దృశ్యతే సత్సు తేష్వేవ - నష్టేష్వాయాత్యదృశ్యతామ్,
ఏకాకారోఽర్యమా తత్త - త్కార్యేష్విన పరః పుమాన్. 60

కూటస్థో దృశ్యతే తద్వ - ద్గచ్ఛత్యాగచ్ఛతీవ సః,
మోహమాత్రాంతరాయత్వా - త్సర్వం తస్యోపపద్యతే. 61

దేహాద్వ్యతీత ఆత్మాపి - స్వయఙ్జ్యోతిస్స్వభావతః,
ఏవం జీవస్వరూపం తే - ప్రోక్తం దశరథాత్మజ! 62

ఇతి శ్రీపద్మపురాణే శివగీతాయాం దశమోఽధ్యాయః.

జీవుడునాడీ మార్గమున ఇంద్రియముల సున్నితమైన





వాసనలను ఆకర్షించుకొని సమస్త కార్యములను దనలో లీనమొనర్చుకొని యవ్యాకృతమైన ఈశ్వరచైతన్యములో నైక్యమును బొందుచున్నాడు. ఆ సందర్భములో నతనికి కేవలమానందము మాత్రమే గోచరించుచుండునట్లు ఈ తుచ్ఛప్రపంచమంతయు స్వరూపసత్తుగా లీనమై యుండును. కాముకురాలగు స్త్రీ రాసక్రీడా మధ్యన ఆనందాతిరేకముతో నెట్లు బాహ్య విషయములను మరచి కేవల మానందములోనే నిమగ్నమై యుండునో అట్లుగానే జీవుడు ప్రాజ్ఞాతత్వమును బొంది అంతులేని ఆనందానుభవముచేత కారణాత్మగా వ్యవహరింపఁబడును. సాక్షి జ్ఞానవేద్యమగు అజ్ఞాన సూక్ష్మముయొక్క యావృత్తిచేత నిద్రాంతమున నేను బాహ్యప్రపంచ మెఱుంగను. ఇంతవరకు నేను సుఖముగా నిద్రించితిని, అనుకొనును (ప్రాణియనుట) ఇహ పరలోకములందు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు మరల మరల వచ్చుచుండును. ఆ విధముగా మేల్కొన్నప్పుడు మనోబుధ్యహంకారాదికరణ చతుష్టయము లెల్లప్పుడు అగ్నినుండి మిరుగుడుల మాదిరిగా కారణాత్మనుండి





బయలుదేరి యథాపూర్తిగా సంక్రమించును. నీటితో నింపఁబడిన ఘటము నీటిలో మునిగి మరల నా నీటితోనే లేవనెత్తబడినట్లుగా జీవుడు కారణాత్మనుండి తన శరీరమునకే వచ్చుచున్నాడు. విజ్ఞానాత్మ రూపమగు కారణాత్మ (ఈశ్వరుడు) సద్వస్తువులందు, దృశ్యుడును మరియు నవి నశించగానే అదృశ్యుడైనట్లుగా నుండును. ఒకే రూపముగల సూర్యుడు ఎట్లుగా జలాధిభిన్నోపాధులయందు వేర్వేరుగా నగుపడునో అట్లే పరమాత్ముడు గూడ నిరాకారుడైయున్నను సవికారుని (సాకారము) గా నతడు వచ్చుచు పోవుచున్నట్లు గోచరించును. నైసర్గికముగా పరమాత్ముఁడు స్వయంజ్యోతి యైనప్పటికిన్ని దేహాదులకంటెను భిన్నమగు నాత్మగల వాడైనను మోహమనునంతరాయము గలుగుటచేత సమస్తము వానియందే యున్నట్లుగా గోచరించును. కనుక రామా! జీవుని విషయమునిట్లు వివరించితిని.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతమైన శివగీతలో పదియవ అధ్యాయము సమాప్తము.



# ఏకాదశాధ్యాయము

## ఉపాసనామాహాత్మ్యము

*శ్రీభగవా నువాచ:*

*దేహాంతరగతిం స్వప్న - పరలోకగతిం తథా,*
*వక్ష్యామి నృపశార్దూల! - మత్త శ్శృణు సమాహిత:.* **1**

*భుక్తం పీతం యదస్త్యత్ర - తద్రసాదానుబంధనమ్,*
*స్థూలదేహస్య లింగస్య - తేన జీవనధారణమ్.* **2**

*వ్యాధినా జరయా వాపి - పీడ్యతే జాఠరో ఽనల:,*
*శ్లేష్మణా తేన భుక్తాన్నం - పీతం వా న పచత్యలమ్.* **3**

*భుక్తపీతరసాభావా - త్తదా శుష్యంతి ధాతవ:,*
*భుక్తపీతరసేనైవ - దేహే లింపంతి ధాతవ:.* **4**





**సమీకరోతి యత్తస్మా - త్సమానో వాయు రుచ్యతే,**
**తదావీం తద్రసాభావా - దామబంధనహానితః. 5**

శివుఁడాదేశించుచున్నాడు: దేహాంతరప్రాప్తి పరలోక గమనమును గురించి చెప్పుదును ఆలకించుము. ఓ రామా! దత్తచిత్తుడవై వినుము. భుక్త-పీత-పదార్థములు పక్వములై వాటియొక్క రసములనుండి స్థూలశరీరమునకు ప్రాణవాయుధారణము గల్గుచున్నది. వ్యాధివలన గాని వృద్ధాప్యములోగాని లేదా ఉత్పన్నమైన శ్లేష్మముచేత నేమి జఠరాగ్ని మందమై భుజించినట్టి యాహారముగానే, తాగిన నీరునుగాని పచనము గాదు. భుక్తపీతములు పచనము గాకుంటచేత వానిరసము లేకపోవుటవలన నాడులు ఎండిపోవును, ఆహారపానీయములతోనే నాడు వృద్ధిఁజెందును, దేహనాడులను సమానముగా జేయును గనుక సమానవాయువను పేరుగలదయ్యెను. అప్పుడారసము లేనికతమున పరస్పర సంయోగము స్థూలలింగశరీరములకు దప్పుచున్నది.





పరిపక్వరసత్వేన - యథా గౌరవతః ఫలమ్,
స్వయమేవ పతత్యాశు - తథా లింగం తనో ర్వ్రజేత్. 6

తత్తత్ స్వాదసాకృష్య - హృషీకాణాం చ వాసనాః,
ఆధ్యాత్మికాధిభూతాని - హృత్పద్మే చైకతాం గతః. 7

తదోర్ధ్వగః ప్రాణవాయు - స్సంయుక్తో నవవాయుభిః,
ఊర్ధ్వోచ్ఛ్వాసీ భవత్యేష - తథా తేనైకతాం గతః. 8

చక్షుషోర్వాపి మూర్ధ్నో వా - నాడీమార్గం సమాశ్రితః,
విద్యాకర్మసమాయుక్తో - వాసనాభిశ్చ సంయుతః. 9

ప్రజ్ఞాత్మానం సమాశ్రిత్య - విజ్ఞానాత్మోపసర్పతి,
యథా కుంభో నీయమానో - దేశా ద్దేశాంతరం ప్రతి. 10

స్వపూర్ణ ఏవ సర్వత్ర స - ఆకాశోZపి తత్ర తు,
ఘటాకాశాఖ్యకాం యాతి - తద్వ ల్లింగం పరాత్మనః. 11





పండిన గుమ్మడి మొదలగు ఫలములు బరువుచేత తీగను విడిచి పడిపోవునట్లు దేహము నుండి ఈ లింగ శరీరము వీడిపోవుచున్నది. ఇంద్రియముల యొక్క వాసనలు గలవాడై ఆధ్యాత్మికాధి భౌతికములను ఐక్యమొందించుకొని ముఖ్యప్రాణుడు మిగత తొమ్మిది వాయువులతో గూడి వానితోఁగలిసి ఊర్ధ్వోచ్ఛ్వాసము గలవాడగును, జ్ఞాన కర్మలతోఁగూడినవాఁడై పూర్వపు ప్రజ్ఞానుసారములగు ననుభవములతో ప్రజ్ఞానాత్మ ప్రేరితుఁడై నేత్రనాడులనుండిగాని శిరోమార్గమునగాని జీవుఁడు ఊర్ధ్వముగా నుపసర్పణమందును అంతటనున్న యాకాశమునకు ఘటాకాశాది వ్యవహారమువలె పరాత్మునికి లింగదేహములో ప్రవేశముతో జీవత్వవ్యవహారము (ఉపాధిభేదముచేత) గలుగును.

***పునర్దేహాంతరం యాతి - యథాకర్మానుసారతః,***
***ఆమోక్షాత్సంచరత్యేవం - మత్స్యః కూలద్వయం యథా. 12***





*పాపభోగాయ చేద్గచ్ఛే - ద్యమదూతై రధిష్ఠితః,*
*యాతనాదేహమాశ్రిత్య - నరకానేవ కేవలమ్* 13

*ఇష్టాపూర్తాని కర్మాణి - యోఽనుతిష్ఠతి సర్వదా,*
*పితృలోకం వ్రజత్యేష - ధూమమాశ్రిత్య బర్హిషః.* 14

*ధూమాద్రాత్రిం తతః కృష్ణ - పక్షం తస్మాచ్చ దక్షిణమ్,*
*అయనం చ తతో లోకం - పితౄణాం చ తతః పరమ్.* 15

మరల కర్మానుసారముగా దేహాంతరమును మోక్షమును బొందు వరకు చేప రెండుగట్లను పొందుచున్న రీతిగా పొందుచుండును. పాపభోగమునకై పోవుచో యమదూతలచేత బొందబడినవాఁడైయాతనా దేహము నాశ్రయించి నరకములఁబొందును. సర్వకాలములందు నిష్టాపూర్తాది కర్మలనాచరించువాఁడు శ్రౌతస్మార్తాద్యగ్నివలన ధూమమునాశ్రయించి పితృలోకమును గురించి పోవును. ఇష్టాపూర్తములన యజ్ఞయాగాదికము తటాకారామాది



ప్రతిష్ఠాపనమునసుట) ఇష్టాపూర్తముల నాచరించినవాడు మొదలు ధూమమును పిమ్మట రాత్రిని, తరువాత కృష్ణపక్షమును దానినుండి దక్షిణాయనమును పిదప పితృ లోకమును ఆ తరువాత దివ్యదేహమును దాల్చి చంద్రలోకములో సమస్త సుఖములతో నుండును.

చంద్రలోకే దివ్యదేహం - ప్రాప్య భుం క్తే వరాం శ్రియమ్,
తత్ర చంద్రమసా సో౽సౌ - యావత్కర్మఫలం వసేత్. 16

తత్రైవ కర్మ శేషేణ - యథా తం పునరావ్రజేత్,
వపుర్విహాయ జీవత్వ - మాసాద్యాకాశమేతి సః 17

ఆకాశా ద్వాయుమాగత్య - వాయో రంభో వ్రజత్యథ,
అద్భ్యో మేఘం సమాసాద్య - తతో వృష్టి ర్భవే దసౌ. 18

తతో ధాన్యాని భక్ష్యాణి - జాయతే కర్మచోదితః,
యోని మన్యే ప్రపద్యంతే - శరీరత్వాయ దేహినః 19

***స్థాణుమన్యేzనుసంయంతి - యథాకర్మ యథాశ్రుతమ్,***
***తతోzన్నత్వం సమాసాద్య - పితృభ్యాం భుజ్యతే పరమ్ 20***

చంద్రునితోబాటు కర్మఫలము లున్నంతవరకు చంద్రలోకమున నుండి కర్మశేషమున దిరిగి భూలోకమునకు వచ్చును. చంద్రలోకములోని భోగశరీరమును వీడి లింగ శరీరమును బొంది, ఆకాశత్వమును, వాయుత్వమును, జలత్వమును, క్రమముగా బొంది పిమ్మట నాజలమునుండి మేఘమును బొంది వర్షమై భుజించుటకు యోగ్యమైన ధాన్యాది రూపమును దాల్చి కర్మచోదితుండై బుట్టుచున్నాడు. ఇందులోనుండి కొందరు శరీరమును బొందుటకు యోనిని బొందుచున్నారు. మరికొందరు కర్మానుసారముగా స్థావరాది రూపమును బుట్టుచున్నారు. తరువాత అన్నమై జననీజనకుల చేత అది భుజింపఁబడి స్త్రీ పురుషులలో శుక్రశోణితముల రూపమును దాల్చి గర్భమగుచున్నారు. (గర్భముగా మారును)



తతశ్శుక్రం రజశ్చైవ - భూత్వా గర్భోऽభిజాయతే,
తత: కర్మానుసారేణ - భవేత్ స్త్రీపుంనపుంసక:. 21

ఏవం జీవగతి: ప్రోక్తా - ముక్తిం తస్య వదామి తే,
యస్తు శాంత్యాదియుక్తస్స - స్సదా విద్యారతో భవేత్. 22

స యాతి దేవయానేన - బ్రహ్మలోకావధిం పర:,
అర్చి ర్భూత్వా దివం ప్రాప్య - శుక్లపక్ష మథో వ్రజేత్. 23

ఉత్తరాయణమాసాద్య - సంవత్సర మథో వ్రజేత్,
ఆదిత్యచంద్రలోకౌ తు - విద్యుల్లోక మత:పరమ్. 24

అథ దివ్య: పుమాన్కశ్చి - ద్బ్రహ్మలోకాదిహైతి స:,
దివ్యే వపుషి సంధాయ - జీవ మేవం నయ త్యసౌ. 25

ఆ మీదట కర్మానుసారముగా స్త్రీ-పురుష-నపుంసకాది భేదములతో బుట్టుట జీవుని ముక్తిని గురించి జెప్పుచున్నాను. వినుము. ఎవ్వడైతే శాంత్యాదులతో గూడుకొని యెల్లప్పుడు



విద్యాసక్తుడగునో వాడు బ్రహ్మలోక పర్యంతరము దేవయానము (విమానము)న బోవును.

తేజోరూపముచేత దేవపురుషుడై దినము- శుక్లపక్షము, ఉత్తరాయణము, పిదప సంవత్సరమును బొందును. ఆదిత్య చంద్రలోకములను, తరువాత విద్యుల్లోకమును బొందును. ఆ మీదట ఒకానొక దివ్య పురుషుడు బ్రహ్మలోకమునుండి విద్యుల్లోకమునకు వచ్చును. ఇట్లు ఈ దివ్య దేహముతో నున్నవాఁడు జీవుని బొంది బ్రహ్మలోకమునకు దోడ్కొనిపోవును.

*బ్రహ్మలోకే దివ్యదేహా - భుక్త్వా భోగా న్యథేప్సితాన్,*
*తత్రోషిత్వా చిరం కాలం - బ్రహ్మణా సహ ముచ్యతే.* **26**

*శుద్ధబ్రహ్మరతో యస్తు - న స యాత్యేవ కుత్రచిత్,*
*తస్య ప్రాణా విలీయంతే - జలే సైంధవఖిల్యవత్.* **27**

*స్వప్నదృష్టా యథా సృష్టిః - ప్రబుద్ధస్య విలీయతే,*
*బ్రహ్మజ్ఞానవతస్తద్వ - ద్విలీయంతే తథైవ తే.* **28**



**విద్యాకర్మవిహీనో య - స్తృతీయం స్థాన మేతి సః,**
**భుక్త్వా చ నరకాన్ఘోరా - న్మహారౌరవరౌరవాన్. 29**

**పశ్చాత్ప్రాక్తనవేషేణ - క్షుద్రజంతు ర్భవే దసౌ,**
**యూకామశకదంశాది - జన్మాజసౌ లభతే భువి. 30**

బ్రహ్మలోకమున దివ్య దేహముతో సమస్త కోరికల ననుభవించి చాలాకాల మచటనే యుండి బ్రహ్మముతో మోక్షమును బొందును. కేవలము నా బ్రహ్మరతుడు నిర్వికారుఁడై జలముతోనున్న ఉప్పుముద్దవలె నుండును. అతని ప్రాణములు తనలోనే లయమగును. స్వప్నములోని సంఘటన మేల్కొన్న వానికెట్లు తిరోహితమగుచుండునో బ్రహ్మజ్ఞాని కన్నియు నటులనే యగును. విద్యాకర్మశూన్యునికి తృతీయస్థానము (నరకము) లభ్యమగును. అట్టివాడు రౌరవాది మహానరకములననుభవించి మునుపటి కర్మశేషముచేత నీచప్రాణియై బుట్టును. దోమ-ఈగ మొదలగు వాని జన్మను బోలోకమున దార్చును. ఈ ప్రకారంబుగ జీవగతిని వివరించితిని. ఇకముందేమి బ్రశ్నించెదవు?





*ఏవం జీవగతి: ప్రోక్తా - కిమన్యచ్ఛ్రోతు మిచ్ఛసి,*
*భగవన్! యత్త్వయా ప్రోక్తం - ఫలం తు జ్ఞానకర్మణో:* **31**

*బ్రహ్మలోకే చంద్రలోకే - భుంక్తే భోగా నితి ప్రభో!*
*గంధర్వాదిషు లోకేషు - కథం భోగ స్సమీరిత:.* **32**

*దేవత్వం ప్రాప్నుయాత్కశ్చి - త్కశ్చి దింద్రత్వమేవ చ,*
*ఏతత్కర్మఫలం వాఽస్తు - విద్యాఫల మథాపి వా.* **33**

*తద్బ్రూహి గిరిజాకాంత! - తత్ర మే సంశయో మహాన్,*
*తద్విద్యాకర్మణో రేవా - నుసారేణ ఫలం భవేత్.* **34**

*యువా చ సుందర శ్శూరో - నీరోగో బలవాన్భవేత్,*
*సప్తద్వీపాం వసుమతీం - భుంక్తే నిష్కంటకం యది.* **35**

రాముడు ప్రశ్నించుచున్నాడు: ఓ పూజ్యుడా! జ్ఞాన కర్మముల యొక్క ఫలితముగా బ్రహ్మచంద్రలోకములలోను భోగముల ననుభవించునని యాదేశించితివి, గంధర్వాది



లోకములలోను భోగవెట్లు లభించును? దేవత్వ మింద్రత్వమనునవి. విద్యాఫలమా? కర్మఫలమా? ఓ పార్వతీపతీ! తెలియపరచుమని రాముఁడు ప్రశ్నించెను.

శ్రీ పార్వతీపతి ఇట్లాదేశించుచున్నాడు: ఓ రామా! విద్యాకర్మాను సారముగా ఫలము లభించును. పిన్నవయస్సున నున్నవాడును, చూడ చక్కనివాఁడైనను, శూరుఁడైనను, నిరోగియైనను, శక్తివంతుఁడై, ఏడు దీవులను నిర్విఘ్నముగా బరిపాలించినచో నెటువంటి యానందము గలుగునో నది మానవానందమని జెప్పఁబడినది.

*న ప్రోక్తో మానుషానంద - స్తస్మా చ్ఛతగుణో మతః,*
*మనుష్య స్తపసా యుక్తో - గంధర్వో జాయతేऽన్య తు. 36*

*తస్మాచ్ఛతగుణో దేవ - గంధర్వాణాం న సంశయః,*
*ఏవం శతగుణానంద - ఉత్తరోత్తరతో భవేత్. 37*

*పితౄణాం చిరలోకానా - మాజానసురసంపదామ్,*
*దేవతానా మథేంద్రస్య - గురో స్తద్వత్ప్రజాపతేః. 38*



**బ్రహ్మణశ్చైవ మానందః - పురస్తాదుత్తరోత్తరః,**
**జ్ఞానాధిక్యా త్సుఖాధిక్యం - నాఽన్యదస్తి సురాలయే. 39**

**శ్రోత్రియోఽవృజినోఽకామ - హతో యశ్చ ద్విజో భవేత్,**
**తస్యాప్యేవం సమాఖ్యాతా - ఆనందా శ్చోత్తరోత్తరమ్. 40**

మానవుడు తపంబొనర్చినచో గంధర్వుడగును, ఆతనికి మానవున కంటెను నూరురెట్లు ఆనందము గలుగును, ఆ గంధర్వునికంటెను నూరురెట్లు దేవగంధర్వుల కానందము గలుగును. ఇట్లు క్రమక్రమముగా క్రింది వారికంటెను మున్ముందు వారికి నూరేసిరెట్లు ఆనందమెక్కువ గలుగును. అదెట్లనగా దేవ గంధర్వులకంటె చిరలోకవాసులగు పితృదేవతలకు, వారికంటెను ఆజానదేవులకును, వారికంటెను నూరేసిరెట్లు కర్మదేవతలకు, వారికంటెను నూరురెట్లు దేవతలకు సహజముగా దేవత్వమును బొందియున్నవారు వారికంటె నూరురెట్లు ఇంద్రునకు, ఇంద్రుని కంటెను నూరురెట్లు బృహస్పతికి, ఆతని కంటెను నూరురెట్లు బ్రహ్మకు ఈ



విధముగా దెలిసికొనవలెను. నిష్కామకర్మయొనర్చి బ్రహ్మక్షత్రియ, వైశ్యులలో కామమునకు లోబడని నిష్పాపుడైన ఆత్మజ్ఞానము గలవానికి గూడ క్రమక్రమముగా నానందము లభించును. స్వర్గమున జ్ఞానాధిక్యము చేత సౌఖ్యమధికమగును, కనుక నాత్మజ్ఞానమున కంటెను మరొకటి లేదు.

*ఆత్మజ్ఞానాత్పరం నాస్తి - తస్మా ద్దశరథాత్మజ!*
*బ్రాహ్మణః కర్మభిర్నైవ - వర్ధతే నైవ హీయతే.* **41**

*న లిప్యతే పాతకేన - కర్మణా జ్ఞానవాన్యది,*
*తస్మా త్సర్వాధికో విప్రో - జ్ఞానవానేవ జాయతే.* **42**

*జ్ఞాత్వా యః కురుతే కర్మ - తస్యాక్షయ్యఫలం భవేత్,*
*యత్ఫలం లభతే మర్త్యః - కోటిబ్రాహ్మణభోజనైః.* **43**

*తత్ఫలం సమవాప్నోతి - జ్ఞానినం యస్తు భోజయేత్,*
*జ్ఞానవంతం ద్విజం యస్తు - ద్విష్యతే చ నరాధమః,* **44**



***న శుష్యమాణో మ్రియతే - యస్మాదీశ్వర ఏవ సః.***
***ఉపాసకో న యాత్యేవ - యస్మాత్పునరధోగతిమ్,***
***ఉపాసనరతో భూత్వా - తస్మా దాస్స్వ సుఖీ భవ! 45***

ఇతి శ్రీపద్మపురాణే శివగీతాయాం ఏకాదశోఽధ్యాయః.

బ్రహ్మజ్ఞాని కర్మలచేత వృద్ధి -క్షయ దశలను బొందడు, బ్రాహ్మణుఁడు బ్రహ్మజ్ఞానియైన యెడల పాపకర్మలకు దూరముగా నుండును. జ్ఞానియగుటవలన బ్రాహ్మణుడు సర్వాధికుడుగా నెన్నబడుచున్నాడు. ఎవ్వడైతే తెల్సి సత్కర్మనాచరించునో వాఁడు క్షయఫలమును బొందును. లోకమునందు మానవుఁడు కోటి బ్రాహ్మణ భోజనమువలన ఎటువంటి ఫలమును బొందునో జ్ఞాని కన్నము వడ్డించుటవలన అంతటి ఫలమును బొందును.

విశేషము. (ఇక్కడ వీరశైవులు తమ కన్నమును వడ్డించిన పిదప నీ దిగువ మంత్రమును బఠింతురు, అది ఈ పై శ్లోకమునకు సరిపోలుచున్నది)





శ్లో॥ శివయోగిని సంతృప్తే - తృప్తో భవతి శంకరః ।
తత్తృప్త్యా తన్మయం విశ్వం - తృప్త మేతి చరాచరమ్॥

ఇట శివయోగియనగా దివ్యజ్ఞానియనే అర్థమగుచున్నది. అట్టి జ్ఞాని కన్నమును బెట్టి దృప్తిపరచినచో సాక్షాత్తుగా పరమ శివుడే తృప్తిజెందుననియు, అతడు దృప్తి జెందినచో సమస్త చరాచరాత్మకమగు ప్రాణికోటి తృప్తిజెందుతుందని అర్థము. ఏలనన శంకరుని హృదయము చతుర్దశభువనములుండునని వాడుకయున్నది. అది యిక్కడ సమన్వయించుకోవాలి) జ్ఞానిని ద్వేషించిన వాడు క్షయరోగగ్రస్తుడై మరణించును. ఉపాసకుండెప్పుడును అధోగతిని బొందడు. కనుక నీవుగూడ ఉపాసనమొనర్చి ఆనందమును బొందుమని రామునకు శివుఁడాశీర్వదించెను.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతంబైన శివగీతలో నేకాదశ అధ్యాయము సమాప్తము.



# ద్వాదశాధ్యాయము

## ఉపాసనావిధి

శ్రీరామ ఉవాచః-

*భగవన్! దేవ! దేవేశ! - నమస్తేఽస్తు మహేశ్వర!*
*ఉపాసనవిధిం బ్రూహి - దేశం కాలం చ తస్య తు.* 1

*(అఙ్గాని నియమాంశ్చైవ - మయి తేఽనుగ్రహో యది)*
*శృణు రామ! ప్రవక్ష్యామి - దేశం కాల ముపాసనే,*
*మదంశేన పరిచ్ఛిన్నా - దేహా స్సర్వదివౌకసామ్.* 2

*యే త్వన్యదేవతా భక్తా - యజంతే శ్రద్ధయాన్వితాః,*
*తేఽపి మామేవ రాజేన్ద్ర! - యజంత్యవిధిపూర్వకమ్.* 3

*యస్మాత్సర్వమిదం విశ్వం - మత్తో న వ్యతిరిచ్యతే,*
*సర్వక్రియాణాం భోక్తాహం - సర్వస్యాహం ఫలప్రదః.* 4

*యేనాకారేణ యే మర్త్యా - మామేవైకముపాసతే,*
*తేనాకారేణ తేభ్యోఽహం - ప్రసన్నో వాంఛితం దదే.* 5

**విధినాऽవిధినా వాపి - భక్త్యా యే మా ముపాసతే,**
**తేభ్యః ఫలం ప్రయచ్ఛామి - ప్రసన్నోऽహం న సంశయః. *6***

శ్రీరాముఁడు ప్రశ్నించుచున్నాడు: ఓ పరమేశ్వరా! ఉపాసనా విధానమును, దాన్నిజేయు సమయమును, ప్రదేశమును, తదంగములను, నియమములను దయతో జెప్పుమని రాముడు ప్రశ్నించెను. (ఈశ్వరుఁడు జెప్పుచున్నాడు) ఓ రామా! ఉపాసనకుచితమైన దేశకాలాదులను వివరించెద వినుమనెను. సమస్త దేవతల యొక్క దేహములును నా యంశము చేతనే సృష్టించబడినవి, ఎవరేదేవతోపాసకులో అట్టి శ్రద్ధ గల భక్తులుగూడ నన్నే బొందుచున్నారు. శాస్త్రోక్తముగా (విధ్యుక్తముగా) నేనే సర్వభోక్తననే జ్ఞానము లేమిచేత వారికి ఫలము తక్కువగా లభించును. ప్రపంచము నాకంటె భిన్నమైనదేమియు కాదు, కనుక సమస్త క్రియలననుభవించి మంచి ఫలముననుగ్రహించు వాఁడనుసహ నేనే. ఏమానవుడైతే విష్ణ్వాదియాకారములతో నన్నుపాసన జేయుచున్నారో అట్టివారి కాయా రూపములతో బ్రత్యక్షమై వారి వారి యభీప్సితములను



పూరింతును, విధ్యుక్తముగా గాని అథవా అట్లుగాక భక్తి చేత నన్ను పాసించిన వారందరికిని ఫలము నిచ్చెదను.

*అపి చేత్సుదురాచారో - భజతే మా మనన్యభాక్,*
*సాధురేవ స మన్తవ్య - స్సమ్యగ్వ్యవసితో హి సః.* **7**

*స్వజీవత్వేవ యో వేత్తి - మామేవైక మనన్యధీః,*
*తం న స్పృశంతి పాపాని - బ్రహ్మహత్యాదికాన్యపి.* **8**

*ఉపాసావిధయస్తత్ర - చత్వారః పరికీర్తితాః,*
*సంపదారోపసంసర్గా - ధ్యాసా ఇతి మనీషిభిః.* **9**

*అల్పస్య చాధికత్వేన - గుణయోగా ద్విచింతనమ్,*
*అనంతం వై మన ఇతి - సంపద్విధి రుదీరితః.* **10**

దుర్మార్గుడైనను పశ్చాత్తాపమును బొంది, అధిక శ్రద్ధతో సేవింపగా అట్టివాఁడు సజ్జనుండే యగును. ఇతర చింతలేమియులేక త్వమేzవాహం అనే బుద్ధి చేత నన్నెవడు



పాశించునో అట్టివాడిని బ్రహ్మహత్యాదిపావములు స్పృశింపఁజాలవు. విద్వాంసులచేత సంపదారోపము, సంవర్గము, అధ్యాస అని నాలుఁగు రకాలుగా ఉపాసన విధించనైనది. గుణ సంబంధము చేత స్వల్పమైన దానిని అధికముగా "మనస్సు, అనంతము" అని, చింతనజేయుట సంపద్విధియని జెప్పఁబడినది.

*విధావారోప్య యోపాసా - సాఽఽరోపః పరికీర్తితః,*
*యద్వదోంకారముద్గీథ - ముపాసీతేత్యుదాహృతః.* 11

*ఆరోపో బుద్ధిపూర్వేణ - య ఉపాసావిధిశ్చ సః,*
*యోషిత్యగ్ని మతిర్యత్త - దధ్యాసస్స ఉదాహృతః.* 12

*క్రియాయోగేన చోపాసా - విధి స్సంవర్గ ఉచ్యతే,*
*సంహృత్య వాయుః ప్రలయే - భూతాన్యేకోఽవసీదతి.* 13

*ఉపసంగమ్య బుద్ధ్యా య దాసనం దేవతాత్మనా,*
*తదుపాసనమంతస్స్యా - త్తద్బహిస్సంపదిందయః.* 14



జ్ఞానాంతరానంతరిత - సజాతిజ్ఞానసంతతేః,
సంపన్నదేవతాత్మత్వ - ముపాసన ముదీరితమ్. 15

సంపదాదిషు బాహ్యేషు - దృఢబుద్ధి రుపాసనమ్,
కర్మకాలే తదంగేషు - దృష్టిమాత్ర ముపాసనమ్. 16

ఉపాసన మితి ప్రోక్తం - తదంగాని బ్రువే శృణు,
తీర్థక్షేత్రాదిగమనే - శ్రద్ధాం తత్ర పరిత్యజేత్. 17

స్వచిత్తైకాగ్రతా యత్ర - తత్రాసీత సుఖం ద్విజః,
కంబలే మృదుతల్పే వా - వ్యాఘ్రచర్మణి వా స్థితః. 18

వివిక్తదేశే నియత - స్సమగ్రీవశిరస్తనుః,
అత్యాశ్రమస్థ స్సకలా - నీంద్రియాణి నిరుద్ధ్య చ. 19

భక్త్యాథ స్వగురుం నత్వా - యోగం విద్వాంశ్చ యోజయేత్,
యస్య విజ్ఞానవాన్భవ - త్యయుక్తమనసా సదా. 20





పూర్వోక్తసంపదాది బహిర్ధ్యానములలో దృఢబుద్ధి యుపాసనమని చెప్పఁబడును. కర్మచేయుకాలమున తదంగము లందు దృష్టిమాత్రముంచుట యుపాసన మనబడును. ఇఁక దాని యంగములను జెప్పెదనాలకించుము. ఉపాసచేయువాని చిత్తైకాగ్రతయున్నచోటనే యుపాసన మర్థముగాని తీర్థ క్షేత్రాదులకు వెళ్ళుట అనవసరము.

విశేషము: వీరశైవ ధర్మానుసారముగా తీర్థక్షేత్రాది గమనమాచరించుటను ఖండించబడినది. అక్కడికి వెళ్ళడము వలన పాపమే యగును గాని పుణ్యము నభపుష్పమువంటిది. ఏలనన, అక్కడికి వెళ్ళినవారు అక్కడి పుణ్యతీర్థక్షేత్రములను దర్శించుట అట్లుండగా వెళ్ళినవారు అక్కడ మలమూత్రవిసర్జన, ఉచ్ఛిష్టములను వదలుట చేత నా పుణ్యక్షేత్రమును మలిన మొనర్చుటేగాకుండ పుణ్యమునకు బదులుగా పాపమునే గొని దెచ్చుకున్నట్లగునని వీరశైవ సిద్ధాంతము. ఇది సూక్ష్మముగా విచారించినచో వాస్తవమైనదేయని చెప్పక తప్పదు.





అట్లే తెలిసిన (విజ్ఞాని) వాఁడు కంబళియాసనమునందు గాని మరొక మెత్తని యాసనమందుగాని, పులిచర్మముపైన గాని, నిర్జన స్థలమున నియముతో యుండి సమానముగా నుంచబడిన మస్తకము(శిరము) దేహము కంఠముగలవాఁడై జక్కఁగా విభూతి రేఖలను ధరించి సమస్తేంద్రియములను దనమందిడుకొని ధృఢభక్తిచేత దాను విశ్వసించిన దన గురువునకు మనస్సులోనే నమస్కరించి యోగము నాచరించవలెను. స్వాధీనములో లేని మనస్సుతో నెవ్వడు విజ్ఞానములేనివాడో వాని యింద్రియములు చెడ్డ గుఱ్ఱములను దోలు సారథివలెనే స్వాధీనమున నుండవు.

తస్యేంద్రియాణ్యవశ్యాని - దుష్టాశ్వా ఇవ సారథేః,
విజ్ఞానీ యస్తు భవతి - యుక్తేన మనసా సహ. **21**

తస్యేంద్రియాణి వశ్యాని - సదశ్వా ఇవ సారథేః,
యస్త్వవిజ్ఞానవాన్ భవ - త్యమనస్క స్సదాzశుచిః. 22





ఎవడైతే విజ్ఞానియో వాడికి మనస్సుతోఁగూడ వాడి యింద్రియములు మంచి గుఱ్ఱములు గల సారథిమాదిరి యింద్రియములు స్వాధీనమునందుండును. ఎవడైతే వివేక శూన్యుడో నిర్మలమైన మనస్సులేదో (చిత్తశుద్ధిలేదో) వాఁడు ఆ ముక్తి పదమును బొందక సంసారియై మరల బుట్టుచుండును. వీనినే ఆది శంకరాచార్యులవారు "పునరపి జననం పునరపి మరణం:" అనే సూక్తిని జనులకు చాటిచెప్పియున్నారు.

***న స తత్పదమాప్నోతి - సంసారం చాధిగచ్ఛతి,***
***విజ్ఞానీ యస్తు భవతి - సమనస్క స్సదా శుచిః. 23***

స్వాధీనమైన చిత్తైకాగ్రతగల విజ్ఞాని నిర్మల మనస్కుడై పునరావృత్తి (పునర్జన్మ) లేనివాఁడై మోక్షపదమును బొందును. విజ్ఞానము సారథి, మనస్సే కళ్ళెము గలవాఁడు(ఇట ఇంద్రియములే గుఱ్ఱములు. శరీరమే రథము గలవాఁడని జేర్చుకొనవలెను) సంసారమార్గము యొక్క లక్ష్యమును జేరి చివరికి నాలోనే లీనమగుచున్నాడు.హృదయపద్మమును రజోగుణ



రహితముగాను నిర్మలమైనదిగాను, పునీతమైనది గాను శోకరహితమైనదిగాను, చింతనయొనర్చి అందులో పరమాత్ముడనగు నన్ను ధ్యానించవలెను.

న తత్పద మవాప్నోతి - యస్మా ద్భూయో న జాయతే,
విజ్ఞానసారథి ర్యస్తు - మనఃప్రగ్రహ ఏవ చ. 24

సోఽధ్వనః పార మాప్నోతి - మమైవ పరమం పదమ్,
హృత్పుండరీకం విజయం - విశుద్ధం విశదం తథా. 25

విశోకం చ విచింత్యాఽత్ర - ధ్యాయే న్మాం పరమేశ్వరమ్,
అచింత్యరూప మవ్యక్త - మనంత మమృతం శివమ్. 26

ఆదిమధ్యాంతరహితం - ప్రశాంతం బ్రహ్మకారణమ్,
ఏకం విభుం చిదానంద - మరూపమజమద్భుతమ్. 27

శుద్ధస్ఫటికసంకాశ - ముమాదేహార్ధధారిణమ్,
వ్యాఘ్రచర్మాంబరధరం - నీలకంఠం త్రిలోచనమ్. 28

జటాధరం చంద్రమౌళిం - నాగయజ్ఞోపవీతినమ్,
వ్యాఘ్రచర్మోత్తరీయం చ - వరేణ్య మభయప్రదమ్. 29

వరాభ్యా మూర్ధ్వహస్తాభ్యాం - బిభ్రాణం పరశుం మృగమ్,
భూతిభూషితసర్వాంగం - సర్వాభరణభూషితమ్. 30

ఏవ మాత్మారణిం కృత్వా - ప్రణవం చోత్తరారణిమ్,
జ్ఞానవిర్మథనాభ్యాసా - త్పాక్షా త్పశ్యతి మాం జనః. 31

(ఇఁక ఇక్కడ ధ్యాన విధానమును జెప్పుచున్నాడు) చింతింపరానివాడు, సృష్టి-స్థితి-లయముల కతీతుడైనవాఁడు, జ్ఞానానందములో నిమగ్నుడైనవాఁడు, స్ఫటికకాంతిగలవాఁడు, అర్ధనారీశ్వరుడు, పులి చర్మము నుత్తరీయముగా ధరించినవాడు, అభయదాత, నీలకంఠుడు, ముక్కంటి, మీదుచేతులతో గొడ్డలిని, లేడిని దాల్చినవాఁడు, భస్మాభరణముగల వాడినైన నన్ను ధ్యానించవలెను, ఆత్మను అరణికొయ్యగను, ఓంకారమును ఉత్తరాణిగా యొనర్చి, జ్ఞానముతో మధించిన యెడల తేజోస్వరూపుడ నన్ను నిరీక్షించవలెను.



*వేదవాక్యైరలభ్యోఽహం - న శాస్త్రై ర్వాపి చేతసా,*
*ధ్యానేన వృణుతే యో మాం - సర్వదాఽహం వృణోమి తమ్. 32*

*నాఽవిరతో దుశ్చరితాఽన్నా - శాంతో నాఽసమాహితః,*
*నాఽశాంతమానసో వాపి - ప్రజ్ఞానేన లభేత మామ్. 33*

*జాగ్రత్స్వప్నసుషుప్త్యాది - ప్రపంచో యః ప్రకాశతే,*
*తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా - సర్వబంధైః ప్రముచ్యతే. 34*

*త్రిషు ధామసు యద్భోగ్యం - భోక్తా భోగశ్చ యద్భవేత్,*
*తేభ్యో విలక్షణ స్సాక్షీ - చిన్మాత్రోఽహం సదాశివః. 35*

వేదములను బఠించుటచేతగాని, శాస్త్రములను బఠించుటచేతగాని, నేను లభ్యమగువాఁడను గాను, కాని యెవఁడైతే నిర్మలమైన అథవా స్థిరమైన చిత్తముతో నన్ను ధ్యానించునో అట్టివాడికి నేనే బ్రసన్నుడనై వశమయ్యెదను. దురాచారము వలన విముక్తిని బొందనివాడు, శాంతిలేనివాడు,





నిశ్చలమైన మనస్సులేనివాడు నన్ను బొందలేడు. కేవలము తత్త్వజ్ఞానము చేత నన్ను బొందును. జాగ్రత్స్వప్నసుషుప్త్యాది యే ప్రపంచము ప్రకాశించుచున్నదో అట్టి పరబ్రహ్మ స్వరూపమును నేనేయని తెల్సికొని సంసార బంధమునుండి విముక్తిని బొందును. జాగ్రత్స్వప్న సుషుప్త్యావస్థలయందు అనుభవింపఁదగినది, అనుభవించువాడు అనుభవమెద్దిగలదో అట్టివాడికి విలక్షణుడగు సర్వసాక్షిజ్ఞాన మాత్రుండగు సదాశివుండను గూడ నేనే.

*కోటిమధ్యాహ్నసూర్యాభం - చంద్రకోటిసుశీలతమ్,*
*చంద్రసూర్యాగ్నినయనం - స్మేరవక్త్రసరోరుహమ్.* 36

*ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ*
*స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా,*
*సర్వాధ్యక్ష స్సర్వభూతాధివాస*
*స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ.* 37





*ఏకో వశీ సర్వభూతాంతరాత్మా*
*ప్యేకం బీజం నిత్యదా యః కరోతి,*
*తం మాం నిత్యం యేzనుపశ్యంతి ధీరా*
*స్తేషాం శాంతి శ్శాశ్వతీ నేతరేషామ్.* **38**

*అగ్ని ర్యథైకో భువనం ప్రవిష్టో*
*రూపం రూపం ప్రతిరూపో బభూవ,*
*ఏక స్తథా సర్వభూతాంతరాత్మా*
*న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః.* **39**

*వేదేహ యో మాం పురుషం మహాంత*
*మాదిత్యవర్ణం తమసః పరస్తాత్,*
*స ఏవ విద్వా నమృతోzత్ర భూయా*
*న్నాన్యః పంథా అయనాయ విద్యతే.* **40**

కోటి సంఖ్యాకమైన సూర్యులతో సమానమగు





కాంతియు, కోటి సంఖ్యాకమైన చంద్రులతో సమానమగు శీతలత్వముగల యట్టి సూర్యచంద్రాగ్ని నేత్రములు గల నా ముఖపద్మమును స్మరించుము. సమస్తప్రాణులయందున్నట్టి, సర్వవ్యాపి, సర్వాంతర్యామియునైన సర్వేశుడు నిర్గుణుడగు సర్వసాక్షియొక్కడే అయియున్నాడు. సర్వభూతాంతర్గతమై ప్రధానబీజమగు నన్ను ధ్యానించువారికే శాశ్వతమైన ముక్తి లభించును. అన్యులకు లేదు. అగ్ని యొక్కటే అయినను ఏ ప్రకారముగా భువనములోని అనేకాకారములైన పదార్థములలో ప్రవేశించి యనేకాకారములుగా నగుపడినను నిరాకారముగానే యుండునట్లు ఒక్కడైన పరమేశ్వరుడు సమస్త భూతములయందును ప్రవేశించియున్నను సంసారిక సుఖదుఃఖములకతీతుడై ప్రత్యేకముగా నుండును. (నిర్లిప్తుడని తాత్పర్యము) నన్ను అతిప్రాచీనునిగాను, మహాత్మునిగాను, సూర్యకాంతిగలవాడినిగాను, నన్ను దెలిసికొనిన యెడల ముక్తిని బడయును. పండితునికి మోక్షమున కింతకంటె మరొకమార్గములేదు.





హైరణ్యగర్భం విదధామి పూర్వం
వేదాంశ్చ తస్మై ప్రహిణోమి యోऽహమ్,
తం దేవ మీడ్యం పురుషం పురాణం
నిశ్చిత్య మాం మృత్యుముఖా త్ప్రముచ్యతే. 41

ఏవం శాన్త్యాదియుక్తస్సన్ - వేత్తి మాం యస్తు తత్త్వతః,
నిర్ముక్తదుఃఖసన్తాన - స్సోఽన్తే మయ్యేవ లీయతే. 42

ఇతి శ్రీపద్మపురాణే శివగీతాయాం ద్వాదశోऽధ్యాయః.

నన్ను మొదట (ప్రప్రథమమున) బ్రహ్మను బుట్టించి వాడికి వేదములొసగినవాడినిగాను, పురాణపురుషునిగాను దేవ వంద్యునిగాను దెల్సికొనినవాఁడు మృత్యువాఁతబడడు, శమదమాది గుణములతో గూడుకొనినవాడై ఈ విధముగా నన్ను దెల్సికొనునో అట్టివాఁడు దుఃఖములను బరిత్యజించి నాలో నైక్యమందుచున్నాడు.

ఇది పద్మపురాణాంతర్గతమగు శివగీతలో పంద్రెండవ అధ్యాయము సమాప్తము.



# త్రయోదశాధ్యాయము

## మోక్ష యోగము

*సూత ఉవాచ:*

*ఏవం శ్రుత్వా కోసలేయ - స్తుష్టో మతిమతాం వరః,*
*సప్రచ్ఛ గిరిజాకాంతం - సుభగం ముక్తిలక్షణమ్.* **1**

*భగవన్! కరుణావిష్ట - హృదయ! త్వం ప్రసీద మే,*
*స్వరూపం లక్షణం ముక్తేః - ప్రబ్రూహి పరమేశ్వర!* **2**

*సాలోక్యమపి సారూప్యం - సార్ష్ట్యం సాయుజ్యమేవ చ,*
*కైవల్యం చేతి తాం విద్ధి - ముక్తిం రాఘవ! పంచధా.* **3**

*మాం పూజయతి నిష్కామ - స్సర్వదాఽజ్ఞానవర్జితః,*
*స మే లోకం సమాసాద్య - భుంక్తే భోగాన్యథేప్సితాన్.* **4**

*జ్ఞాత్వా మాం పూజయేద్యస్తు - సర్వకామవివర్జితః,*
*మయా సమానరూప - స్సన్మమ లోకే మహీయతే.* **5**





సూతుడు చెప్పుచున్నాడు:-రాముడీ విషయమును విని ముక్తిలక్షణమును అడుగ నుపక్రమించెను. రాముడు బలుకుచున్నాడు. ఓ దయామయా! మీరు నన్ననుగ్రహించి ఇఁకపై ముక్తి లక్షణములఁ జెప్పుమని యడిగెను. శ్రీభగవంతుడా ముక్తి లక్షణమును గురించి యిట్లుపదేశించుచున్నాడు: ఓ రామా! ఆలకింపుము. ముక్తిసాలోక్యము, సారూప్యము, సాన్ప్యము, సాయుజ్యము, కైవల్యమని యైదు రకాలుగా నున్నది. నిష్కామముగా నన్ను బూజించువాఁడు అజ్ఞానములేనివాఁడై నాలోకమునకు వచ్చి తన కోరికలనన్నింటిని యనుభవించు ననియు, సమానమైన లోకమందలి నివాసము సాలోక్యముక్తియనఁబడును. కోరికలులేక సర్వోత్తమాదులతో నన్ను గుర్తించి కొలచువాఁడు సమానరూపత్వమును బొందును. (భగవత్సమానమును దాల్చుట సారూపముక్తి యనబడును. దీనినే కొందరు సారూప్యముక్తి యని యందురు.)



ఇష్టాపూర్తాని కర్మాణి - మత్ప్రీత్యై కురుతే తు యః,
యత్కరోతి యదశ్నాతి - యజ్జుహోతి దదాతి యత్. 6

య త్తపస్యతి తత్సర్వం - యః కరోతి మదర్పణమ్,
మల్లోకే స శ్రియం భుంక్తే - మత్తుల్యం ప్రాభవం భజన్. 7

యస్తు శాంత్యాదియుక్తస్స - న్మా మాత్మత్వేన పశ్యతి,
స జాయతే పరంజ్యోతి - రద్వైతం బ్రహ్మ కేవలమ్. 8

ఇష్టాపూర్తాదికర్మలను నాప్రీతికై యెవడైతే ఆచరించునో వాఁడు చేసినది యంతయు, భుజించునది, హోమము జేసినది, దానము జేసినది, తపంబొనర్చినది మదబుద్ధితో నెవడు చేయునో వాఁడు నాలోకమున నాతోబాటు వైభవములననుభవిస్తు సార్ష్టముక్తిని బొందును (సరూపముగానైశ్వర్యమునను భవింపఁబడుదాని ధర్మమె సార్ష్టముక్తియనబడును.) ఎవ్వడైతే శాంత్యాదులతోగూడి నన్ను పరమాత్మునిగా జూచునో వాఁడు సాయుజ్యమును పిమ్మట నుత్కృష్టమగు పరంజ్యోతియై

కేవలమద్వైతమగు కైవల్యముక్తిని బొందును. (సాయుజ్యమనగా తాదాత్మ్యము అదియును కైవల్యము అనగా నభిన్నత్వము, అద్వైతమనుట, ఇట్లు రెండు విధములగు ముక్తులను శాన్త్యాదులతో గూడినవాఁడే పొందును) ఆత్మ స్వరూపములో గలిసి పోవుటే ముక్తియని చెప్పబడినది.

*ఆత్మస్వరూపావస్థానం - ముక్తి రిత్యభిధీయతే,*
*సత్యం జ్ఞానమనంతం య - దానందం బ్రహ్మ కేవలమ్.* 9

*సర్వధర్మవిహీనం చ - మనోవాచా మగోచరమ్,*
*సజాతీయవిజాతీయ - పదార్థానా మసంభవాత్.* 10

*అతస్తద్వ్యతిరిక్తానా - మద్వైతమితి సంజ్ఞితమ్,*
*మత్వా రూపమిదం రామ! - శుద్ధం య దభిధీయతే.* 11

*మ య్యేవ దృశ్యతే సర్వం - జగత్ స్థావరజంగమమ్,*
*వ్యోమ్ని గంధర్వనగరం - యథా దృష్టం న దృశ్యతే.* 12



సత్యజ్ఞానానందమై నిర్వికారమై సర్వధర్మవిహీనమై మనోవాగగోచరమై సజాతీయ స్వగతభేదరహితమై యద్వైతమగు నీ రూపును శుద్ధమైనదిగా తలంపుము. నాయందే జంగమస్థావరాత్మకమగు ఈ జగత్తు చూడబడుచున్నది. మరియు నాకాశమున గంధర్వ నగరము (మాయాపట్టణము) చూడబడి మాయమైనట్లు అనాదియగు నజ్ఞానముచేత సమస్త జగత్తు నాతోనే కల్పింపబడుచున్నది.

*అనాద్యవిద్యయా విశ్వం - సర్వం మయ్యేవ కల్ప్యతే,*
*మమ స్వరూపజ్ఞానేన - యదాZవిద్యా ప్రణశ్యతి.* **13**

*తదైక ఏవ వర్తే Zహం - మనోవాచా మగోచరః,*
*సదైవ పరమానంద - స్స్వప్రకాశ శ్చిదాత్మనా.* **14**

*న కాలః పంచభూతాని - న దేశో విదిశశ్చ న,*
*మదన్యం నాస్తి యత్కించి - త్తదా వర్తేZహమేకలః.* **15**





**న సందృశే తిష్ఠతి మే స్వరూపం**
**న చక్షుషా పశ్యతి మాం తు కశ్చిత్,**
**హృదా మనీషా మనసాఽభిక్లప్తం**
**యే మాం విదు స్తే హ్యమృతా భవన్తి.** *16*

నాయొక్క నిరుపాధిక స్వరూపమును దెలిసికొనుట చేత నెప్పుడును ద్వైత జ్ఞానము నశించునో అప్పుడు నేను మాత్రము మనోవాక్కులకగోచరుడనై యేకాకినై యుండెదను. జ్ఞానాత్మచేత స్వప్రకాశుండనై యెల్లప్పుడు పరమానందము గలవాడినై యుందును. నన్ను విడచి దేశకాలాదిగ్భ్రాతములు లేవు. నాకంటెను భిన్నమైనదించుకయు లేకుండ నేనొక్కడినే జరింతును. నా స్వరూపమును జూచుటకు శక్యము గాదు, నన్నెవడైనను చర్మచక్షువుతోఁ జూడలేడు. హృదయములో నిష్టమగు మనస్సుతో నియమితుడనగు నన్నుఁజూచినవారు ముక్తిని బడయుగలరు.





శ్రీరామ ఉవాచ :

*కథం భగవతో జ్ఞానం - శుద్ధం మర్త్యస్య జాయతే,*
*తత్రోపాయం హరే! బ్రూహి - మయి తేZను గ్రహో యది. 17*

*విరజ్య సర్వభూతేభ్య - ఆవిరించిపదాదపి,*
*ఘృణాం వితత్య సర్వత్ర - పుత్రమిత్రాదికేష్వపి. 18*

*శ్రద్ధాలుర్మోక్షశాస్త్రేషు - వేదాంతజ్ఞానలిప్సయా,*
*ఉపాయనకరో భూత్వా - గురుం బ్రహ్మవిదం వ్రజేత్. 19*

*సేవాభిః పరితోష్యైవం - చిరకాలం సమాహితః,*
*సర్వవేదాంతవాక్యార్థం - శృణుయా త్సుసమాహితః. 20*

శ్రీరాముఁడు బ్రశ్నించుచున్నాడు: ఓ పరమేశ్వరా! నాయందనుగ్రహమున్నచో శుద్ధమైన భగవద్భక్తి మానవుల కెట్లులవడగలదో దాని మార్గము (ఉపాయము)ను జెప్పుము అని రాముడు బ్రశ్నించెను. శ్రీ భగవంతుడుద్బోధించు



చున్నాడు:- బ్రహ్మపదమునుండియు వైరాగ్యమును బొంది దయావంతుడై కుమారులయందును స్నేహితుల యందును సమానమైన బుద్ధిగలిగి వేదాంతశాస్త్రము నందు శ్రద్ధవహించి వేదాంత జ్ఞానసంపాదనమునకై కానుకఁజేపట్టి బ్రహ్మవేత్తయగు గురువును జేరవలెను. చిరకాల మాతనిని సేవించి వారి యనుగ్రహముతో సమస్త వేదాంత వాక్యమును స్థిరచిత్తముతో నాలించవలెను.

*సర్వవేదాంతవాక్యానా - మపి తాత్పర్యనిశ్చయమ్,*
*శ్రవణం నామ తత్ప్రాహు - స్సర్వే తే బ్రహ్మవాదినః.* 21

*లోహమణ్యాదిదృష్టాంతై - ర్యుక్తిభి ర్య ద్విచింతనమ్,*
*తదేవ మననం ప్రాహు - ర్వాక్యార్థస్యోపబృంహణమ్.* 22

*నిర్మమో నిరహంకారస్సమస్సంగవివర్జితః,*
*సదా శాంత్యాదియుక్త స్సన్ - ఆత్మన్యాత్మాన మీక్షతే.* 23



**యత్సదా ధ్యానయోగేన - తన్నిదిధ్యాసనం స్మృతమ్,**
**సర్వకర్మ క్షయవశా - త్సాక్షాత్కారోఽపి చాత్మనః.** **24**

**కస్యచి జ్ఞాయతే శీఘ్రం - చిరకాలేన కస్య చిత్,**
**కూటస్థానీహ కర్మాణి - కోటిజన్మార్జితాన్యపి.** **25**

సమస్త వేదాంతవాక్యముల తాత్పర్యమొకే నిశ్చయముగా తెలిసికొనుటే శ్రవణమనబడును. లోహము మణి మొదలగు దృష్టాంతయుక్తులతోఁజింతన జేయుటే మననమని చెప్పుదురు. ఎల్లప్పుడును శాంత్యాదిగుణములతో గూడియుండి మమకారాహంకారములు లేక సంగరహితుఁడై స్వాత్మయందు పరమాత్మను నిరీక్షిస్తు ఎల్లప్పుడు ధ్యానసంబంధము గలిగియుండుటేనిది ధ్యాసమందురు. కర్మనాశమువలన నాత్మ సాక్షాత్కారము ఒకరికి త్వరగాను మరొకరికి ఆలస్యముగాను అగును. కోటి జన్మార్జితములైనను చెడకేకరీతిగా నుండు కర్మములు జ్ఞానముచేతనే నశించును. కర్మాచరణముల చేత నశింపవు.



జ్ఞానేనైవ వినశ్యంతి న - తు కర్మాzయుతైరపి,
జ్ఞానాదూర్ధ్వం తు యత్కించి -త్పుణ్యం వా పాపమేవ వా. 26

క్రియతే బహు వాప్యల్పం - తేనాయం విలిప్యతే.
శరీరారంభకం యత్తు - ప్రారబ్ధం కర్మ జన్మనః. 27

తద్భోగేనైవ నష్టం స్యా - న్నతు జ్ఞానేన నశ్యతి,
నిర్మోహో నిరహంకారో - నిర్లేప స్సంగవర్జితః. 28

సర్వభూతేషు చాత్మానం - సర్వభూతాని చాత్మని,
యః పశ్యన్సంచరత్యేష - జీవన్ముక్తో zభిధీయతే. 29

అహినిర్ల్వయినీ యద్వ - ద్ద్రష్టుః పూర్వం భయప్రదా,
తతోzస్యన భయం కించి - త్తద్వ ద్ద్రష్టురయం జనః. 30

జ్ఞానోత్పత్త్యనంతరమున నేపాటి పుణ్యపాపములు చేసినను వాటితో గట్టబడడు. శరీరాంభకమగు ప్రారబ్దకర్మ మేదియున్నదో అది జీవునికి యనుభవముచేత నాశమందును

గాని, జ్ఞానముచేత నశించదు. అహంకార మమకారములు లేక సాంగత్యమును వదలి నిర్లిప్తుడై సమస్త భూతముల యందాత్మను, ఆత్మయందు సమస్త ప్రాణులను ఎవ్వడు దర్శించునో మరియు నన్ను ధ్యానించునో వాడే జీవన్ముక్తుడనబడును. తెలిసికొను పర్యంతము పాము పార భయపెట్టును. పిదపఁదొలగును. అట్లే వీడును చూచినవారికి భయాదులను గల్పింపక ఉదాసీనుడై యుండును.

*యదా సర్వే ప్రముచ్యంతే - కామా యేఽస్య వశంగతాః,*
*అథ మర్త్యోఽమృతో భవ - త్యేతావదనుశాసనమ్.* 31

*మోక్షస్య న హి వాసోఽస్తి - న గ్రామాంతరమేవ వా,*
*అజ్ఞానహృదయగ్రంథి - నాశో మోక్ష ఇతి స్మృతః.* 32

*వృక్షాగ్రచ్యుతపాదో య - స్స తదైవ పతత్యధః,*
*తద్వజ్జ్ఞానవతో ముక్తి - ర్జాయతే నిశ్చితాఽపి తు.* 33



*తీర్థే చండాలగేహే వా - యది వా నష్టచేతనః,*
*పరిత్యజన్ దేహమేవం - జ్ఞానాదేవ విముచ్యతే.* **34**

*నంవీతో యేన కేనాశ్చ - న్భక్ష్యం వాऽభక్ష్యమేవ వా,*
*శయానో యత్ర కుత్రాపి - సర్వాత్మా ముచ్యతేऽత్ర సః.* **35**

*క్షీరాదుద్ధృతమాజ్యం య - ద్క్షిప్తం పయసి తత్పునః,*
*న తేనైవైకతాం యాతి - నంసారే జ్ఞానవాం స్తథా.* **36**

*నిత్యం పఠతి యోऽధ్యాయ - మిమం రామ! శృణోతి వా,*
*స ముచ్యతే దేహబంధా - దనాయాసేన రాఘవ!* **37**

*తతస్సంయతచిత్తస్త్వం - నిత్యం పఠ మహీపతే!*
*అనాయాసేన తేనైవ - సర్వథా మోక్ష మాప్స్యసి.* **38**

*ఇతి శ్రీపద్మపురాణే శివగీతాయాం త్రయోదశోऽధ్యాయః.*

ఎప్పుడైతే వీడియధీనము నందున్న సమస్త వాసనలు వదలబడుచున్నవో అప్పుడా మానవుడు ముక్తిని బొందునని





విధించబడినది. మోక్షమునకావాసమైనది గ్రామాంతర వేదోకాదు, అజ్ఞానమనెడు చిత్తగ్రంథి మోక్షమని యాదేశించబడినది. కాలు జారడముతోనే చెట్టు పైనుండి కిందబడిన మాదిరిగా జ్ఞానోదయమేర్పడగానే ముక్తి కరతలామలకమగుట నిశ్చయము. పుణ్య క్షేత్రమందుగాని జండాలుని గృహమునందుగాని జైతన్యమును వీడి దేహమును వదలననుజ్ఞానముతోనే ముక్తి నిశ్చయముగా నేర్పడును. ఉత్తమాధములలో నెవ్వనితో గూడియున్నను యెక్కడ పరుండినను భక్ష్యాభక్ష్యములను భక్షించినను జ్ఞానియగు వాడు ముక్తిని తప్పకుండ బొందును. సంసారము నందేయున్నను జ్ఞాని పాలనుండి దీయబడిన వెన్న మాడ్కి మరల పాలలో గలియనట్లుగా సంసారములో గలసియుండడని భావము. (ఇక్కడ శ్రీ మహాత్మా బసవేశ్వరుని వచనము ప్రసంగ సంగతమైనది)





బ.వ. బెణ్ణికరిగితుప్ప వాడ బళికమత్తె బెణ్ణెయాగడునోడా.
తెలుగు: వెన్న కరిగి నెయ్యిగా మారిన బిదప మళ్లీ వెన్నయగునా? అట్లే శైవము నుండి వీర శైవుఁడైన బిదప మళ్ళీ శైవుఁడుగాడని యర్థము.

ఓ రామా ! ప్రతిదిన మీ యంధ్యాయంము నెవ్వరుబఠించుచున్నారో, వినుచున్నారో అట్టి వారు తప్పక దేహబంధమునుండి అనాయాసముగా ముక్తిని బడయుదురు. కనుక జీతేంద్రియుడవై నిశ్చల మనస్సుతో నీ యధ్యాయము బఠించుము. దానిచే నీకనాయాస ముక్తి లభించును.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతమైన శ్రీ శివగీతయందు పదమూడవ అధ్యాయము సమాప్తము.



# చతుర్దశాధ్యాయము

## పంచకోశోపాసన

శ్రీరామ ఉవాచః-

*భగవన్! యది తే రూపం - సచ్చిదానందవిగ్రహమ్,*
*నిష్కలం నిష్క్రియం శాంతం - నిరవద్యం నిరంజనమ్. 1*

సర్వధర్మ విహీనం చ - మనోవాచా మగోచరమ్,
సర్వవ్యాపినమాఽత్మాన - మీక్షతే సర్వతస్స్థితమ్. 2

ఆత్మవిద్యాతపోమూలం - తద్బ్రహ్మోపనిషత్పరమ్,
అమూర్తం సర్వభూతాత్మా - కారం కారణకారణమ్. 3

యత్తదదేశ్య(?) మగ్రాహ్యం - త ద్గ్రాహ్యం వా కథం భవేత్,
అత్రోపాయ మజానాన - స్తేన ఖిన్నోఽస్మి శంకర! 4

శృణు రామ! ప్రవక్ష్యామి - తత్రోపాయం మహాభుజ!



సగుణోపాసనాభిస్తు - చిత్తైకాగ్ర్యం విధాయ చ. 5

శ్రీరాముఁడు ప్రశ్నించుచున్నాడు: ఓ భగవంతుఁడా! జ్ఞానానందమయమై అంశములు లేక క్రియలు లేక దోషములు లేక శాంతమై సామాన్య ధర్మహీనమై వాచామగోచరమై సర్వవ్యాపియై యుండి ఆత్మవిద్యాతపంబులకు మొదల్గాని బ్రహ్మోప నిషత్తుల కంటెను పరంబైన అమూర్తమైన సమస్తభూత స్వరూపంబయ్యు నిట్టిదని నిరూపించుటకును, గ్రహించుటకును వీలులేనిదైన యెడల దానిని దెల్సికొనుటకెట్లు సాధ్యపడును? ఉపాయమేమిటో తెలియక ఖిన్నుడనైతిని (ఉపాయము నుడివెను) శ్రీభగవాను ఉవాచ: (శివుడాదేశించుచున్నాడు) రామా! ఉపాయమును వివరించెదను వినుము. సగుణోపాసనము చేతనే మొట్టమొదట చిత్తైకాగ్రతను నేర్చి స్థూలారుంధతీ న్యాయమున పిదప వానియందు చిత్తమును బ్రవర్తింపఁజేయువలెను (స్థూలారుంధతీన్యాయమనగా





ప్రక్కనున్న నేదో ఒక గొప్ప నక్షత్రమును మొదట జూపి పిద
క్రమముగా నిజమైన సూక్ష్మముగా నున్న అరుంధతీ నక్షత్రము
జూపుట) అట్లుగానె నిర్గుణ పరబ్రహ్మను దెలిసికొనుట
ముందు సగుణోపాసనము చేత చిత్తైకాగ్రతనూని నిర్గుణుడన
పూర్వోక్తలక్షణ లక్షితుండనగు నన్ను దెల్సికొనవలయును.

స్థూలారుంధతికాన్యాయా - త్తత్ర చిత్తం ప్రవర్తయేత్,
తస్మిన్నన్నమయే పిండే - స్థూలదేహే తనుభృతామ్.

జన్మవ్యాధిజరామృత్యు - విలయే వర్తతే దృఢా,
ఆత్మబుద్ధిరహంమానా - త్కదాచి న్నైవ హీయతే.

ఆత్మా జాయతే నిత్యో - మ్రియతే వా కథంచన,
సంజాయతేZ స్తి విపరి - ణమతే వర్ధతేZపిచ.
క్షీయతే నశ్యతీత్యేతే - షడ్భావా వపుష స్మృతాః,
ఆత్మనో న వికారిత్వం - ఘటస్థనభసో యథా.



సగుణోపాసనాభిస్తు - చిత్తైకాగ్ర్యం విధాయ చ. 5

శ్రీరాముఁడు ప్రశ్నించుచున్నాడు: ఓ భగవంతుఁడా! జ్ఞానానందమయమై అంశములు లేక క్రియలు లేక దోషములు లేక శాంతమై సామాన్య ధర్మహీనమై వాచామగోచరమై సర్వవ్యాపియై యుండి ఆత్మవిద్యాతపంబులకు మొదల్కొని బ్రహ్మోప నిషత్తుల కంటెను పరంబైన అమూర్తమైన సమస్తభూత స్వరూపంబయ్యు నిట్టిదని నిరూపించుటకును, గ్రహించుటకును వీలులేనిదైన యెడల దానిని దెల్సికొనుటకెట్లు సాధ్యపడును? ఉపాయమేమిటో తెలియక ఖిన్నుడనైతిని (ఉపాయము నుడివెను) శ్రీభగవాను ఉవాచ: (శివుడాదేశించుచున్నాడు) రామా! ఉపాయమును వివరించెదను వినుము. సగుణోపాసనము చేతనే మొట్టమొదట చిత్తైకాగ్రతను నేర్చి స్థూలారుంధతీ న్యాయమున పిదప వానియందు చిత్తమును ప్రవర్తింపఁజేయవలెను (స్థూలారుంధతీన్యాయమనగా



ప్రక్కనున్న నేదో ఒక గొప్ప నక్షత్రమును మొదట జూపి పిదప క్రమముగా నిజమైన సూక్ష్మముగా నున్న అరుంధతీ నక్షత్రమును జూపుట) అట్లుగానె నిర్గుణ పరబ్రహ్మను దెలిసికొనుటకు ముందు సగుణోపాసనము చేత చిత్తైకాగ్రతనూని నిర్గుణుడను, పూర్వోక్తలక్షణ లక్షితుండనగు నన్ను దెల్సికొనవలయును.

**స్థూలారుంధతికాన్యాయా - త్త్రత చిత్తం ప్రవర్తయేత్,**
**తస్మిన్నన్నమయే పిండే - స్థూలదేహే తనుభృతామ్. 6**

**జన్మవ్యాధిజరామృత్యు - విలయే వర్తతే దృఢా,**
**ఆత్మబుద్ధిరహంమానా - త్కదాచి న్నైవ హీయతే. 7**

**ఆత్మా జాయతే నిత్యో - మ్రియతే వా కథంచన,**
**నంజాయతేZ స్తి విపరి - ణమతే వర్ధతేZపిచ. 8**

**క్షీయతే నశ్యతీత్యేతే - షడ్భావా వపుష స్మ్రుతాః,**
**ఆత్మనో న వికారిత్వం - ఘటస్థనభసో యథా. 9**



***ఏవమాత్మా వపు స్తస్మా - దితి సంచింతయే ద్బుధః,***
***మూషానిక్షిప్తహేమాభః - కోశః ప్రాణమయో భవేత్. 10***

జననము వ్యాధి మున్నగు వాటితో గూడియున్న అన్నమయమగునట్టి స్థూల దేహమున ఆత్మత్వబుద్ధి మనుజాలకు నిశ్చలముగా నుండును. ఆత్మ నశించదు. మళ్ళీ జననమందును. అది నిత్యము (శాశ్వతముగా నుండును) పుట్టెను, ఉన్నది, మారెను, పెరిగెను, క్షీణించెను, నశించెను అని శరీరమున కారు భావములుండును. ఘటాకాశమునకెట్లో ఆత్మకు నట్లే వికారముగాని, దేహముగాని లేదు. అన్నమయకోశమున మూసయందుంచబడిన బంగారము వలె ప్రాణమయ కోశముండును. ఇది యాత్మగాదు. క్షుత్పిపాసాదిపీడగల జడము.

***క్షుత్పిపాసాపరాభూతో - నాఽయమాత్మా యతో జడః,***
***చిద్రూప ఆత్మా యేనైవ - స్వదేహ మభివశ్యతి. 11***



ఆత్మైవ హి పరం బ్రహ్మ - నిర్లేప స్సుఖనీరధిః,
న తదశ్నాతి కం చైత - న్న తదశ్నాతి కించన. 12

తతఃప్రాణమయే కోశే - కోశేZస్త్యేవ మనోమయః,
స సంకల్పవికల్పాత్మా - బుద్ధీంద్రియసమాహితః. 13

కామః క్రోధ స్తథా లోభో - మోహో మాత్సర్యమేవ చ,
మదశ్చేత్యరిషడ్వర్గో - మమతేచ్ఛాదయోZపి వా. 14

మనోమయస్య కోశస్య - ధర్మా ఏతస్య తత్ర తు,
యా కర్మవిషయా బుద్ధి - ర్వేదశాస్త్రార్థనిశ్చితా. 15

జ్ఞానానందములకు పరిమితి లేని యేయాత్మ తనను దానె దెలిసికొనునో ఆతడే దుఃఖరహితుడగును. పరబ్రహ్మ యనఁబడును. ఇట్టి పరబ్రహ్మ యొకదానికి భోగ్యముగాదు. ఒకటియు నీ బ్రహ్మమునకు భోగ్యము కానేరదు. అట్టి



ప్రాణమయు కోశమున మనోమయుకోశమున్నది. బుద్ధీంద్రియముతో గూడిన యా మనోమయకోశము సంకల్ప వికల్పాత్మకమని తెలియవలెను. మమత ఇచ్ఛాదులును కామాద్యరిషడ్వర్గంబును మనోమయకోశంబు యొక్క ధర్మంబులు. కర్మవిషయకమగుబుద్ధి జ్ఞానేంద్రియ ములతోబాటు విజ్ఞానమయ కోశము వలవ జన్యము.

*సా తు జ్ఞానేంద్రియైస్సార్ధం - విజ్ఞానమయకోశతః,*
*ఇహ కర్తృత్వాభిమానీ స - ఏవ తు న సంశయః.* **16**

*ఇహాముత్ర గతి స్తస్య - జీవో వ్యావహారికః,*
*వ్యోమాదిసాత్త్వికాంశేభ్యో - జాయంతే ధీంద్రియాణి తు. 17*

*వ్యోమ్న శ్శ్రోత్రం భువో ఘ్రాణం - జలాజ్జిహ్వాZథ తేజసః,*
*చక్షుర్వాయోస్త్వగుత్పన్నా - తేషాం భౌతికతా తతః.* **18**

*వ్యోమాదీనాం సమస్తానాం - సాత్త్వికాంశేభ్య ఏవ తు,*



***జాయతే బుద్ధిమనసీ - బుద్ధిః స్యా న్నిశ్చయాత్మికా.*** **19**

***వాక్పాణిపాదపాయూపస్థాని - కర్మేంద్రియాణి తు,***
***వ్యోమాదీని రజోzం శేభ్యో - వ్యస్తేభ్యస్తాన్యనుక్రమాత్.*** **20**

ఈ లోకమున సర్వకార్యము లందును నేనే చేయుచున్నాను అను కర్తృత్వాభిమానము ఐహిక, పారత్రిక గతులు, సత్కార్మాచరణము మొదలగునవి యన్నియు నా విజ్ఞాన కోశాంతర్గతునకే వర్తించును. వీడే జీవుఁడని వ్యవహారింప బడుచున్నాడు. పంచ మహా భూతంబుల సాత్వికభాగముల నుండి జ్ఞానేంద్రియములు బుట్టుచున్నవి. ఆకాశమునుండి శ్రోత్రేంద్రియము. భూమి నుండి జ్ఞానేంద్రియము, జలము నుండి జిహ్వేంద్రియము, తేజస్సునుండి చక్షురింద్రియము, వాయువు నుండి త్వగింద్రియములు బుట్టుచున్నవి. పంచభూతముల నుండి బుట్టినవి గనుకనే పాంచ భౌతికములని



పేర్లున్నవి (వ్యవహరించనగును). ఈ పంచ మహాభూతముల యొక్క సాత్విక భాగముల నుండే బుద్ధి మనస్సు బుట్టినవి. అందు బుద్ధి నిశ్చయాత్మకము. మనస్సు సంశయాత్మకము, ఇట్టి పంచమహాభూతములు వ్యస్తములైన రజోంశముల నుండి వేర్వేరుగా పాణి, పాదము, పాయువు, ఉపస్థ యను కర్మేంద్రియము లుద్భవించినవి.

*సమస్తేభ్యో రజోZంశేభ్యః - పంచప్రాణాదివాయవః,*
*జాయంతే సప్తదశక - మేవం లింగశరీరకమ్.* **21**

*ఏతల్లింగశరీరం తు - తప్తాయపిండవద్యతః,*
*పరస్పరాధ్యాసయోగా - త్సాక్షిచైతన్యసంయుతమ్.* **22**

*తదానందమయః కోశో - భోక్తృత్వం ప్రతిపద్యతే,*
*విద్యాకర్మఫలాదీనాం - భోక్తేహాముత్ర స స్మృతః.* **23**



*యదాధ్యాసం విహాయైష - స్వస్వరూపేణ తిష్ఠతి,*
*అవిద్యామాత్రసంయుక్త - స్సాక్ష్యాత్మా జాయతే తదా.* 24

*ద్రష్టాంతఃకరణాదీనా - మనుభూతే స్మృతేరపి,*
*అతోఽన్తఃకరణాధ్యాసా - దధ్యాపిత్వేన చాత్మనః.* 25

పంచభూతముల రజోంశముల చేరిక వలన ప్రాణాది పంచవ్యవహారము గల వాయువులు పుట్టుచున్నవి. జ్ఞానేంద్రియ పంచకం, కర్మేంద్రియ పంచకము, వాయు పంచకము మనో బుద్ధిద్వయ విశిష్ట సప్తదశాత్మకము లింగ శరీరము. ఇట్టి లింగ శరీరము కాల్చబడిన ఇనుపగుండు వలెనే పరస్పరారోపయోగము వలన సాక్షియగు చైతన్యముతోఁ గూడినది యగును. అదియే ఆనందమయ కోశము. అది సర్వవిషయ భోక్తృత్వమును బడయుచున్నది. ఆ యానందమయ కోశమే యచ్చటను పరమునను భోక్తయని చెప్పబడుచున్నది. సుషుప్తియందు





తాను బింబ రూపమున నెప్పుడుండునో అప్పుడవిద్యా మాత్రముతోఁ గూడి సాక్షియగుచున్నది. ఇంద్రియాను భవములకు, స్మృతికిని చైతన్య స్వరూపుడు సాక్షీభూతుడగు చున్నాడు. అందుచేత అంతఃకరణముతో పరస్పరాధ్యాస కలుగుట వలన ఆత్మయందు భోక్తృత్వము మరియు సాక్షిత్వము అధ్యస్తములగును. ద్వివిధములైన ధర్మాలు పరస్పరముగా విరుద్ధములైనను అధ్యాసచేత ఆత్మలో నుత్పన్నమగును.

*భోక్తృత్వం సాక్షితా చేతి - ద్వైధం త స్యోపపద్యతే,*
*ఆతపశ్చాపి తచ్ఛాయా - తత్ప్రకాశే విరాజతే.* 26

*ఏకో భోజయితా తత్ర - భుంక్తేఽన్యః కర్మణః ఫలమ్,*
*క్షేత్రజ్ఞం రథినం విద్ధి - శరీరం రథమేవ తు* 27

*బుద్ధిం తు సారథిం విద్ధి - ప్రగ్రహం తు మనస్తథా,*
*ఇంద్రియాణి హయాన్విద్ధి - విషయాం స్తేషు గోచరాన్.* 28





*ఇంద్రియైర్మనసా యుక్తం - భోక్తారం విద్ధి పూరుషమ్,*
*ఏవం శాంత్యాదియుక్తస్స - న్నుపాస్తే య స్సదా ద్విజః. 29*

*ఉద్ఘాట్యోద్ఘాట్యైక మేకం - యద్వైవం కదలీతరోః,*
*వల్కలాని తతః పశ్చా - ల్లభతే సారముత్తమమ్. 30*

*తథైవ పంచకోశేషు - మనస్సంక్రమయన్ క్రమాత్,*
*తేషాం మధ్యే తతస్సార - మాత్మానమపి విందతి. 31*

పరమాత్ముని తేజము (ప్రకాశము - వెల్తురు) నుండి యెండ మరియు నీడలు బ్రకాశించుచున్నవి. దృగ్గోచరమగుచున్నవి. సుఖదుఃఖాదులను అనుభవించు వాఁడొక్కడే. మిగతవాఁడు కర్మఫలములను భావించుచున్నాడు. శరీరమును రథముగాను, క్షేత్రజ్ఞుడైన జీవుని రథికునిగాను, బుద్ధిని సారథిగాను, మనస్సును కళ్ళెముగాను తెలిసికొనుము. ఇంద్రియములను గుఱ్ఱములుగాను, ఇంద్రియ గోచరములగు



విషయములను ఆ యశ్వములు సంచరించు ప్రదేశములుగాను, ఇంద్రియములు మరియు మనస్సు చేతనుగూడిన యాత్మను ఉపభోక్తయగు పురుషునిగాను దెలిసికొనుము.

మానవుడు అరటి చెట్టు యొక్క పట్టలను (పై భాగములను) ఒక్కొక్కదానిని క్రమముగా దీసి వైచికొనుచు, పిదప దాని యొక్క ఉత్తమమైన (సారభూతమగు) కాడనేవిధముగ బడయుచున్నాడో అదే ప్రకారముగ శాంతి-శమ-దమాది సత్వగుణ సంపన్నుఁడై సర్వదా నన్నుపాసనజేయు భక్తుఁడు అన్నమయాది పంచకోశములయందొక్కొక్క దానిని గ్రమముగా నిరాకరించుచు, బోయి చివరికి యందలి సారభూతమగునాత్మను గుర్తించుచున్నాడు.

***ఏవం మనస్సమాధాయ - సంయతో మనసి ద్విజః,***
***అథ ప్రవర్తయేచ్చిత్తం - నిరాకారే పరాత్మని. 32***



తతో మనః ప్రగృహ్ణాతి - పరాత్మానం హి కేవలమ్,
యత్తదద్రేశ్యమగ్రాహ్యా - మస్థూలాద్యుక్తిగోచరమ్. *33*

భగవన్ శ్రవణేనైవ - ప్రవర్తంతే జనాః కథమ్,
వేదశాస్త్రార్థసంపన్నా - యజ్వాన స్సత్యవాదినః. *34*

శృణ్వంతోఽపి తథాత్మానం - జానంతే నైవ కేచన,
జ్ఞాత్వాఽపి మన్యతే మిథ్యా - కిమేత త్తవ మాయయా. *35*

ఏవమేవ మహాబాహో - నాత్ర కార్యా విచారణా,
దైవీ హ్యేషా గుణమయీ - మమ మాయా దురత్యయా. *36*

మామేవ యే ప్రపద్యంతే - మాయా మేతాం తరంతి తే,
అభక్తా యే మహాబాహో - మమ శ్రద్ధావివర్జితాః. *37*

ఫలం కామయమానాస్తే - చైహికాముష్మికాదికమ్,
క్షయిష్ణ్వల్పం పాతిశయం - తతః కర్మఫలం మతమ్. *38*





**తదవిజ్ఞాయ కర్మాణి - యే కుర్వంతి నరాధమాః,**
**మాతుఃపతంతి తే గర్భే - మృత్యోర్వక్త్రే పునఃపునః. 39**

**నానాయోనిషు జాతస్య - దేహినో యస్య కస్యచిత్,**
**కోటిజన్మార్జితైః పుణ్యై - ర్మయి భక్తిః ప్రజాయతే. 40**

మహాబాహులు గల ఓ రామా! ఇది యింతే, ఈ విషయమున ఏ మాత్రము చింతింపవలదు. సత్వరజతమో గుణాత్మమగు నా యీ దైవమాయనుదాప శక్యముగానిది. నిన్నెవరు సంపూర్ణముగా శరణుబొందుచున్నారో అట్టివారు ఈ మాయను దాటగలరు. ఓ మహాబాహో! నాయందు శ్రద్ధాసక్తులులేక, నన్నారాధింపక. ఇహపరలోక కామ్యఫలము నాసించుచు సంచరించేవారు నశించు స్వభావముగల స్వాతిశయమైన కర్మఫలమును బొందుదురు. ఆ విషయమును దెలియకయే నరాధములు కర్మఫలనాచరింతురో అట్టివారు మాటిమాటికి మాతృగర్భము నుండి పుట్టుచు, మృత్యువు



ముఖమునబడి మరణిస్తూ పలు బాధలను అనుభవింతురు. నానాయోనులందు జన్మించు జీవులలో నెవ్వరికో ఒక్కరికి మాత్రము అనేక జన్మల పుణ్యార్జితమువలన నాయందు భక్తి గలుగుచున్నది.

స ఏవ లభతే జ్ఞానం - మద్భక్తశ్శ్రద్ధయాన్వితః,
నాన్యకర్మాణి కుర్వాణో - జన్మకోటిశతైరపి. 41

తత స్సర్వం పరిత్యజ్య - మద్భక్తిం సముదాహర,
సర్వధర్మా న్పరిత్యజ్య - మామేకం శరణం వ్రజ, 42

అ హం త్వా సర్వపాపేభ్యో - మోక్షయిష్యామి మాశుచః,
యత్కరోషి యదశ్నాసి - యజ్జుహోషి దదాసి యత్. 43

యత్తపస్యసి రామ! త్వం - తత్కురుష్వ మదర్పణమ్,
తతః పరతరా నాస్తి - భక్తిర్మయి రఘూత్తమ! 44

ఇతి శ్రీపద్మపురాణే శివగీతాయాం చతుర్దశోఽధ్యాయః



నాపై శ్రద్ధాభక్తులు గలిగి నన్ను బూజించువాఁడే జ్ఞానమును బొందును. శతకోటి కామ్యకర్మలు జేసినప్పటికిన్ని యిట్టి జ్ఞానమును బొందనేరడు. కనుక సర్వమును బరిత్యజించి నా యందలి భక్తిని సాధించు (సంపాదించు)ము. సమస్త ధర్మములను బరిత్యజించి నన్నొక్కనినె శరణుబొందుము. నేను నిన్ను సమస్త పాపముల నుండి విముక్తిని గలుగజేసెదను. దుఃఖించకుము. (ఇట శ్రీకృష్ణుఁడు అర్జునునికి బోధించిన భగవద్గీతలో గూడ శ్లోకము యథాతథముగా నీ శ్లోకమునె గ్రహించినట్లుగా సుస్పష్టమగుచున్నది.)

కనుక ఓయీ రామా! నీవు జేయునది, భుజించునది, హోమము జేయునది, దాన మొనర్చునది, నీవు తపస్సు చేయున దంతయును నా కర్పించుము. నాయందలి భక్తి గలిగియుండుటే సర్వోత్కృష్టమైనది. ఇంతకంటెను సర్వోత్కృష్టమైనది మరొకటేదియును లేదు ( ఈ శ్లోకమును




గూడ భగవద్గీతలో యథాతథముగా గ్రహింపఁబడినట్లు స్ఫురిస్తుంది)

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణమందలి శివగీతలో నుపషత్తు బ్రహ్మ విద్యయందు యోగ శాస్త్రమున శ్రీ శివ-రామ సంవాదమున పంచకోశ నిరాకరణమను యోగము చతుర్దశాధ్యాయము పరిసమాప్తము.



# పంచదశాధ్యాయము

## భక్తియోగము

శ్రీరామ ఉవాచః-

భక్తిస్తే కీదృశీ దేవ - జాయతే వా కథం చ సా,
యయా నిర్వాణరూపం తు - లభతే మోక్షముత్తమమ్. 1

తద్బ్రూహి గిరిజాకాంత! - మయి తేZనుగ్రహో యది,
యో వేదాధ్యయనం యజ్ఞం - దానాని వివిధాని చ, 2

మదర్పణధియా కుర్యా - త్స మే భక్తస్స మే ప్రియః,
(అవిముక్తే దండకాయాం - శ్రీశైలే పుండరీకకే. 3

య ఉపాస్తే మమాకారం - స మే భక్త స్సమేప్రియః,)
సర్వభస్మ సమాదాయ - విశుద్ధం శ్రోత్రియాలయాత్. 4

అగ్ని రిత్యాదిభిర్మంత్రై - రభిమంత్ర్య యథావిధి,





*ఉద్ధూలయతి గాత్రాణి - తేన చార్చితి మామపి.* **5**

*తస్మాత్పరతరా భక్తి - ర్మమ రామ! న విద్యతే,*
*పర్వదా శిరసా కంఠే - రుద్రాక్షాన్ధారయేత్తు యః.* **6**

*పంచాక్షరీజపపర - స్స మే భక్త స్స మే ప్రియః,*

శ్రీరాముఁడు మాట్లాడు(ప్రశ్నించు) చున్నాడు: నీయందలి భక్తి యెటువంటిది? అది యేవిధముగా బుట్టుచున్నది; ఏవిధమై భక్తిచేత సుఖ ముత్తమమైన ముక్తి లభించునో ఓ శివదేవ, దానిని యాదేశించవల్సిందిగా ప్రార్థించెను. అందుకు పరమశివుఁ డాదేశించుచున్నాడు. ఎవడు వేదాధ్యయనము యజ్ఞము దాన ధర్మములు మదర్పణ బుద్ధిచేతఁ జేయునో అట్టివాఁడు నాకు ప్రియమైన భక్తుడు. ఎవడైతే శ్రోత్రియ గృహము నుండి యగ్ని భస్మమును దెచ్చి అగ్నిరితి మున్నగు మంత్రములతో నభిమంత్రించి



దేహమంతటికి బులుముకొని, దానితో నన్నారాధించునో రామా! ఇంతకంటె నుత్తముఁడగు భక్తుఁడు నాకు మరొకడు లేడు సుమా! (విశేషమున్నదియును భగవద్గీతలోని విషయమునకు సరియైనది) ఎల్లప్పుడు శిరస్సునందును, కంఠమునందును రుద్రాక్షల నెవడు ధరించునో ఎవఁడు శివ పంచాక్షరీ జపపరాయణుఁడో వారుభయులును నాకిష్టమైన భక్తులు.

*భస్మచ్ఛన్నో భస్మశాయీ - సర్వదా విజితేంద్రియః.* 7

*యస్తు రుద్రం జపేన్నిత్యం - చింతయే న్మా మనన్యధీః,*
*స తేనైవ చ దేహేన - శివ స్సంజాయతే స్వయమ్.* 8

*జపేద్యో రుద్రసూక్తాని - తథాథర్వశిరః పరమ్,*
*కైవల్యోపనిషత్ప్రోక్తం - శ్వేతాశ్వతరమేవ చ.* 9

*తతః పరతరో భక్తో - మమ లోకే న విద్యతే,*
*అన్యత్ర ధర్మాదన్యస్మా - దన్యత్రాస్మా త్కృతాకృతాత్.* 10



దేహమంతట భస్మమును బులుముకొని అందే శయనించి జితేంద్రియుఁడై, మరియు నెవడు రుద్రుఁడగు నన్ను నిర్మల స్థిరమైన మనస్సుతో జింతన జేసి జపము గావించునో, మరియు నెవడు స్వయముగా రుద్రసూక్తములను ఉత్తమమగు నధర్వశిరమును కైవల్యోప నిషత్తు, శ్వేతాశ్వతర సూక్తములను బంచునో అట్టి వాఁడా దేహమునే శివుడగు చున్నాడు. అంతకంటె నుత్తముండగు భక్తుడు నీలోకమునందు లేడుసుమా! ధర్మాధర్మములకంటె విలక్షణమైనది, కార్యకారణా దులకంటె నన్యంబుగునదియు భూతభవిష్యత్తులకంటె నన్యంబునగునదెద్ది గలదో దానిని వివరించెద వినుము.

**అన్యత్ర భూతాద్భవ్యాచ్చ - యత్రవక్ష్యామి తచ్ఛృణు,**
**వదంతి యత్పదం వేదా - శ్శాస్త్రాణి వివిధాని చ. 11**

**సర్వోపనిషదాం సారం - దధ్నో ఘృతమివోద్ధృతమ్,**



*యదిచ్ఛంతో బ్రహ్మచర్యం - చరంతి మునయస్సదా.* 12

*తత్తే పదం సంగ్రహేణ - బ్రవీమ్యోమితి యత్పదమ్,*
*ఏతదేవాక్షరం బ్రహ్మ - ఏతదేవాక్షరం పరమ్.* 13

*ఏతదేవాక్షరం జ్ఞాత్వా - బ్రహ్మలోకే మహీయతే,*
*ఏతదాలంబనం శ్రేష్ఠ - మేతదాలంబనం పరమ్.* 14

*ఛందసాం యస్తు ధేనూనా - మృషభత్వేన చోదితః,*
*ఇదమేవావధిస్సేతు - రమృతస్య చ ధారణాత్.* 15

ఎటువంటి పరమపదమును గలుగజేయు వస్తువు పెరుగునుండి దీయబడిన వెన్నవలె సమస్త శాస్త్రముల చేతను వేదములతోడను దీయబడినదో - యే వస్తువు కోరబడినదై మునుల చేత బ్రహ్మచర్యమాచరింపఁబడు చుండెనో అట్టి దానిని నీకు సంక్షిప్తముగా వివరింతును. అదేదందువా ఓంకారము, అదే నాశరహితమగు పరబ్రహ్మము. దీనిని



దెలిసికొనియే బ్రహ్మలోకమును బొందుదురు. ఇదే అక్షరము. ఇదే పరము. ఛందస్సులనెడు గోవుల కేది ఋషభస్థానముఁ బొందెనో (ప్రధానత్వమనుట) అట్టిదే అక్షరము అవధి (నియామకమనుట) మోక్షధారణ వలన సంసార సాగరమునకు దీరము వంటిదగును (అజ్ఞాన నాశకమై మోక్షమును ప్రాపింపఁజేయును).

**మేదసా పిహితం కోశం - బ్రహ్మణో యత్పరం మతమ్,**
**చతస్రస్తస్య మాత్రాస్స్యు - రకారోకారకా తథా,**
**మకార శ్చావసానేఽర్ధ - మాత్రేతి పరికీర్తితా.** 16

**పూర్వాత్ర భూశ్చ ఋగ్వేదో - బ్రహ్మష్టవసవస్తథా,**
***గార్హపత్యశ్చ గాయత్రీ - గంగా ప్రాతస్సవ స్తథా.*** 17

**ద్వితీయా తు భువో విష్ణు - రుద్రోఽనుష్టుబ్యజుస్తథా,**



*యమునా దక్షిణాగ్నిశ్చ - మాధ్యందినసవస్స్మృతః.* **18**

*తృతీయా చ సువస్సామా - న్యాదిత్యశ్చ మహేశ్వరః,*
*అగ్ని రాహవనీయశ్చ - జగతీ చ సరస్వతీ.* **19**

*తృతీయం సవనం ప్రోక్త - మథర్వత్వేన యన్మతమ్.*
*చతుర్థీ యావసానే ఽర్ధ - మాత్రా సా సోమలోకగా.* **20**

*అథర్వాంగిరస స్సంవ - ర్తకోఽగ్ని శ్చ మహాంస్తథా,*
*విరా ట్సభ్యావసథ్యౌ చ - శుతుద్రిర్యజ్ఞపుచ్ఛకః.* **21**

దివ్య జ్ఞానముతోఁ జుట్టబడిన పరబ్రహ్మ కోశమునఁ బరగునట్టి యాప్రణవమునకు నాలుగు మాత్రలు. అకార, ఉకార, మకారములు - ఈ మూఁడును అవసానంబున అర్ధమాత్రయును (ఇది ఆగమ రీత్యా చెప్పఁబడినది. వ్యాకరణ రీత్యా గాదు) మొదటి మాత్రకు భూమి ఋగ్వేదము బ్రహ్మ అష్ట వసువులుగార్హపత్యవహి గాయత్రి గంగపాత్రః స్సవనము



ఇవి దేవతలు, రెండవ మాత్రకు భవర్లోకము. విష్ణువు రుద్రుడు అనుష్టుప్ ఛందస్సు యజుర్వేదము యమునానది, దక్షిణాగ్ని మధ్యందిన సవనము దేవతలు. మూడవ మాత్రకు సువర్లోకము, సామవేదము, సూర్యుడు మహేశ్వరుడు, ఆహవనీయాగ్ని జగతీ ఛందస్సు. సరస్వతీసాయంసవనము దేవతలు. నాలుగవ అర్ధమాత్రకు సంవర్తకాగ్ని, అథర్వణ వేదము, అథర్వాంగీరసులు, విరాట్ సభ్యావసధ్యులు శుతుద్రియజ్ఞపుచ్ఛుడును దేవతలు.

ప్రథమా రక్తవర్ణా స్యా - ద్వితీయా భాస్వరా మతా,
తృతీయా విద్యుదాభా సా - చతుర్థీ శుక్లవర్ణినీ. 22

జాతం చ జాయమానం చ - తదోంకారే ప్రతిష్ఠితమ్,
విశ్వం భూతం చ భువనం - విచిత్రం బహుధా తథా, 23
జాతం చ జాయమానం య - త్తత్సర్వం రుద్ర ఉచ్యతే,





**తస్మి న్నేవ పునః ప్రాణా - స్సర్వమోంకార ఉచ్యతే 24**

**ప్రవిలీనం తదోంకారే - పరం బ్రహ్మ సనాతనమ్,**
**తస్మాదోంకారజాపీ య - స్స ముక్తో నాత్ర సంశయః. 25**

మాత్రల రంగులిలా ఉండునని యాదేశించుచున్నాడు. అందు ప్రథమ మాత్ర రంగు ఎరుపుగాను, రెండవ మాత్ర రంగు భాస్వర వర్ణముగాను, మూఁడవ మాత్ర రంగు ఎరుపుకాంతిగాను, నాలుగవ మాత్ర రంగు మక్లరంగుగాను ఉండును. అనేక విధముల చిత్రమగునట్టియు పుట్టినదియు, పుట్ట బోవునదియు నగు ప్రపంచము ఓంకారము నందు బ్రతిష్ఠించబడెను. పుట్టినది పుట్టబోవునదియు నగు నీ సమస్తమును రుద్రుడే. ఆయనలోనే యీ ప్రాణములున్నవి. సమస్తము రుద్రాభిన్నమగు నోంకారమేయని నిరూపించబడి యున్నది. దీనివలన నోంకారశివుల కభేదముగనె చెప్పఁబడినది. ఈ ఓంకారమున సనాతనమగు బ్రహ్మము లీనమ్మై





యుండుటవలన ప్రణవమును జపించువాఁడు ముక్తి నొందుటలో సందేహము లేదు.

త్రేతాగ్నేస్మార్తవహ్నే ర్వా - శైవాగ్నే ర్వాసమాహితమ్,
భస్మాభిమంత్ర్య యో మాంతు - ప్రణవేన ప్రపూజయేత్.26

తస్మాత్పరతరో భక్తో - మమ లోకే న విద్యతే,
శాలాగ్నే ర్దావవహ్నే ర్వా - భస్మానీయాభిమంత్రితమ్. 27

యో విలింపతి గాత్రాణి - స శూద్రోఽపి విముచ్యతే
కుశపుష్పైర్బిల్వదళైః - పుష్పైర్వా గిరిసంభవైః. 28

యో మామర్చయతే నిత్యం - ప్రణవేన ప్రియో హి సః
పుష్పం ఫలం సమూలం వా - పత్రం సలిలమేవ వా. 29

యో దద్యా త్ప్రణవై ర్మహ్యం - తత్కోటిగుణితం భవేత్
అహింసా సత్య మస్తేయం - శౌచ మింద్రియనిగ్రహః 30





యజ్ఞాగ్నినుండిగాని (శ్రోతాగ్ని యనుట) స్మార్తాగ్ని నుండి గాని, అగ్నిహోత్రము లేక సామాన్యముగానున్న హోమశాలయందలి యగ్నినుండి గాని సంపాదించిన భస్మమును ప్రణవముతో మంత్రించి నన్నెవడు బూజించునో, వాడికి సరియగు భక్తుఁడు మరో భక్తుఁడుండడు. అభిమంత్రించబడిన శాలాదావవహ్నులలోని భస్మమును బూసికొను శూద్రుఁడైనను ముక్తుడగును. దర్భాగ్రంబులను బిళ్వదళంబులను గిరి పుష్పంబులను ప్రణవమంత్రమున నన్ను బూజించువాఁడు నాకు బ్రియమైన వాఁడగును. పత్ర ఫల పుష్ప సలిలముల నాకేది భక్తితో సమర్పించినను కోటిరెట్లు ఫలమధికముగా లభించునని భావము. అహింస, సత్యము, భూతప్రేమ ప్రముచ్చిలింపమి శుచి జితేంద్రియత్వము నిత్యాధ్యయనములు ఎవనియందుండునోవాఁడే నాకు ప్రేమపాత్రుడగు భక్తుడగును.

**యస్యాప్యధ్యయనం నిత్యం - స మే భక్త స్స మే ప్రియః,**



ప్రదోషే యో మమ స్థానం - గత్వా పూజయతే తు మామ్. 31

స పరాం శ్రియ మాప్నోతి - పశ్చా న్మయి విలీయతే,
అష్టమ్యాం చ చతుర్దశ్యాం - పర్వణో రుభయోరపి. 32

భూతిభూషితసర్వాంగో - యః పూజయతి మాం నిశి,
కృష్ణపక్షే విశేషేణ - స మే భక్తస్స మే ప్రియః. 33

ఏకాదశ్యాముపోష్యైవ - యః పూజయతి మాం నిశి,
సోమవారే విశేషేణ - స మే భక్తో న నశ్యతి. 34

పంచామృతై స్స్నాపయే ద్యః - పంచగవ్యేన వా పునః,
పుష్పోదకైః కుశజలై స్తస్మా న్నాన్యః ప్రియో మమ. 35

ప్రాతఃకాలమున శివమందిరమునకు వెళ్లి యచట నన్నర్చించిన వాఁడుత్తమైశ్వర్యమును బొంది యంత్య సమయమున నాలో నైక్యమగును. అష్టమి చతుర్దశులలో భస్మమును ధరించి రాత్రులలో నన్ను బూజించువారు



ముఖ్యమైన భక్తులు. కృష్ణ పక్షమందైనను ఇంకను విశేషముగా నన్ను బూజించినచో నధిక ఫలము లభించును. సోమవారమునందుగాని యేకాదశి యందుగాని ఉపోష్యముండి రాత్రులలో నన్నర్చించిన భక్తునికెన్నడును కీడువాటిల్లదు, పంచామృతంబులతో (పంచగవ్యములతో) పుష్పోదక-కుశోదకములతో నాకభిషేకము జేయించినవాఁడే నా కత్యంతప్రియమైన భక్తుఁడు. (ఇక్కఁడ పంచగవ్యములనగా గోమయ పంచితములనుగాక పాలు, పెరుగు, నెయ్యి కపిల గోవు తల్లి కూతుండ్ల యొక్క నెయ్యి, వెన్న యని గ్రహించవలెను)

*పయసా సర్పిషా చాపి - మధునేక్షురసేన వా,*
*పక్వామ్రఫలజేనాపి - నారికేళజలేన వా.* *36*

*గంధోదకేన వా మాం యో - రుద్రమంత్రం సముచ్చరన్,*
*అభిషించేత్తతో నాన్యః - కశ్చి త్ప్రియతమో మమ.* *37*





ఆదిత్యాభిముఖో భూత్వా - హ్యూర్ధ్వబాహు ర్జలే స్థితః,
మాం ధ్యాయ న్రవిబింబస్థ - మథర్వాంగిరసం జపేత్. 38

ప్రవిశేన్మే శరీరేzసౌ - గృహం గృహపతిర్యథా,
బృహద్రథంతరం వామ - దేవ్యం దేవవ్రతాని చ. 39

తద్యోగయాజ్యదేహాంశ్చ - యో గాయతి మమాగ్రతః,
ఇహ శ్రియం పరాం భుక్త్వా - మమ సాయుజ్య మాప్నుయాత్. 40

ఈశావాస్యాదిమంత్రాన్యో - జపే న్నిత్యం మమాగ్రతః,
మత్సాయుజ్య మవాప్నోతి - మమ లోకే మహీయతే. 41

భక్తియోగో మయా ప్రోక్త - ఏవం రఘుకులోద్వహ,
సర్వకామప్రదోమత్తః కి - మన్య చ్ఛ్రోతు మిచ్ఛసి, 42

ఇతి శ్రీపద్మపురాణే శివగీతాయాం పంచదశోఽధ్యాయః.

పాలు, నెయ్యి, తేనె, చెఱుకు రసము, మామిడి పండు





రసము, టెంకాయనీరు, గంధము, వీటిలో నెద్దానితో నైనను రుద్రమంత్రములతో నన్ను అభిషేకించిన వాని కంటెను మరొకడు నాకు ప్రియమైనవాఁడు లేడు. సూర్యాభిముఖముగా పైకెత్తిన రెండు బాహులు గలవాఁడై నీటిలో నిలిచి సూర్యబింబస్థునిగా నన్ను ధ్యానించి అథర్వాంగిరసమును జపించువాఁడు నిజ గృహములోనికి యజమానుడు ప్రవేశించు నట్లుగా నాయందాతఁడు ప్రవేశించును. బృహద్రథంతరమున వామదేవ్యమును, దేవవ్రతములును వీటికి సంబంధించిన యాగము (యజ్ఞము) జేయ గావలసిన మంత్రములను నా యెదుట నెవఁడు గానము జేయునో అట్టివాఁడు ఇహలోకములో సమస్త సంపదలను బొంది యంత్య సమయమున మత్సాయుజ్యమును బడయును. ఏవడీశావాశ్యాది మంత్రములను నా యెదుట ప్రతినిత్యము జపించునో వాడు నా సాయుజ్యమును బొందును. కావున ఓయీ దాశరధీ!





భక్తియోగము నా చేత నిట్లు పదేశింపబడినది. ఇది సమస్త కోరికలను మోక్షము నొసఁగును. ఇఁకను నేమి యడుగనుంటివో ప్రశ్నింపుము.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతమైన శివగీతలో పదునైదవ అధ్యాయము సమాప్తము.



# షోడశాధ్యాయము

## మోక్షాధికారి నిరూపణము

శ్రీరామ ఉవాచ:-

భగవన్! మోక్షమార్గో య - స్త్వయా సమ్య గుదాహృతః,
తత్రాధికారిణం బ్రూహి - తత్ర మే సంశయో మహాన్. 1

బ్రహ్మక్షత్రవిశశ్శూద్రా - స్త్రియశ్చాత్రాధికారిణః,
బ్రహ్మచారీ గృహస్థో వా – ఽనుపనీతోఽ థ వా ద్విజః. 2

వనస్థో వాఽవనస్థో వా - యతిః పాశుపతవ్రతీ,
బహునాఽత్ర కి ముక్తేన - యస్య భక్తి శ్శివార్చనే. 3

న ఏవాత్రాధికారీ స్యా - న్నాన్యచిత్తః కథంచన,
జడోఽన్ధో బధిరో మూకో - నిశ్శౌచః కర్మవర్జితః. 4



***అజ్ఞోపహాసా భక్తాశ్చ - భూతిరుద్రాక్షధారిణః,***
***లింగినో యశ్చ వా ద్వేష్టి - తే నైవాఙ్రతాధికారిణః 5***

శ్రీరాముడు ప్రశ్నించుచున్నాడు: ఓ పరమేశ్వరా! మోక్షమార్గమును గురించి సవిస్తారముగా నుపదేశించితివి. అట్టి మోక్షమునకధికారమున కర్హులెవరో ఎటువంటివారికది లభ్యమగునో, ఆ మార్గము నాదేశించుము. అందులో నాకు గొప్ప సంశయమేర్పడినది. అది విని భగవంతుడు(శివుడు) చెప్పుచున్నాడు: బ్రాహ్మణ, క్షత్రియ-వైశ్య-శూద్రులును, స్త్రీలును మోక్షమున కధికారులే. బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, ఉపనయనము గానివాడైనను, బ్రాహ్మణుడైనను, వనస్థుడైనను వనస్థుడుగాక పోయినను పాశుపతవ్రతదీక్షబూనిన యతికి గాని ఎక్కువ చెప్పనేటికి శివార్చన యందు భక్తి గలిగిన వారందరును ఇందధికారులే. జడుడు, చెవిటివాడు, అంధుడు, మూగవాడు, అపవిత్రుడు, కర్మశూన్యుడు, అజ్ఞుడు,

అపహాస్యభక్తుడు, విభూతి రుద్రాక్ష లింగములను ధరించిన వారిని ద్వేషించు వారు మాత్రము మోక్షమున కధికారులు గాజాలరు.

*యో మాం గురుం పాశుపతం - వ్రతం ద్వేష్టి నరాధిప,*
*విష్ణుం వా స న ముచ్యేత - జన్మకోటిశతైరపి.* 6

*అనేకకర్మసక్తో Zపి - శివజ్ఞానవివర్జితః,*
*శివభక్తివిహీనశ్చ - సంసారీ నైవ ముచ్యతే.* 7

*ఆసక్తాః ఫలసంగేన - యే త్వవైదికకర్మణి,*
*దృష్టమాత్రఫలాస్తే తు - న ముక్తావధికారిణః.* 8

*అవిముక్తే ద్వారవత్యాం - శ్రీశైలే పుండరీకకే,*
*దేహాంతే తారకం బ్రహ్మ - లభతే మదనుగ్రహాత్.* 9

*యస్య హస్తౌ చ పాదౌ చ - మనశ్చైవ సుసంయతమ్,*
*విద్యా తపశ్చ కీర్తిశ్చ - స తీర్థఫలమశ్నుతే.* 10



పశుపతి వ్రత గురువగు నన్నెవడు ద్వేషించునో హరిద్వేషమెవడు జేయునో, వాడు కోటి కల్పములకైనను అనేక కర్మలఁ జేసియు శివజ్ఞాన భక్తులుగాక సంసారియై బుట్టుచు ముక్తిని బొందలేడు. ఫలకాంక్షతో వామాచారాదుల యందు, ఆసక్తి గలవారు తత్ఫలములను మాత్రమే బొందగలరు. కాని మోక్షాధికారులు కానేరరు. కాశిలోను ద్వారకాపురములోను అథవా శ్రీశైలములోను పుండరీకము నందును దేహమును వదలువారు (మరణించువారు) నా యనుగ్రహము వలన తారక బ్రహ్మను బొందుదురు. ఎవ్వని కర చరణంబులు నియమితమై యుండునో విద్యా తపస్సు కీర్తి మొదలగునవి సమకూరునో వాడికే తీర్థ వాస ఫలము లభించును. లేకున్నచో, నాతీర్థావాసముచేత పాపమునే యనుభవించువాఁడగును.

**విప్రస్యానుపనీతస్య - విధిరేవ ముదాహృతః**
**నాభివ్యాహారయేద్బ్రహ్మ - స్వధానినయనాదృతే** *11*



*స శూద్రేణ సమస్తావ - ద్యావద్వేదాన్న జాయతే,*
*నామసంకీర్తనే ధ్యానే - సర్వ ఏవాధికారిణః.* **12**

*సంసారా న్ముచ్యతే జంతు - శ్శివతాదాత్మ్యభావనాత్,*
*తథా దానం తపో వేదా - ధ్యయనం చాన్యకర్మ వా.* **13**

*సహస్రాంశం తు నార్హంతి - సర్వదా ధ్యానకర్మణః,*
*జాతిమాశ్రమమం గాని - దేశం కాలమథాపి వా.* **14**

*ఆసవాదీని కర్మాణి - ధ్యానం నాపేక్షతే క్వచిత్.*
*గచ్ఛం స్తిష్ఠంశ్చరన్వాపి - శయానో వాఽన్యకర్మణి.* **15**

అనుపవీత బ్రాహ్మణునికి యిట్లు చెప్పఁబడినది: స్వధా దానాది పితృకార్యములఁదప్ప ఇతర సమయములలో వేదమునుచ్చరింపనీయగూడదు. వేద కర్మవలన జన్మలేని వరకు నా బ్రాహ్మణుఁడు శూద్రునితో సమానుఁడు. నామ సంకీర్తనము వలన ధ్యానము వలనను సమస్త జనులకు



నధికారముండును. శివతాదాత్మ్య భావనవలన నరుడు సంసారము నుండి ముక్తుఁడగును. కనుక ధ్యానమునకంటె దాన-తపో-వేదాధ్యయనములు వేయిరెట్లు తక్కువనుట, జాతియాశ్రమము, యమనియమాద్యష్టాంగములు, దేశము కాలము, ఆసనము కర్మలు మొదలగువానిని ధ్యానమపేక్షించదు (వాటితో ధ్యానము చేయువాని కనవసరములు). నడచుచు, నిలచుచు, పోవుచు. శయనించుచు వేరు పనియందుండియు పాపముతో (మైలతో) కూడిన వాఁడైనను ధ్యానము చేయుట వలన సంసారబంధము నుండి ముక్తుఁడగును.

**పాతకేవాపి యుక్తో వా - ధ్యానాదేవ విముచ్యతే,**
**నేహాభిక్రమనాశోఽస్తి - ప్రత్యవాయో న విద్యతే** *16*

**స్వల్పమప్యస్య ధర్మస్య - త్రాయతే మహతో భయాత్,**
**ఆశ్చర్యే వా భయే శోకే - క్షుతే వా మమ నామ యః** *17*



వ్యాజేనాపి స్మరన్మర్త్య - స్స యాతి పరమాం గతిమ్,
మహాపాపై రపి స్పృష్టో - దేహాంతే యస్తు మాం స్మరేత్. 18

పంచాక్షరీం నోచ్చరతి - స ముక్తో నాత్ర సంశయః,
విశ్వం శివమయం యస్తు - పశ్యత్యాత్మానమాత్మనా. 19

తస్య క్షేత్రేషు తీర్థేషు - కిం కార్యం వాన్యకర్మసు,
సర్వేణ సర్వదా కార్యం - భూతిరుద్రాక్షధారణమ్. 20

యుక్తేనాథాప్యయుక్తేన - శివభక్తి మభీప్సతా,
నరో భస్మసమాయుక్తో - రుద్రాక్షా న్యస్తు ధారయేత్. 21

మహాపాపైరపి స్పృష్టో - ముచ్యతే నాత్ర సంశయః,
అన్యాని శైవకర్మాణి - కరోతు న కరోతు వా. 22

శివనామ జపే ద్యస్తు - సర్వథా ముచ్యతే తు సః,
అంతకాలే తు రుద్రాక్షా - న్విభూతిం ధారయేత్తు యః. 23



*మహాపాపోపపాపౌఘై - రపి స్పృష్టో నరాధమః,*
*సర్వథా నోపసర్పంతి - తం జనం యమకింకరాః.* **24**

*బిల్వమూలమృదా యస్తు - శరీర ముపలింపతి,*
*అంతకాలేఽంతకజనై - స్సదూరీ క్రియతే నరః.* **25**

*ఇతి శ్రీపద్మపురాణే శివగీతాయాం షోడశోఽధ్యాయః.*

ఈ ధ్యానమునకు ఆరంభనాశములు లేవు. పాపము లేదు. ధర్మసంబంధమైనదించుకయైనను గొప్ప భయము (ఆపద) వలన రక్షించును. (ధ్యానము చేయు వానికి ఇతర భయము లేవి యుండవు) ఆశ్చర్య భయ శోక వ్యాజక్షతములతోను నా నామమునుచ్చరించినంతనే పరమగతి నొందును. (వ్యాజమనగా నేదో యొక మిష సాకుపైన ఒక పేరు చెప్పుటలో వాఁడు శివాయని యుచ్చరించుట, క్షుతమన తుమ్ముట, తుమ్మి సంకీర్తన జేయుట) మహాపాపముతో





గూడిన వాఁడును, అవసానంబున నన్నుస్మరించినను పంచాక్షరీ మంత్రము నుచ్చరించినను ముక్తిగాంచుటలో సంశయమే మాత్రమును లేదు. ప్రపంచమును శివమయముగాఁ దలచి నిర్మలమైన మనస్సుచేతఁ బరమాత్మను సాక్షాత్కరించువానికి తీర్థక్షేత్రాదిగమనముతో నగత్యము గూడలేదు. ఎల్లరు శివభక్తులును భస్మరుద్రాక్షలను ధరించుట జేయవలెను. అప్పుడెల్లరు శివభక్తులును భస్మ రుద్రాక్షలను ధరింపవలెను. శివభక్తి గోరువానికిది ముఖ్యముగానున్నది. భస్మమును ధరించి, రుద్రాక్షలను దాల్చినవాఁడు పాపిష్ఠుడైనను ముక్తినొందును. ఇతర శివకర్మలఁ జేసినను జేయుకపోయినను శివనామమునుచ్చరించిన యెడల తప్పక ముక్తిని బొందును. మహాపాప సమూహములతో జుట్టఁబడిన వాఁడైనను అంత్యకాలములో రుద్రాక్ష, విభూదులను ధరించువాడి దగ్గరకు యమకింకరులు రారు. భయపడెదరు. బిల్వ మూల మృత్తికను





(మట్టిని) శరీరమునకు ధరించుకొనినవాడికి యమదూతలు దూరముననే యుందురు.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతంబగు శివగీతలో పదియారవ అధ్యాయము సమాప్తము.



# సప్తదశాధ్యాయము

## పూజావిధానము

శ్రీరామ ఉవాచ:

*భగవన్! పూజితః కుత్ర - కుత్రవా త్వం ప్రసీదసి,*
*తద్బ్రూహి మమ జిజ్ఞాసా - వర్తతే మహతీ విభో.* 1

*మృదా వా గోమయేనాపి - భస్మనా చందనేవ వా,*
*సికతాభిర్దారుణా వా - పాషాణేనాపి నిర్మితా.* 2

*లోహేనవాథ రంగేణ - కాంస్యకర్పూరపిత్తలైః,*
*తామ్ర రౌప్యసువర్ణైర్వా - రత్నై ర్నానావిధైరపి* 3

*అథ వా పారదేనైవ - కర్పూ రేణాథ వా కృతా,*
*ప్రతిమా శివలింగం వా - ద్రవ్యై రేతైః కృతం తు యత్.* 4





తత్ర మాం పూజయే త్తేషు - ఫలం కోటిగుణో త్తరమ్.
మృద్దారుకాంస్యలోహైశ్చ - పాషాణేనాపి నిర్మితా. 5

గృహిణా ప్రతిమా కార్యా - శివం శశ్వదభీప్సతా,
ఆయు శ్శ్రియం కులం ధర్మం - పుత్రానాప్నోతి తైఃక్రమాత్. 6

బిల్వవృక్షే తత్ఫలే వా - యో మాం పూజయతే నరః,
పరాం శ్రియ మిహ ప్రాప్య - మమ లోకే మహీయతే. 7

బిల్వవృక్షం సమాశ్రిత్య - యో మంత్రా న్విధినా జపేత్,
ఏకేన దివసేనైవ - తత్పురశ్చరణం భవేత్. 8

యస్తు బిల్వవనే నిత్యం - కుటీం కృత్వా వసేన్నరః,
సర్వే మంత్రాః ప్రసిధ్యంతి - జపమాత్రేణ కేవలమ్. 9

పర్వతాగ్రే నదీతీరే - బిల్వమూలే శివాలయే,
అగ్నిహోత్రే కేశవస్య - సన్నిధౌ చ జపేత్తు యః. 10





శ్రీరాముడు ప్రశ్నించుచున్నాడు. పరమపూజ్యుడవైన ఓం శివా! నీవు ఏయే పూజా స్థలములలో మేము భక్తితోఁ జేయు పూజలందుకొనుటకు ఇష్టపడెదవో సెలవిమ్మని యడిగెను. అది విని శివుడిలాదేశించును. మట్టి గోమయము భస్మము. చందనము ఇసుక, కఱ్ఱ, ఊాయి రత్నము పాదరసము తగరము వెండి బంగారము ఇత్తడి రాగి కర్పూరము కంచు మొదలగువాటితో నాయాకారమునుగాని లేదా లింగాకృతిని గాని జేసికొని బూజించినట్లైతే అట్టి భక్తునకు కోటిరెట్లు ప్రతిఫలము లభించును. గృహస్థునకు మాత్రము మృత్తు (మట్టి) కంచుదారువు లోహము పాషాణము (రాయిశిల) వీనితో జేయబడిన శివుని పూజ బహుశ్రేష్ఠమైనది. ఫలితముగా ఆయువు సంపద వంశము ధర్మము పుత్రులు క్రమముగా పైయాకృతులతో జేయబడిన శివుని భక్తి మీరగా బూజించిన ఫలించును బిల్వ వృక్షమునందుగాని, తత్ఫలమునందుగాని,





నన్ను బూజించిన వాఁడిహమందు గొప్ప సంపదను బొంధి యంత్యకాలమున కైలాసమును జేరును. బిల్వవృక్షము సమీపమున మంత్రములను జపించిన ఒక దినమునందే పురశ్చరణ పూర్తి ఫలములభించును. బిల్వ వనమున గుడిసె వేసికొని నివసించినచో మంత్రములు జపించినంత మాత్రమున సిద్ధించును. పర్వతాగ్రంబున, నదియొడ్డున, మారెడు మూలమున, శివాలయంబునను, అగ్ని సన్నిధిని హరిసన్నిధిని, జపించిన దానవ యక్షరాక్షసులు మంత్ర జపమునకు విఘ్నము చేయలేరు.

నైవాస్య విఘ్నం కుర్వంతి - దానవా యక్షరాక్షసాః
తం న స్పృశంతి పాపాని - శివసాయుజ్య మృచ్ఛతి. 11

స్థండిలే వా జలే వహ్నౌ - వాయావాకాశ ఏవ వా,
గిరౌ స్వాత్మని వా యో మాం - పూజయేత్ప్రయతో నరః 12





స కృత్స్నం ఫల మాప్నోతి - లవమాత్రేణ రాఘవ,
ఆత్మపూజాసమా నాస్తి - పూజా రఘుకులోద్వహ. 13

మత్సాయుజ్య మవాప్నోతి - చండాలోఽప్యాత్మపూజయా.
సర్వా న్కామా నవాప్నోతి - మనుష్యః కంబలాసనే. 14

కృష్ణాజినే భవేన్ముక్తి - ర్మోక్ష శ్రీర్వ్యాఘ్రచర్మణి,
కుశాసనే భవేద్జ్ఞాన - మారోగ్యం పత్రనిర్మితే. 15

పాషాణే దుఃఖ మాప్నోతి - కాష్ఠే నానావిధాన్ గదాన్,
వస్త్రే శ్రియమవాప్నోతి - భూమౌ మంత్రో న సిద్ధ్యతి. 16

ఉదఙ్ముఖః ప్రాఙ్ముఖో వా - జపం పూజాం సమాచరేత్.

ఇతి పద్మపురాణే శివగీతాయాం సప్తదశోఽధ్యాయః.

కొండ బిలమున గాలిలో అగ్ని సమీపమున జలమున భూమిపైన ఆత్మలో నన్ను బూజించిన వారికి పాపములంటవు.





కొంచమైనను గొప్ప ఫలము లభించును. శివ సన్నిధిని అంత్యకాలమున జేరును. ఓ రామా! ఆత్మపూజతో సమానమైనది మరొకటి లేదు. చండాలుడైనను ఆత్మపూజ చేయుటవలన నా సాన్నిధ్యమును జేరుదురు. ఇక జపము కంబళియందు కూర్చొని చేసిన సమస్త కోరికలు ఫలించును. కృష్ణాజినమున గూర్చుండి జపించిన ముక్తి లభించును. వ్యాఘ్ర చర్మమున మోక్షము, సంపదయు, కుశాసనమున జ్ఞానము ఆకుతో జేయబడిన యాసనమువ ఆరోగ్యము. రాయిపై గూర్చుండి జపించిన దుఃఖము, కర్రపై రోగములు. వస్త్రము సంపదనిచ్చును. భూమిపై మంత్రము ఫలించదు. [illegible] వట్టినేల జపమునకుఁ దగదు. ఉత్తర ముఖముగాని తూర్పు ముఖముగా గాని జపమునకు [illegible] శ్రేష్ఠమైనది నుండును.

ఇది వ్యాసోక్తసంస్కృత పద్మపురాణమందలి [illegible] పదునేడవ అధ్యాయము సమాప్తము.



# అష్టాదశాధ్యాయము

## జపలక్షణము

శ్రీభగవా నువాచ:-

అక్షమాలావిధిం వక్ష్యే - శృణుష్వావహితో నృప,
సామ్రాజ్యం స్ఫటికో దద్యా - త్పుత్రజీవ: పరాం శ్రియమ్. 1

ఆత్మజ్ఞానం కుశగ్రంథీ - రుద్రాక్ష స్సర్వకామద:,
ప్రవాళైశ్చ కృతా మాలా - సర్వలోకవశప్రదా. 2

మోక్షప్రదా చ మాలా స్యా - దామలక్యా: ఫలై: కృతా,
ముక్తాఫలై: కృతా మాలా - సర్వవిద్యాప్రదాయినీ. 3

మాణిక్యరచితా మాలా - త్రైలోక్యస్య వశంకరీ,
నీలై ర్మరకతైర్వాపి - కృతా శత్రుభయప్రదా. 4





సువర్ణరచితా మాలా - దద్యాద్వై మహతీం శ్రియమ్,
తథా రౌప్యమయీ మాలా - కన్యాం యచ్ఛతి కామితామ్.5

ఉక్తానాం సర్వకామానాం - దాయినీ పారదైః కృతా,
అష్టోత్తరతం మాలా - తత్ర స్యాదుత్తమోత్తమా. 6

శతసంఖ్యోత్తమా మాలా - పంచాశన్మధ్యమా మతా,
చతుః పంచాశతీ యద్వా - ప్యథవా పన్నవింశతిః 7

అథవా పంచవింశత్యా - యది స్యాచ్ఛతనిర్మితా,
పంచాశదక్షరాణ్యత్రా - నులోమప్రతిలోమతః 8

ఇత్యేవం స్థాపయేత్స్పృష్టం - న కస్మై చిత్ప్రదర్శయేత్, 9
వర్ణైర్వ్యస్తయా యస్తు - క్రియతే మాలయా జపః

ఏకవారేణ తస్యైవ - పురశ్చర్యా కృతా భవేత్,
సవ్యపాణిం గుడే స్థాప్య - దక్షిణం చ ధ్వజోపరి. 10





శ్రీ పరమేశ్వరుడాదేశించు చున్నాడు: అక్ష(రుద్రాక్ష) మాలా విధిని బోధించెదను వినుము: స్ఫటికమాలతో జపించిన సామ్రాజ్యమునొసఁగును. పుత్ర జీవము సంపదనొసఁగును. కుశగ్రంథి యాత్మజ్ఞాన మొసఁగును. రుద్రాక్ష సమస్త కోరికలను ఫలింపఁజేయును. పగడాల మాల లోకమునే వశమొనర్చును. ఉసిరిక పండ్ల మాల మోక్ష మొసఁగును. ముత్యాల మాల సమస్త విద్యల నొసఁగును. మాణిక్య మాల సమస్త లోకమునే వశము గావించును. నీలమణుల చేతను, మరకతమణులతోను జేయబడిన మాల శత్రు భయంకరమైనది. బంగారపు గుండ్ల మాల గొప్ప సంపదనొసఁగును. వెండి గుండ్లతో జేయబడిన మాల కోరఁబడిన కన్య నొసఁగును. పైన బేర్కొనిన సమస్త కోరికలను ఫలింపఁజేయునది పాదరసపుగుండ్లతో జేయబడిన మాల. ఇది యుత్తమోత్తమమైనది. నూరు సంఖ్యగల మాల శ్రేష్ఠమైనది. ఏబది సంఖ్యగల మాల మధ్యమము లేదా యేబది





నాలుగు గలదైనను సరియైనదే. కనీసము ఇరువది యేడు సంఖ్య గల మాలికయైననను వేన యుండవలెను. ఇరువదియైదింటిచేఁ జేయబడిన మాల యధమమైనది. ఒకప్పుడు నూరు సంఖ్యచేత చేయఁబడిన మాలైన యెడల "అకారాది" క్షకారాంతముగా జపించి పదప "ళ" కారమును మే రువుగా జేసికొని అనులోమ ప్రతిలోమముల చేత వర్ణముల మాలికను స్థాపించవలెను. జపమాల నెవ్వరికిని జూపగూడదు. వర్ణములతోఁ జేసిన మాలతో నెవ్వడుఁ జపించునో వాడికొకేసారి జపముతో పురశ్చరణ పూర్తి ఫలము లభించును, మరియు ఎడమ హస్తమును గుదమందును, కుడిహస్తము శిశ్నముపై నుంచుట యోని ముద్రయనబడును. ఇది శ్రేష్ఠమైన ఆసనమనఁబడును.

**యోనిముద్రాబంధ ఏవం - భవేదాసనముత్తమమ్,**
**యోనిముద్రాసనే స్థిత్వా - ప్రజపే ద్య స్సమాహిత:.** *11*



*యం కంచి దపి వా మంత్రం - తస్య స్యుస్సర్వసిద్ధయః,*
*ఛిన్నా రుద్ధాస్తంభితాశ్చ - మీలితా మూర్ఛితా స్తథా.* **12**

*సుప్తా మత్తా హీనవీర్యా - దగ్ధాః ప్రత్యర్థిపక్షగాః,*
*బాలా యౌవనమత్తాశ్చ - వృద్ధా మంత్రాశ్చ యే మతాః.* **13**

*యోనిముద్రాసనే స్థిత్వా - మంత్రానేవంవిధాన్జపేత్,*
*తస్య సిద్ధ్యంతి తే మంత్రాః - నాన్యస్యతు కథంచన.* **14**

*బ్రాహ్మం ముహూర్తమారభ్య - మధ్యాహ్నం ప్రజపేన్మనమ్,*
*అత ఊర్ధ్వం కృతే జాప్యే - వినాశో భవతి ధ్రువమ్.* **15**

ఇట్లు యోని ముద్రాసనమును గూర్చొని యెవడైతే జపము జేయునో అట్టివాడికి సర్వసిద్ధులు ఏ మంత్రమును జపించినను లభించును. ఏ మంత్రములైనను యన ఈ దిగువ వివరింపఁబడిన వాటి వివరములను దెల్పుచున్నాడు: ఛిన్నములు, రుద్ధములు, స్తంభితములు, మిళితములు,



మూర్ఛితములు, సుప్తములు, మత్తములు, హీనవీర్యములు, దర్ధములు, ప్రత్యర్థి పక్షగములు, బాలములు, యౌవన మంత్రములు, వృద్ధమంత్రములు ఆయా కార్యములకని మంత్ర శాస్త్రమున ప్రసిద్ధములైనవి. పైన జెప్పిన మంత్రములేవి యైనను యోనిముద్రవలన సిద్ధించును. యోని ముద్రయందుండి జపించినవారికే ఆయా మంత్రములు సిద్ధించును. మరొకరికి సిద్ధింపవు. బ్రాహ్మీముహూర్తము మొదలుకొని మధ్యాహ్నము వరకే కామ్య ఫలములనొసంగు మంత్రములఁ జపించవలెను. ఆపైన జపించిన నాశము గలుగును (సంభవించును). ఇది యీ ముద్ర వలన జేయనగు నాయా మంత్రముల యొక్క విధానమై యున్నది.

**పురశ్చర్యావిధానేషు - సర్వకామ్యఫలేష్వపి,**
**నిత్యే నైమిత్తికే వాపి - తపశ్చర్యాసు వా పునః** **16**



*సర్వదైవ జపః కార్యో - న దోష స్తత్ర కల్పన,*
*యస్తు రుద్రం జపేన్ని త్యం - ధ్యాయమానో మమాకృతిమ్,*
*షడక్షరం వా ప్రణవం - నిష్కామో నిర్జితేంద్రియః.* **17**

*తథాథర్వశిరోమంత్రం - కైవల్యం వా రఘూత్తమ!*
*స తేనైవ చ దేహేన - శివస్సంజాయతే స్వయమ్.* **18**

*అధీతే శివగీతాం యో - నిత్యమేతాం జపేత్తు యః,*
*శృణుయాద్వా స ముక్తస్స్యా - త్సంసారాన్నాత్ర సంశయః.*
*ఏవముక్త్వా మహాదేవ - స్తత్రైవాంతరధీయత.* **19**

*రామః కృతార్థ మాత్మాన - మమన్యత తథైవ సః,*
*ఏవం మయా సమాసేన - శివగీతా సమీరితా.* **20**

నిత్యములు నైమిత్తికములు మొదలగు తపశ్చర్యల యందు యెల్లప్పుడు ప్రొద్దు నియమము లేకుండ జపము జేయవచ్చును. దోషము లేదు. ఎవడైతే నా యాకారమును



ధ్యానించుచూ నిష్కాముడై యింద్రియనిగ్రహముగలవాఁడై రుద్రమునుగాని, షడక్షరమునుగాని, ప్రణవమునుగాని, అథర్వ శిరంబునుగాని (అథర్వనోపనిషత్తని దీనిని గొందరందురు) కైవల్యో పనిషత్తునుగాని పఠించెదరో వారు ఆ దేహంబునందే శివులగుచున్నారు. ఎవడీ శివగీతను అధ్యయనముఁ జేయునో. యెవడు వినునో అట్టివాఁడు సంసారమునుండి ముక్తుడగును. దీనిలో నేమాత్రము సంశయము లేదు. ఈ విధముగా శివుఁడు రామునకుద్బోధించి యంతర్ధానుండయ్యెను.

ఏతాం యః ప్రజపేన్నిత్యం - శృణుయాద్వా సమాహితః
ఏకాగ్రచిత్తో యో మర్త్యో - తస్య ముక్తిః కరే స్థితా. 21

అత శృణుధ్వం మునయో - నిత్యమేతాం సమాహితాః
అనాయాసేనైవ ముక్తి - ర్భవితా నాత్ర సంశయః. 22

కాయక్లేశో మనఃక్షోభో - ధనహాని ర్న చాత్మనః,



*న పీడా శ్రవణాదేవ - యస్మాత్కైవల్యమాప్నుయాత్.*
*శివగీతా మతో నిత్యం - శృణుధ్వం మునిసత్తమాః,*
*అద్యప్రభృతి సన్సూత! - త్వమాచార్యః పితా గురుః.* **24**

*అవిద్యాయాః పరం పారం - యస్మాత్తారయితాసి నః,*
*ఉత్పాదక బ్రహ్మదాత్రో - ర్గరీయాన్ బ్రహ్మదః పితా.* **25**

*తస్మాత్సూ తాత్మజ! త్వత్త - స్సత్యం నాన్యోఽస్తి నో గురుః*
*ఇత్యుక్త్వా ప్రయయు స్స ర్వే - సాయంసంధ్యాముపాసితుమ్,*
*స్తువంత స్సూతపుత్రం తే - సంతుష్టా గోమతీతటమ్.* **27**

ఇతి పద్మపురాణే శివగీతాయాం అష్టాదశోఽధ్యాయః.

అంతటితో రాముఁడు కృతార్థుడనైతి ననుకొనెను. ఇట్లు నాచే సంక్షిప్తముగా నీ శివగీతనుపదేశించబడినది. ఇట్టి పరమ పవిత్రమైన శివగీతను ప్రతిదినమెవరైతే బఠింతురో వినెదరో ఏకాగ్రచిత్తముగలవారెవరో అట్టివారికి ముక్తి



"కరతలామలకము" వంటిదని గ్రహించవలెను. కావున ఓయీ మునులారా! ఇట్టి శివగీతను ప్రతి నిత్యము నిర్మలమైన భక్తితో నాలకించండి. అనాయాసముగా ముక్తి లభించును. దీనికి కాయక్లేశముగాని, మనస్సునకు క్షోభముగాని, ధనము ఖర్చుగాని, దేహమునకు పీడగాని లేదు. కేవలము శ్రవణము గావించుటచేతనే మోక్షము లభించును. కనుక ముని పుంగవులారా! శివగీతను తప్పకుండా నాలకించండి.

తరువాత ఋషులిట్లు బలికిరి: ఇటువంటి సూత్రపౌరాణికా! నీవే మాకు ఒజ్జవు (గురువు) తండ్రివి ఆచార్యుడవు. మాయు జ్ఞానమును బారదోలి మమ్ముద్ధరించినాడవు. కన్న తండ్రి, జ్ఞానమొసఁగు వారిలో జ్ఞాన ప్రదుడైన తండ్రే అధికుఁడని యున్నది. కనుక ఓయీ సూతపుత్రా! మాకు నీవే గురు శబ్ద వాచ్యుడవు అని మిగుల గొనియాడిరి. పురాణ కర్తయగు వ్యాసు డాదేశించెను- ఇట్టి





బలికి వారందరు సాయం సంధ్యా వందనము లాచరింపఁ సూతుని గొనియాడుచు ఆనందతుందిలురై గోమతీ నదీ తీరమునకుఁ బోయిరి.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతంబైన శివగీతయందు పదునెనిమిదవ అధ్యాయము

శివమ్ భూయాత్, పరిసమాప్తము

ఓం శాంతిః శాంతిః శాంతిరస్తు.

